# సౌగంధికప్రసవాపహరణము

## ద్విపదకావ్యము



శ్రీ రత్నాకరము గోపాలరాజుగారిచే

విరచితము

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స

వారిచే బ్రకటితము.



1949

# ఉపోద్ఘాతము

ఈ ద్విపదకావ్యము క్రీ. శ॥ 1868 సంవత్సరమున చెన్నపట్టణములో నేలటూరి సుబ్రహ్మణ్యాముగారి విద్యావిలాస ముద్రాక్షరశాలయందు పిళ్లారిసెట్టి రంగయ్యనాయనివారిచే ముద్రింపఁబడి ప్రకటింపఁబడియెను. ఆప్రతి నామిత్రులగు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు నా కిచ్చి యందలి చరిత్రాంశములఁగూర్చి వ్యాసమును వ్రాయఁగోరిరి. తర్వాత గ్రంథపీఠికభాగమును జదివి, ఆంధ్రపరిషత్పుస్తక భాండాగారములోని తాళపత్రగ్రంథములను పరిశోధించి, లేఖకప్రమాదములను గొన్నిఁటి సంస్కరించి పరిషత్పత్రికసంచికలో (ఫిబ్రవరి-మార్చి-1937) నొకవ్యాసమును వ్రాసితిని.

రత్నాకరాన్వయుఁడైన ఈకవి భట్టుకులజుఁడు. తండ్రిపేరు కృష్ణమరాజు. తనకులగోత్రములను గ్రంథమునందు చెప్పకపోయినను, ఈ రత్నాకరవంశజులు భట్టుకులమువా రని రత్నా

కరము సుబ్బరాజు రచించిన తిమ్మభూపాలకాభ్యుదయములోని యీక్రింది సీసపద్యమువల్ల గ్రహింపనగును.

సీ. పృథుయజ్ఞవాటి నావిర్భవించిన వంది
వరవృత్తి యెవ్వారి వర్తనంబు,
బహువిధాభయదాన భాసమానప్రవిష్ణు
భుజశాఖ యెవ్వారి పుట్టినిల్లు,
శ్రీకాళహస్తిధాత్రీవల్లభ కటాక్ష
పంక్తి యెవ్వారికిఁ బ్రాణరక్ష
నవరసరసికులౌ కవిపుంగవులను
గ్రహపాత్ర మెవ్వారి కవనశైలి

గీ. యట్టి రత్నాకరము వారి యన్వయమునఁ
బ్రభవమునుబొంది దామరప్రభులవలన,
నగ్రహారాదిబహుమతు లందియున్న
యార్యచరితుల మావారి నభినుతింతు.

ఈకవి ద్విపదభాగవతమును, సకలలక్షణసార సంగ్రహమను వ్యాకరణగ్రంథమును రచించెను. సకలలక్షణసారసంగ్రహముయొక్క వ్రాతప్రతి పరిషత్పుస్తకభాండాగారములో నున్నది. కాని ప్రతి

శిథిలము. మొదలును తుదయు గ్రంథమునందు లేవు. ఈగ్రంథములోని గద్య యిట్లు గలదు.

"శ్రీమద్వేంకటాచలాధ్యక్ష కరుణాసంలబ్ధా సాధారణ ప్రజ్ఞావిచక్షణాక్షుణ ప్రబంధాంకాంధ్ర శబ్దజాలలక్షణబహుచిత్రకవిత్వరచనా చమత్కార రత్నాకర కృష్ణమరాజ గర్భరత్నాకరసుధాకర గోపాలసత్కవిరాజ ప్రణీతం బైన సకలలక్షణ సారసంగ్రహం బను ఛందంబునందు" (పరిషత్పుస్తక భాండాగారగ్రంథసంఖ్య 3471 ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక ఆరవసంపుటము పుట 353)

## భాగవతము దశమస్కంధము

పూర్వభాగముప్రతి ప్రాచ్యలిఖితపుస్తక భాండారమున నున్నది (సంఖ్య 784) ఈగ్రంథములోని అవతారిక భాగము నిం దుదాహరించుచున్నాను.

"శ్రీకరమూర్తి దేశికచక్రవర్తి

భట్టుమ శ్రీచెన్నభట్టార్య బోగడి

గట్టిగా నాదిమకవులు గీర్తించి
దిట్టఁడై మాకవులు దీమసం బెంచి
రత్నాకరాన్వయరాజితక్షీర
రత్నాకర సుధాకరత్వభాసితుఁడు
రాజిల్లు కృష్ణమరాజనందనుఁడు
రాజిత సకలకళాలిచక్షణుఁడు
గోపాలసత్కవికుంజరుఁ డనఁగ
నేప్రొద్దు మహిలోన నింపొందువాఁడ."

ఇందలి శైలినిమిత్తము కొన్నిపద్యముల నిచ్చు చున్నాను.

"కలధౌత నవహేమ కవితవిశాల
నలినారిమండలోన్నతసౌధచయము
తారాపథోన్నత తపనీయతార
సార భాసురరత్నసౌధజాలములు
కమలానివాస సత్కళ్యాణవిభవ
రమణీయమందిరారామభూములును
అరుదైన వేదశాస్త్రాదివిద్యలను
పరమేష్ఠి మెచ్చని బ్రాహ్మణోత్తములు
మంత్రకంత్రోపాయ మహిమలదేవ.
మంత్రిని మెచ్చని మంత్రిపుంగవులు"

పై రెండు గ్రంథములు నముద్రితములు. భాషోద్ధారకులు ముద్రింతురుగాక.

## గ్రంథ ప్రాశస్త్యము

కృతికర్త యగు రావిళ్ల లింగభూపాలుఁడు కమ్మకులతిలకుఁడు. వెల్లుట్లగోత్రసంజాతుఁడు. ఈ లింగభూపాలుఁడును, ఇతని తండ్రి తాతలును, విజయనగరసామ్రాజ్య మేలిన సాళువ, తుళువ, ఆర్వీటి వంశనరపతుల సామంతులుగ నుండి, గజపతులతోడను, అశ్వపతులతోడను, వారొనర్చిన సంగ్రామములయందు సహాయులై, విజయములఁ జేకూర్చుచుండిరి. బాహుబలదర్ప శౌర్యసంపన్నులగు ఈకమ్మసామంతనాయకుల యుదంతము తత్కులమువారే గాక అఖిలాంధ్రలోకమును బ్రశంసింపఁదగినది.

కుమారధూర్జటి కృష్ణరాయవిజయమునం దీరావెలవారినిఁగూర్చి ప్రశంసించెను. రాయలు కళింగదిగ్విజయయాత్ర వెడలినప్పుడు తోడ్పడిన వీరనికాయములో రావెలవంశీయులు గలరు. వీరు

రాయలపక్షమువనుండి సమరరంగమున గజపతి దళములతోఁ బోరాడినవిధము ఈ క్రిందివిధమునఁ గవి వర్ణించెను.

ఉ. లింగనృపాలు వారును గడిందిరఫీఖ్ వెలుగోటివారలో
రావెలవారుఁ గూడుకొని రాత్రి పగల్ చతురంగసేనతో
సేవగఁ జూచినన్ తెలియనెంతయుం శక్యముగాని దుర్గమా
భూవరమౌళి గాంచి యొకపూలునె దీసెద నంచు ను

[గ్రు. డై. (3-59)]

విశ్వనాథనాయనిస్థానాధిపతి వ్రాసిన రాయవాచకములోఁ గమ్మనాయకుల ప్రస్తావన గలదు (పుటలు 65;84)

సౌగంధిక ప్రసవాపహరణమునందు కవివర్ణించినవిషయములు గొన్ని విజయనగర సామ్రాజ్యమేలిన సాళువ తుళువ ఆర్వీటువంశనృపాలురు కృతులందిన ఆంధ్ర కావ్యములందును వర్ణితము లయ్యెను. లింగభూపాలుని మూలపురుషుఁ డగు మల్లభూపతి గుడిపాటి సమీపమున కుతుబుషాహీ బలముల నెదుర్కొని యోడించి రాయలచే

బిరుదు లందె నని కవి వ్రాసియున్నాఁడు. ఈగుడి
పాడు పూర్వము కొచ్చెర్లకోటసీమలోని యొక
గ్రామము. (ఈగ్రామ మిప్పుడు నెల్లూరిజిల్లాలో
ఆత్మకూరుతాలుకాలో నున్నది) పూర్వ మీకోట
సీమ విజయనగరాధీశులచే రావెళవారు మన్నె
రికముగా గ్రహించి, గుడిపాడులో నగళ్లకోటను
గట్టించుకొని యచ్చటనుండియే యాసీమను
పాలించుచుండి రని దువ్వపాడు కైఫీయతులో
నున్నది.* సాళువ నరసింహరాయు లొకవంక
గజపతులతోడను, మఱియొకప్రక్క అశ్వపతుల
తోడను యుద్ధము లొనర్చినసంగతి చరిత్రప్రసి

---

*ఈతాలూకాలు విజయనగరంవారు రావిళ్లవారు అనే
కమ్మవారికి మన్నెరికానకు ఇచ్చి, యింకా కొన్ని తాలూ
కాలు వారిస్వాధీనంచేసిరి గనుక వారు యీదువ్వపాటికి
పూర్వాన్న నాలుగుక్రోసులమీద కోటసీమలో గుడిపాడూ
అనే గ్రామంలో కోటపెట్టించుకొని, నగళ్లు కట్టించుకొని
యీదువ్వపాడుతాలూకా ప్రభుత్వం చేసినారు (మెకంజీ
వ్రాతప్రతులు 15-6-19)

ర్ధము. అతనికాలములోఁ దెలింగానా బహామనీ సుల్తాను సామంతుఁడుగ కూలీకుతుబుల్ ముల్కు అనునాతఁడు పాలించుచుండెను. ఇతఁడు క్రీ. శ. 1495 సంవత్సరము మొదలు క్రీ. శ. 1512 సంవత్సరమువఱకు సామంతుఁడుగనుండి, తర్వాత సుల్తానుని ద్రోసిరాజని ఆకడపటిసంవత్సరముననె కుతుబుశాహ యనునామమును దాల్చి స్వతంత్రుఁడై గోలకొండనుండి పరిపాలన మారంభించెను. ఆ కాలమున బీజపూరు, బీదరు, తెలింగానాలను బాలించెడు నవాబులందఱును విజయనగర రాజులతోఁ దఱచుగాఁ బోరాడుచుండిరి. మల్లభూపాలుడు పోరాడినది యీకుతుబుశాహతోనై యుండును. కుమారుఁడగు తిప్పభూపతియు సాళ్వనరసింహరాయలపక్షమున గజపతులతోఁ బోరాడి యుండును.

ఈమల్లభూపాలుని పరాక్రమము వర్ణించు చాటువులు గొన్ని కలవు.

ఉ. అల్లవె కమ్మమూఁకలఁట నావల రావెలవంశచంద్రుఁడౌ
మల్లయభూపదుర్ధర సమగ్రబలంబులు మండలాగ్రముల్

ఝల్లపుటీ వెలుఖుసువ శంకరుటెక్కెము భువిదీర భూ
వల్లభ మల్లిఖార్జునుఁడు పంతము గెల్చెను ధాత్రిలోపలన్.

చ. గెలుపులరాజ! రాజహితఖేలన! దాతల సార్వభౌమ! ని
శ్చలగుణశాల! యాదవనిశాత్రవదుర్గవిఘాల మన్నె మూఁ
కలకలగుండుగండ! హతకల్మషకాండ! సరెవ్వ రుర్వి నీ
కలఘుపరాక్రమక్రమజితార్జున! రావెల మల్లిఖార్జునా!

సీ. దురమందు నరివరకరిఘటలను గన్న
బూని డొక్కలు చిన్నపొడిచి మిత్రరి
సమరశాత్రవ వీరసైంధవములఁ గన్న
కొమ్ములహు మ్మంచు గ్రుచ్చియెత్తి
మారొక్కన్న పగర ్రామన్నెగిబ్బలకనుల్
ఖురపుటాహతరజస్ఫురణ నడఁచి
మాకు గులాములై మాఱోడ్డు నరిరాజ
వృషభంబులను నెక్కటెడ్లఁ జేసి

గీ. పందులగు మన్నెగిబ్బల వాసి యుడిపి
రంకె లిడుచుండు నీవృషశంకరుండు
సమరరఘురామ! రావెళ్ల సార్వభౌమ
వైరిహృద్భల్ల! యుద్దండ వీరమల్ల!

సీ. గర్గోలురాయనిగహ్వరంబే చాలు
  సహితభూపతిగర్వ మపహరింప
ప్రతిపక్షసాళ్వభూపతిమాత్రమే చాలు
  గడిదుర్గముల నెల్ల దుమురుఁ జూప
జగతి గోపాల నీసాహసంబే చాలు
  వైరుల పురములఁ జూఱలాడ
గండరగండదర్గండికాఁడే చాలు
  విరచించు మన్నీల వెన్నుఁదన్న
గీ. అనుచు నృపతులు పూఁగుసింహాసనముల
  బ్రస్తుతింతురు దేవ నీపౌరుషంబు
  సమర రఘురామ! రాచెళ్ళసార్వభౌమ!
  వైరిహృద్భల్ల! యుద్ధండవీరమల్ల!

అయ్యపభూపాలునికుమారుఁడగు తిప్పనృపతి కందనవోలు ఆదవనికోటలను ముట్టడించి గెలుపొందెనని కవి వర్ణించియున్నాఁడు. అళియరామ రాయలతాత్మజుఁడైన రామరాజు సాళ్వనరసింహ రాజసామంతుఁడుగ నుండి యతని దండనాయకుఁడై యాతని యాజ్ఞానుసారముగ కర్నూలు కోటను ముట్టడివేసినట్లు చరిత్రవల్లఁ దెలియు

ఘనసుతరకందనోలి మహాపురిని

శాంతుఁ డగురామమేదినీకాంతుఁ డలరు.

ద్విపద బాలభాగవతములో,

రామనృపాలుండు రాజేంద్రుఁ డౌదవె

.......................................

పెంపు నెన్నఁగఁ జాల నిర్ధకార్యమునఁ

గందనవోలి దుర్గంబుఁగోనుండి

బుక్కయరామభూభుజుఁ డెల్లనృపులు

నెక్కువ యిది యని యెన్నంగఁజాలి

వీరులు డెబ్బది వేవురాశ్వికులు

చేరి కొల్వంగవచ్చిన సహా నెదిరి

కలనంది పంచబంగాళంబుసేసి

గెలిచెఁ దచ్చరితంబుఁ గీర్తింపఁదరమె.!

పద్యబాలభాగవతములో,

శా. గబ్బుల్ డెబ్బదివేవురాశ్వికులు

వేడ్కన్ గొల్వఁగాఁ గిక్కు వె

న్నబ్బుల్ గప్పఁగఁ గందనోలు గొను

వేడ్కన్ జుట్టుముట్టన్ సహా

దివ్వి నుబ్బణగించిలోలె నరి
రాష్ట్రమొందను..........
.................యక్క
భూవిభుని రామాధీశుఁ డాపఁ యనస.*

లింగభూపాలునికుమారు లగు కొండనృప
తియు, అయ్యపనాయకుఁడును, తిమ్మరాజు అతని
కుమారుఁడు అళియరామరాయలకాలములో
సామంతదండనాయకులై మహమ్మదీయవైరినికా
యములఁ జెండాడుచుండి రని తెలియుచున్నది.
కొండనృపతి మానవపురిచెంత నేదులఖానుని
జయించినట్లును, అయ్యపనాయకేంద్రుఁడు రామ
రాజదత్తకిరీటరమ్యభూషణుఁడైనట్లును కవి వర్ణిం

---

* నారదరాజీయము పుట. 38, 39; పద్యము 209.
వసుచరిత్ర ఆశ్వాసము. 1. పద్యములు 29, 30.
ద్విపదబాలభాగవతము. ప్రథమస్కంధము. ప. 191-195.
శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు పద్యబాలభాగ
వతమునుండి వ్రాసినవ్యాసము భారతిపత్రిక. సంపుటము
6. సంచిక 6.

చినాఁడు. ఇట్లే అళియరామరాయలతండ్రియైన తిమ్మరాజు మానవపురికడ నేదులఖానుని జయించి నట్లును, ఆదవేనిదుర్గమును సాధించినట్లును ద్విపద, పద్య, బాలభాగవతములందును వర్ణింపఁబడెను.

ద్విపదబాలభాగవతములో,

" రాజచంద్రుండు రామరాజు తిమ్మయ్య

..............................

కడిమిమై మానువకడ రణస్థలిని,

గడుపరి నేదులఖాను జయించి

విక్రమంబున నాదవేనిదుర్గంబు

విక్రాంతు లెన్నంగ వేవేగ సాధించి"

పద్యబాలభాగవతములో

సీ. మానువకడ నవాబు గెలిచి రణాగ్ర

జయము నొందించె నే శౌర్యశాలి*

..............................

---

*ద్విపదబాలభాగవతము చెన్నపట్టణములో వేదము అండుకంపెనీవారు వారి విజ్ఞానగ్రంథమాలికలో ముద్రింప

పై విషయమే ముక్కుతిమ్మనార్యకృతపారిజాతాపహరణమునందును జెప్పఁబడినది. కృష్ణదేవరాయలతండ్రియైన ఈశ్వరనరసింహారాయలు మానవేంద్రు నోడించినవిషయము ఈ క్రిందిసీసపద్యముపాదమున మనోహరముగా, కవి వర్ణించియున్నాఁడు.

"పారసీకునకు దుర్భరమానవత్వంబుఁ
దొలగించె మానవదుర్గసీమ."

## కృతిభర్త - లింగభూపాలుఁడు

ఈలింగభూపతిని భాస్వద్భుజావీర్యనిర్దళితారాతునిగాఁ గవివర్ణించెను. ఇతఁడు సుల్తానిఅబ్దుల్ పాదుశాహానుజయించి యతనిని పెనుగొండ వలికును దఱిమివేసె ననియు, డాబాలు పైబడి

---

బడినది కాని అసమగ్రము. ఇది పూర్తిగ ముద్రింపవలసిన భారము భాషోద్ధారకులగు శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారిపై నున్నది. పద్యబాలభాగవతమునుండి కొన్నిపద్యములు శ్రీ వేంకటరమణశాస్త్రిగారు రచించిన బాలభాగవతటీకనుండి గ్రహింపబడినవి. (భారతిసంపుటము. 6. సంచిక. 6.)

డాగులు చేసె ననియు, దళవాయి వేంకటధరణీ
శుచే మెప్పులువడసె ననియుం దెలియుచున్నది.
ఇతఁడు నరపతిసింహాసనస్థాపకుఁ డనియు, నరపతి
దత్త నానారత్న భూషాంబరతురంగశతాంగఘన
భాగ్యుఁ డనియు వర్ణింపఁబడెను. పైనిచెప్పఁబడిన
సుల్తాని, గోలకొండనవాబగు అబ్దుల్లా ఇతఁడు
గోలకొండను క్రీ. శ. 1612-1670 వఱకును
పాలించెను. పైని నుడువఁబడిన నరపతి పెను
గొండ నేలిన పెదవేంకటపతిరాయలు క్రీ. శ.
(1630-42). సుల్తాని అబ్దుల్ పాదుషాహా, కర్ణాట
దేశముపై దండెత్తివచ్చి క్రీ. శ. 1638 లో ప్రాం
తముల ఇప్పటి నెల్లూరుజిల్లాను బూర్తిగజయించి
తన మాండలికుల నియమించెను. ఆతఁడే పెను
గొండ నేలుచుండిన పెదవేంకటపతిరాయలపై
దండెత్తిరాఁగా రాయలసహాయార్థము లింగభూ
పాలుఁడు దండువెడలి, సుల్తానుని బలాయనను
గావించి, రాయలను పెనుగొండలో సుస్థిరముగ
నిలిపియుండవచ్చునని యూహించుచున్నాను.

ఈయుద్ధములో లింగభూపాలుఁడు దళవాయి వేంకటధరణీశుచే మెచ్చులందె నని కవి వ్రాసినాఁడు. ఈవేంకటధరణీశుఁడు వెలుగోటి వెంకటపతినాయనింగారు గానోపు. నెల్లూరు ఉదయగిరి సీమల నీతఁడు రెండవ వెంకటపతిరాయలచే నరుగముగ బడసెను.*

* Nellore District Gazette Vol. I. Page 63. లేదా వెంకటధరణీశుఁడె పెదవెంకటపతి రాయలు గావచ్చును.

ఈ పెదవెంకటపతిరాయలు, రెండవరాయలకు (1614-1630) సామంతుడుగ తిరుమనాపల్లిఖండము నేలుచుండెను. మొదటి వెంకటపతిరాయల మరణానంతరము సంభవించిన కుటుంబకలహ, రాజకీయసంఘట్టనములందు, రామరాయలకు వెంకటపతిరాయలు సహాయులై, యాతనిరాజ్యమున స్థిరముగఁ బ్రతిష్ఠించి యుండవచ్చును. ఆకాలముననే సుల్తానితో యుద్ధము పొసఁగియుండును. కాని యీయుద్ధము మూఁడవ శ్రీరంగరాయలకాలమున సంభవించియుండు నని కొం, సుబ్బారావు, రామయ్య వెలుగోటి వారు స్వాధీనపఱచు

క్రీ. శ. 1640 తర్వాత నీప్రాంతమంతయు గోలకొండ నవాబు వశమయ్యెను. (నెల్లూరు జిల్లా) ఇప్పటి అనంతపురము, చెంగల్పట్టు, కడప, తిన్నవిల్లి, మైసూరుప్రాంతములు వేంకటపతిరాయలపరిపాలనక్రిందనే యుండెను.

లింగభూపతి "డాబాలుపై బడి డాగులుచేసెనని" కవి వర్ణించెను. ఈడాబాలు అనునది పశ్చిమతీరమునసున్న డాబుల్ (Dabul) పట్టణ మేమో యని సందేహము గలుగుచున్నది. ఆకాలమున ఆపట్టణము పోర్చుగీసువారివశమున నుండెను. ఆ పట్టణముపై దండు వెడలుటకును, పోర్చుగీసువారికిని, విజయనగరసామ్రాజ్యాధీశులకును పోరాట మేల సంభవించెనో తెలియదు. ఈవిషయము పరిశీలింపదగినది.

---

కొనుటయందు సహాయుండై వచ్చియుండునని శ్రీ వెంకట రమణయ్యగారు తలంచుచున్నారు.

(Sources of Vijayanagar. Vol I. P. 369)

## శాసనములందలి రావెళ్లవారిచరిత్ర

నెల్లూరిజిల్లా శాసనసంపుటములనుండి రావెల వంశీయులగు ముచికొందలు కమ్మనాయకులచరిత్ర తెలియవచ్చుచున్నది. రాజరాజదేవుని పంద్రెండవ పరిపాలనసంవత్సరమునం దొక రావిళ్లనాయకుని ప్రస్తావన గలదు. ఇదియు రావిళ్లవారినిగూర్చి చెప్పెడి యత్యంతమైన ప్రాచీనశాసనమును, ప్రథమశాసనమునై యున్నది.* వీరిలోఁ గొందఱు నెల్లూరు జిల్లాలో నుదయగిరి, పొదిలి, కొచ్చెర్లకోట సీమలఁ బాలించుచుండిన సామంతనాయకులు గలరు. వీరును వెల్లుట్లగోత్రులే. పొదిలి సీమను బరిపాలించిన రావెల తిప్పానాయకుఁడును, ఉదయగిరిసీమను బాలించిన రావెల కోనేటి చిన తిమ్మానాయకుఁడును ముఖ్యులు. సౌగంధికప్రసవాపహరణములోని రావెలవంశీయులకును, పై శాసనములందలి రావెలవారికిని బరస్పరసంబంధము వీరివంశావళినిబట్టి నిర్ణయించుట దుర్ఘట

* B. V. Nellore Inscriptions. S (6)

ముగా నున్నది. భావిపరిశోధనమునఁగాని బయలు పడదు.*

కర్నూలు జిల్లాలో శ్రీగిరిమండలమేలిన మఱి యొక రావెళవంశీయులు గలరు. వీనివంశ మీ దిగువ నీయఁబడినది.

మల్లభూపతి
|
వీరపనాయుఁడు

మల్లభూపతి

ఈకడపటి మల్లభూపతి కర్నూలుజిల్లా వెంక టాద్రిపాలెమునందు క్రీ. శ॥ 1612 లో వ్రాయిం చిన శాసనమునుబట్టి, యితఁడు శ్రీశైలప్రాంత మును బరిపాలించుచుండె నని తెలియుచున్నది. ఈశాసనములో నితఁడు తనపూర్వులు వంశక్రమ ముగా సంపాదించిన కొచ్చెర్లకోటసీమలోని సిం

---

* నెల్లూరిజిల్లా శాసనసంపుటములలో నీ క్రింది శాసన ములఁ బరిశీలింప నగును. D. 35; G. 52; G. 84; N. 33; N. 124; G. 112; P. 19.

గారికొండ, బట్టిపాడు అను రెండుప్రాంతములును, వెంకటాద్రిపాలెములోని (ఇప్పటి మార్కాపురముతాలూకా) చెన్నరాయస్వామివారి యుత్సవములనిమిత్తము దానముచేసె నని తెలుపఁబడినది.* సౌగంధికప్రసవాపహరణములోని మల్లభూపాలునివంశమునకును, ఈమల్లనాయకునివంశమునకును సంబంధ మున్నట్లు గనఁబడదు.

## చెన్నభట్టరు - దేశికశిఖామణి

ఈకవి రంగనాయకపాదరాజీవయుగ్మసేవకుఁడగు శ్రీచెన్నభట్టరాచార్య గురువరేణ్యుం బొగడిసి స్తుతించెను. ఈ చెన్నభట్టరాచార్యుఁడు లింగమగుంట తిమ్మకవియు, నతనిసమకాలికుఁ డగు తెనాలి రామకృష్ణుఁడును వారివారిగురువుగావర్ణించిన చిక్కభట్టరాచార్యుడే మోయని తలఁచెదను.

క. గురురాయపట్టభద్రుని
నరహరు శ్రీరంగనాయకాంశభవుఁగా భ

---

*Para 55 of to Epigrapical report 1923-1924. *Vide* No. 423 of 1923.

ట్టరుచిక్కాచార్యులు మ
ద్గురుఁ దలంచుచు నడుగులను నతుల్గావింతున్.

తిమ్మకవి—చతుర్వాటి మాహాత్మ్యము

క. వాక్కాంతాశ్రయభట్టరు
చిక్కాచార్యులు మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కావ్యకళాకలాప మీడేఱుటకున్.

రామకృష్ణకవి—పాండురంగమాహాత్మ్యము.

పాండురంగమాహాత్మ్యము క్రీ.శ॥ 1565 ప్రాంతమున రచింపఁబడెనని శ్రీరామకృష్ణకవిగారు నిర్ణయించినారు. క్రీ.శ॥ 1584 సంవత్సరమున రచింపఁబడిన కామందకకృతిలో దత్కృతికర్తలగు వేంకటరామకృష్ణకవులు పై చిక్కాచార్యుని గృతిపతి సంబోధనమునఁ బేర్కొనిరి.

క. శ్రీచంచద్భట్టరు, చి
క్కాచార్య-వర్యశిష్యయతులితశౌర్య
ప్రాచుర్యవీర్య, గుణర
త్నాచలజయలలితధైర్య నయతత్త్వనిధీ.

గోపాలకవియు దేశికచక్రవర్తి యగు గురువు నీక్రింది విధముగ స్తుతించెను.

"చిరతరకీర్తి దేశికచక్రవర్తి
రంగనాయక పాదరాజీవయుగ్మ
సంగతపటుహృదంచితచంచరీక
భట్టరు శ్రీచిన్నభట్టరాచార్య".

ఈ దేశికచక్రవర్తి పదునాఱవ శతాబ్దాంతము వఱకు నివసించి యుండవచ్చును. రత్నాకరము గోపాలకవియు బదునాఱవశతాబ్దాంత్యమునుండి (1575) పదునేడవశతాబ్దమధ్యమువఱకు (1650) నివసించియుండెను గనుక, పై చిక్కభట్టరునకు శిష్యుండై యుండనోపు. ఇది యూహా. భావిపరిశోధనలవల్లంగాని తెలియదు. కడపటి యార్వీటి యుర్వీపతులు వారిసామంతులు వైష్ణవగురువరేణ్యుల బోషింపుచుండిరి. ఇట్టి దేశికశిఖామణుల సమాభినివేశమే, ఉద్భటారాధ్యచరిత్రకారుండగు రామలింగకవిని, రామకృష్ణకవిగాను, పాండురంగమాహాత్మ్య కృతికర్తనుగా నొనరించుట సంభవించినది. ఆ కాలములో నీవైష్ణవదేశికశిఖామణుల ప్రతిభయుం బలుకుబడియు ప్రబలముగా నుండెను.

# రావిళ్ల వారివంశవృక్షము

మల్లభూపతి

- తిప్పభూపాలుడు = పెద్దమాంబ
  - అయ్యప్పనాయుడు = లక్కమాంబ
    - తిప్పభూరమణుడు = వెంగమాంబ
      - లింగనృపతి = సిద్ధాంబిక
        - అయ్యపనాయుడు
  - వెంకటాద్రి

- గొంకభూపాలుఁడు = వెంగమాంబ
  - వేంకటనృపాలుఁడు

- కొండనృపతి
  - లింగభూపాలుఁడు = భాస్కరాంబ
    - రామభద్రుఁడు
  - ముద్దులనాయఁడు = తిరుమలాంబ
    - వెంగనృపతి.

## కథ - శైలి.

సౌగంధిక ప్రసవాపహరణమును గూర్చిన విషయము మహాభారతములోని అరణ్యపర్వమునందు గలదు. (ఆంధ్ర మహాభారతమున, అరణ్యపర్వము, తృతీయచతుర్థాశ్వాసములు) మూలములోని కథను పెంచి, కవి మూఁడాశ్వాసములలో నీయితి వృత్తమును రచించెను. హనుమద్దర్శనమును, యక్షరాక్షసులతోఁడి యుద్ధమును మణిమద్వధయు మొదలైన వృత్తాంతములు నందును నిందును గలవు. భారతములోని కథ చొప్పున ధనంజయుఁ డీసమయమున నమరావతియందుండెను. ప్రకృతిలో నర్జునుఁడు దేవలోకమునుండి వచ్చుటయు, యక్షనాథునితో యుద్ధ మొనర్చుటయుఁ, గౌరవులు పాండవులకుఁ దోడ్పడుటయు, నారదాగమనము, హరిహరాదుల పోరాటము, చతురాస్యుఁడు సత్యలోకమునుండివచ్చి శివకేశవుల శాంతంబు నొందించి, హతులైనవారిని బ్రదికించి, యుద్ధము విరమింపఁ జేయుటయు, మొదలగు నూతన విష

యములను గవి కల్పించి, మనోహరముగ వర్ణించి
నాఁడు. కవి రసజ్ఞుఁడు. కవిత నిర్దుష్టము. ఈకా
వ్యము కవితాకల్పనమున గోపప్రధాని ప్రణీత
ద్విపద కృష్ణార్జున సంవాదమునకన్న మిన్నయైనది.
కావ్యశైలిని దోనేరు కోనేరు కవికృత బాలభాగ
వతమున కించుకేనియుఁ దీసిపోవదు. లింగభూపా
లుని కీర్తికాంతావర్ణనము (పుట 43) సూర్యా
స్తమయవర్ణనము (పుట 141) రసవత్తరములు.

ద్విపద సౌగంధిక ప్రసవాపహరణకావ్యము
ను గోపాలకవివంశమువాఁడైన రత్నాకరము
అప్పప్పకవి పద్యకావ్యముగ రచించెను. కాని
కవిత్వము పేలవముగా నున్నది. ఈగ్రంథము
చెన్నపట్టణములోని వెస్టువార్డు కంపెనీవారిచే
క్రీ. శ. 1937 సంవత్సరములో ప్రచురింపఁబడి
నది. పీఠికలోని సీసపద్యభాగము నిందిచ్చు
చున్నాను.

౧. రత్నాకరాన్వయరాజశేఖరుఁడైన
[illegible]

గోపాలరాజుచే రూపింపఁబడినట్టి
దివ్యసౌగంధికద్విపదగాథ
మసృణపద్యకావ్యంబుగా రచియింపఁ
దలఁచి భూసురులను సంతోషమునఁ గ

... ... ... ...

## కృతజ్ఞత.

రత్నాకరగోపాలకవినిగూర్చి మొట్టమొదట శ్రీనిడుదవోలు వేంకటరావుగారు విజయనగర కళాశాలపారిమాసపత్రిక (1929) సంపుటము 7, 2-వ సంచికలో నొకవ్యాసము వ్రాసిరి. పిమ్మట తద్గ్రంథములోని చారిత్రకవిషయముల 1947 సంవత్సరములో నాంధ్రపరిషత్పత్రికయందు బ్రకటించితిని. వావిళ్ల భాషోద్ధారకులగు శ్రీవేంకటేశ్వర శాస్త్రిగారు నాకోర్కెపై గ్రంథమును బ్రకటింతుమని 1939 సంవత్సరము జనవరినెలలో నాకొకలేఖ వ్రాసియుండిరి. ఇంతలో యుద్ధప్రారంభ మగుటయు, కాకితములకు గఱవేర్పడుటయు, సంభవించెను. శ్రీవేంకటరావుగారు ఉద్యోగరీత్య

మునఁ జెన్నపట్టణమునవచ్చుటయు, గ్రంథప్రకటన
మున కుద్యుక్తులైన శ్రీ శాస్త్రిగారికి గ్రంథముద్ర
ణముగూర్చి ప్రోద్బలముగలిగించుటయును సంభవిం
చినది. వెంటనే గ్రంథముముద్రణముప్రారంభించి,
వారు నాకెరుకపఱచిరి. భాషోద్ధారకనామమును
వారి కన్వర్థనామ మగుట కట్టికార్యములే గదా
కారణములు! ఈపీఠికవ్రాయుటకు నాకు సాయ
మొనర్చినవారు శ్రీ వేంకటరావుగారును, శ్రీ సోమ
శేఖరశర్మగారును; శ్రీ నేలటూరి వేంకటరమణ
య్యగారి వ్యాసములును నా కుపయోగపడినవి.
కమ్మచరిత్రకారులగు శ్రీ కొత్తభావయ్యచౌదరి
గారు వారు రచించినచరిత్రలో నా మొదటివ్యా
సములోని విషయములు గ్రహించి, యావిష
యము గ్రంథములలో నుల్లేఖించిరి. ఈపీఠికరచన
మొదల వారి గ్రంథమును బరిశీలించితిని. పై వారి
యందఱకు నానమోవాకములు. పరిషత్పుస్తక
భాండాగారములోని తాళపత్రప్రతులనొసఁగి,
అడిగినతత్క్షణము నాకు కావలసినవిషయసామగ్రి

కార్యాంతరవ్యగ్రుండయ్యును బంపించుచుండిన, పరిష్కర్తృకార్యదర్శియు, నామిత్రుండును నగు రాఘవాచారి (ఎం. ఏ, బి. యల్.) గారికి నమస్కారములు.

లేఖకదోషములు, ముద్రణాస్ఖాలిత్యములు సవరించుటకు అవకాశము నాకు లభింపలేదు. ఈ ప్రమాదము మానవప్రకృతి పాఠకులు మన్నింతురుగాక! దోషములు రెండవముద్రణకాలమున సంస్కరించెదము.

5-2-1949. గుండూరి ఈశ్వరదత్తు.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము

విషయము. | పుట.

## తృతీయాశ్వాసము

| విషయము. | | పుట. |
|---|---|---|

విషయము. | పుట.

శ్రీరస్తు.

# సౌగంధికప్రసవాపహరణము

## పీఠిక

---

శ్రీరామచంద్రుఁ డాశ్రితవత్సలుండు<br>
తారకబ్రహ్మావతారుఁ డచ్యుతుఁడు<br>
సుమశరాసనుగన్నసుందరాంగుండు<br>
నముచిసూదనముఖ్యనానాదిగీశ<br>
రాజకాంతివిలాసరాజితపాద 5

రాజీవుఁ డంభోజరాజవంశజుఁడు<br>
నీలాతసీసూన నీరదశ్రీక<br>
నీలవర్ణుఁడు దయానిర్మలాత్మకుఁడు<br>
జానకీచిత్తాంబుజాతమిత్రుండు<br>
భూనుతమాణిక్యభూషణాన్వితుఁడు 10

పరిపంథి దైతేయబలభేదనుండు
హరివర్ణితుఁడు శరణార్తరక్షకుఁడు
దశరథధారుణీతలనాథగర్భ
విశదాబ్ధిచంద్రుఁడు విశ్వంభరుండు
విలసితసామ్రాజ్యవిభవసంపదలు 15
నలఘుసద్వస్తువాహననికాయములు
నతులితోదగ్రజయప్రతాపములును
వితతసౌఖ్యంబులు వేడ్కతో నొసఁగి
రావిళ్లలింగ భూరమణశేఖరుని
భూవరసుతునిగాఁ బోషించుఁగాత. 20

తలఁబ్రాలవేళ నెంతయు సిగ్గుదోఁపఁ
దలవంప గళరత్నతారహారాగ్ర[1]
మానితమాణిక్యమధ్యభాగమున
నానామరస్తుత్య నవ్యచారిత్రు
మకరకేతనకోటి మహితలావణ్యు 25
సకలలోకాధారు జగదేకవీరు

---

1 తలవంచిగళరత్నతారహారాగ్ర. (గ)

భూమండలాధ్యక్షుఁ బుండరీకాక్షు
రాముని సుగుణాభిరాముని మదిని
భావించి చూచి సంభ్రమమునఁ బొదలు
పావనగుణధాము భామాలలాము 30
సీతామహాదేవి చెలువంపుఠీవి
ఖ్యాతిగా సకలసౌఖ్యములు సంపదలు
రాజిల్లు సిరు లిచ్చి రావిళ్లలింగ
భూజాని ననయంబు బోషించుఁగాత.
చక్కఁ ఆకవణంబు చవిగొని మెక్కు 35
జక్కి నెక్కినజోదు సమయించు వేల్పు
వలిగట్టుపట్టికి వలపులు గులుక
నెలమి దేహం బర్ధ మిచ్చినదాత
పాపబువ్వకు బుట్టు బలియు సోదరుని
చేపట్టి కోర్కె లిచ్చినదయాజలధి 40
సొలపుచీఁకటిగుంపు సొంపుల బెంపు
చలి వేఁడి వెలుఁగుల జరుగుచక్రములు
మక్కికైదువబూను దొరబిడ్డతమ్ముఁ
దక్కసనేర్చిన యబల పెద్దన్నఁ

జెలఁగుచు రాజుగాఁ జేసిన యతని 45
కలకంఠకంఠినిఁ గన్నరంగంబు
సిరియింటఁ బుట్టిన చిన్నబాలుని
కోరదు వెన్నుని ముద్దుగొడుకు డక్కంబు
దురసురూపము దాల్చి తొలివేల్పు మనిమి
యుఁదవుగాఁ గొనివచ్చు నుత్తమాశ్వములు 50
నలరు లోకములు చరాచరంబులును
మెలఁకువతోడ నిర్మించుసారథియు
నుదుటు జేజేలకు నునికిపట్టైన నెలఁడు
పదియాఱువన్నెలబంగారువిల్లు
తొగవైరినందను ద్రుంచువా మున్ను 55
తగగన్న మిన్న మేతలుగొన్న నారి
యుచ్చోటఁ దలఁచిన నెందుఁ జూచినను
నచ్చట వెలుగొందునట్టిసాయకము
గలిగి చెన్నొందినగంగాధరుండు
విలసిత బహుభాగ్యవితతు లొసంగి 60
గాయగోవాళుని కలితకేళాది
రాయని నలతతిరాజసన్నిభుని

శ్రీలచే జగతి రాజిలు లింగధరణి
పాలుని దుర్గాధిపతిఁ జేయుఁగాత.
ప్రాణనాథుని జటాబంధంబు మాన్పి 65
మానిత నవరత్నమకుటంబు దాల్చి
పేరైన పులుకలపేరులు దిగిచి
భూరి ముక్తాహారములు పొసంగించి
కన్నుల వినుసొమ్ము కడలకు వైచి
సన్నుత దివ్యభూషణము లమర్చి 70
పూవిల్తుభస్మంబు పూఁత బోఁదుడిచి
తావులు గులుకుగంధంబు మైఁ నలఁది
గజచర్మపటము చక్కఁగఁ దొలంగించి
రజితాంబరంబు తీరంబుగాఁ గప్పి
గ్రక్కున పులితోలు కాశ సళ్లించి 75
తక్కక కెంబట్టుదట్టి పొంకించి[1]
జోగివేషము బాపి సొగసైనపుట్టు
భోగిరూపంబు సొంపుగఁ బొసంగించి

---

1 తక్కక కెంబట్టు దట్టి బొందించి (చ)

ఉద్భవ ప్రాభవోద్యోగములు పెన్ను
మరియాదలును ధర్మమర్మకర్మములు
శౌర్యధైర్యోదారచాతుర్యమహిమ
లలరుచు రచియించి యబ్జజాండముల 100
వెలుపల లోపల వెలయుచు సంచ
రింపుచు మెలఁగు విరించి నెయ్యమున
సంపూర్ణకరుణారసంబు లుప్పతిల
నాయురారోగ్యంబు లతులితమతియు
శ్రీయు నుపాయంబు జెలువొంద నొసఁగి 105
రావిళ్లకొండ భూరమణుని లింగ
భూవల్లభుని దయఁ బోషించుఁగాత.
సకలవిద్యలకెల్ల సాక్షి దా నగుచు,
నకలంకమహిమ రాయంచపై నెక్కి,
మతిలేనివారికి మతులు గల్పించి, 110
కృతిలేనివారికిఁ గృతులు గల్పించి,
యిలమతికృతులచే నెల్లభాగ్యములు,
కలితసత్కీర్తులు గలుగంగఁజేసి,
వరుజివ్వ నటియించు వాణి మృగాక్షి

యురునంద నాదిగర్భేశ్వరథపక్ష 11
బిరుదాంకునకు లింగస్పృథునిశర్వునకు
సరసచమత్కారచాతుర్యనిధి
విమలతత్త్వజ్ఞానవిభవంబు లొసంగి
కొమరొందు కృతినాయకునిఁ జేయుఁగాత.
అని పయోరుహగర్భ వాక్పలోచనుని 11
వనజాసనాది గీర్వాణమౌళిక్య
మకుటకోటిప్రభామండితమృదుల
వికసితపాదారవిందు ముకుందు
వర్ణించి సేవించి వరహిమశైల
వర్ణుని గజరాజవదనుని నేక 12
దంతుని శంభునందనుని గీర్తించి
సంతతకరుణారసస్వచ్ఛహృదయు
సకలవేదపురాణశాస్త్రాధికారు
వికటమహోద్దండవేదండసింహు
నరుదైన బ్రహ్మరథారోహణాఢ్యు 13
చిరతరకీర్తి దేశికచక్రవర్తి
రంగనాయకపాదరాజీవయుగ్మ

సంగతపటుహృదంచితపంచరీక
భట్టరుశ్రీచన్నభట్టరాచార్య[1]
పట్టభద్రులపాదపద్మములు దలఁచి 135
వరయశోధనులు గీర్వాణాంధ్రకవులు
నిరతంబు గుణుతించి నేర్పు వహించి
చాటు వాక్ప్రౌఢలక్షణలక్ష్యశబ్ద
నాటకాలంకార నవ్యప్రబంధ
సారార్థసంగ్రహ సర్వజ్ఞమూర్తి 140
కారుణ్యసుకవి ముంగరశానసుకవి[2]
చంద్రు చారిత్రము ల్జననాథ సభల
సాంద్రమతిస్ఫూర్తి సన్నుతిఁ జేసి
బహువిధాలంకారపదగుంభనములు
మహితశయ్యాపాకమార్గవైఖరుల 145
నవరసనాయకనాయకీభావ
వివిధలక్షణముల విలసిల్లు నొక్క

---

1 సంగరహృదయాబ్జ సచ్చంచరీక భట్టరు శ్రీ చెన్న భట్టరాచార్య (క) 2 కారుణ్యసుకవి ముంగరశాసనసుకవి(క)

రమణీయకావ్యము రచియింపఁ దలఁచి
విమలచిత్తమున భావించుచుండఁగను

[illegible]

తనకీర్తి సకలబాంధవమిత్ర సుకవి 150
జనచకోరములకు చంద్రికగాఁగ
తనప్రతాపస్ఫూర్తి దర్పితారాతి
వనసంతతికి దవవహ్నిగాఁ గాఁగ
తనదయ శరణాగతవిరోధితతికి
ఘనతరం బగువజ్రకవచంబు గాఁగ 155
తననిశాతకరాసిధారవిరోధి
మనుజేంద్రదేవతాయత్తకామినులఁ
దొలఁగక పొందించు దూతిక గాఁగ
కలితశృంగారవైఖరులఁ జెన్నొందు
తన మహోన్నతనవ్యధామంబు భాగ్య 160
వనజమందిరకు నివాసంబు గాఁగ
జననాథు లెన్న విశ్వంభర వెలసె
ఘనుఁడు రావిళ్ల లింగమహీశ్వరుండు
రసికాగ్రగణ్యుండు రావిళ్లలింగ

వసుధాధిపతి సాంద్రవైభవభాగ్య 165
వినుతసంపదలచే వెలయుచునుండి
యనువొంద నొక్కనా డరుణోదయమున
మెలఁకువచే నిద్ర మేల్కాంచి లేచి
వలనొప్ప దంతధావనము గావించి
మున్నుగా పన్నీట ముఖమజ్జనంబుఁ 170
జెన్నొంద నాది లక్ష్మీనాథుఁ దలఁచి
భాగవతోత్తము ల్బహుతాళగతుల
భోగిశయనుని పుణ్యకీర్తనలు
వినుపింప వీనులవిందుగా వినుచు
తనరంగ నామతీర్థంబు గావించి 175
గరిమ మీరఁగ శుద్ధగంగోదకముల
సురుచిరంబుగ భూమి శుద్ధిచేయించి
విహితంబుగా నందు వివిధవిచిత్ర
మహనీయరత్నకంబళము వేయించి
యమనియమప్రముఖాష్టాంగపూర్తు 180
లమరంగ పద్మాసనాసీనుఁ డగుచుఁ
బరఁగ హస్తికపాలభాతిధారులను

విరివిగా పదియారువేలపత్రముల
నలరుచు నుండెడి నారుపద్మములఁ 200
జెలువొంద పవనునిచే మేలుకొలిపి
నాభిపద్మంబు క్రిందట ముమ్మూల
శోభిల్లు బాహ్యాండ సురుచిరంబైన
గంభీరనాభికా కాండంబులోన
గుంభించి యనిలుగొని దానిచేత 205
నాధారకమలమధ్య త్రికోణాంత
రాధీనరేఖాంతరాత్మరానలము
వెలుగించి వాయువు వెస నందు నిలిపి
పొలుపొంద నెనిమిదిముఖముల క్రిందఁ
దనరు పశ్చిమనాడి తలక్రిందు జుట్టి 210
పెనుఁబాము బలునోరు వెడలంగఁ జేసి
నలువుగా పశ్చిమనాడిలో నునిచి
వెలయు వేట్కల నేకవింశతిమణులఁ
బెనఁగొని సంతాపభేద్యమై యలరి *
వనజాసనేశవిష్వక్సేననామ 215

* పెనగొని సంతతాభేద్యమై యలరి (క)

ములు గలుగు లింగంబు మునిగిన నుస్న
యలఘుగ్రంధిత్రయంగ వేలమి ఛేదించి
తలప నాష్పైని యూర్ధ్వముఖాంబుజంబు
దలక్రిందు చేసి యందలిసుధారసము
తలకొని హృదయపద్మమునందు నునిచి
యలయుచు యోగసామ్రాజ్యసౌభాగ్య 220
గరిమచే సకలజగస్థ్యయాకార
వరవస్తు నవ్యయప్రణవస్వరూపుఁ
బరమాత్ము భ్రూమధ్యభాగనివాసు
శరజాప్తశతకోటిచటులప్రకాశు
మానితమతి నాదిమధ్యాంతరహితు 225
ధ్యానించి హృదయపద్మంబున నునిచి
హరిహరభక్తుల కాచార్యులకును
నురుభక్తిహితవందనోపచారముల
జాంబూనదాంబరసద్భూషణములు
తాంబూలయుతముగా దానము సేసి 230
యాచార్యముఖ్యుల కభివందనంబు
లాచరించుచు వినయంబునఁ బనిచి

హితబాంధవులఁగూడి యిష్టభోజనము
లతిమోదమునఁజేసి హస్తముల్ గడిగి 235
పొలుపొంద ఘనసారముల మ్రుగ్గు లిడిన
విలసితవిధుశిలావేదికమీఁద
రాజిల్లు నూతనరత్నకంబళము
పైఁ జీనిహొంబట్టు పరుపుపై వేడ్క
వసియించి యిరుమైలవనితలు గొల్వ 240
కుసుమసాయకులీల కొలువున్నవేళ
నేమంబుతోఁ జెంత నిలిచి వేరొక్క
భామిని కర్పూరభాగంబు లొసఁగఁ
జిత్తంబు రంజిల్లఁ జేరి వేరొక్క
మత్తకాశిని యాకుమడుపు లందియ్య 245
సొలపుల వలపుల సొంపుల నొక్క
పొలఁతుక పరిమళంబుల మేన నలఁది
హావణికెగా నొక హారినీలవేణి
నవరత్నమయభూషణములు గీలింప
నేరుపుతో నొకనీరజవదన 250
తీరుగా కస్తూరితిలకంబు దీర్ప

సిరిమీఱ నవ్వు దోఁక చిగురాకుఁ బోఁడి
పరువడి జాళువాపాగ గిటింప
జనసుతం బగుబురుసాపచ్చడంబు
వనితె నొక్కత వలివాటుగాఁ జేర్చ 255
ఘన మూరురాయరగండపెండార
మనువుగా నొకలేమ యంఘ్రిఁ గీలింప
చెంగలించిన వేట్కఁ జేసి నవ్వు దొక్క
యంగనామణి నిల్వుటద్దంబుఁ బూన
కలితశృంగారముల్ గైకొని కేవి 260
కలకంఠికంఠులు కైదండ గొసఁగ
కమనీయరత్నకంకణములు మొరయ
రమణులు వింజామరంబులు వీవ
రమణీయకక్ష్యాంతరంబులు గడచి
కొమరుమీఱిన కొల్వుకూటంబుఁ జేరి 265
హితులు పుత్త్రులు పురోహితులు సేనాధి
పతులు సామంతులు బంధువర్గంబు
మన్నీలు గురికాండ్రు మండలాధిపులు
సన్నుతి కెక్కినచతురంగబలము

కవిబుధగాయనగాయనీవంది 270
వివిధనటీనట విలసితఘటన
అఘటనాఘటనాఖ్యఖడ్గప్రవీణ
పటుతరోపాయులై పరఁగుమంత్రులును
తగురాయబారు లెంతయుఁ జేరి కొలువ
నగణితనవరత్నసింహాసనంబునను 275
వెలయు సంగీతాదివిద్యల వినుచు
వలయు నాట్యప్రభావములు గాంచుచును
శ్రీయుక్తుఁ డగుచు రాజిల్లు వేడుకల
వేయిగన్నులుగల వేల్పుచందమున
రావిళ్లలింగభూరమణచంద్రుండు 280
కోవిదవినుతుఁడై కొలువునసుండి
నామీఁద కృప నుంచి నన్ను రావించి
ప్రేమతో లాలించి పంపుఁ జేయించి
తాంబూలయుతముగా ధనమణిహార
జాంబూనదాంబరసైంధవాంధోళి 285
కాదుల తగుసగ్రహారంబు లొసఁగి
నాదిక్కు వీక్షించి నయమొప్పఁ బలికె.

అనుపమరత్నాకరాన్వయాధ్యక్షు
ఘనుఁడ గోపాలసత్కవిసార్వభౌము
నరసుతవాఙ్మయన్యస్తపుణ్యమతిని 290
సరసచాతుర్యలక్షణలక్ష్యశోభ
నాటకాలంకారనవరసభావ
పాటవంబులను నేర్పరివలె జగతి
నిరినిరోష్ఠ్యంబుల నిరనునాసికల
గుర్తైనశతకముల్ గూర్చిన మేటి 295
వసునాసికాష్టవర్ణావళిఁ బోని
గోనబుతారావళి గూర్చిన ఘనుఁడు
నలకామిదికిని దీపాంధ్రశబ్దంబు
తెలవి మీరఁగ రచియించు నేర్పరివి
తవు తెన్నుఁగా చెప్పుకట్టమార్గంబు 300
లవలీలఁ జెప్పిన యట్టి ధన్యుఁడవు
మహనీయ బహులిపిమర్మచాతుర్య
మహిమలు దెలిసినమాన్యుండ వీవు
భవ్యసౌగంధికప్రసవాపహరణ
కావ్యంబు ద్విపదగాఁ గడువిస్తరించి 305

తనరు వేట్క మదంకితముగా నేయవలయు
ననిన హర్షించి నే నానంద మొంది
సంశయం బెడలించి సత్కృతినాథు
వంశావతారంబు వర్ణింతు నెలమి.

కృతిపతివంశానువర్ణనము

తులుగరతనపట్టి తొలుతటిచికిలి[1] 310
ములికిలో నుండి కల్గుల నీనురాణి
వాసంబు నేవేళ వత్సంబునందు
భాసురోన్నతి నుంచు భక్తవత్సలుఁడు
పాల మున్నీట పాపని లీలఁ దాల్చి
మూలనున్నయ్యసోమ్ములు మెక్కజక్క 315
పైనెక్కి విహరించు పరమపావనుఁడు
దీనశరణ్యుఁడు దిక్పాలనుతుఁడు
సర్వవిద్యాకళాశాస్త్రపురాణ
పర్వతాంభోనిధి బ్రహ్మావతార
తారకాయుధభూతదంతిదిగబ్జ 320

1 తొలఁగక తనపట్టి తొలుతటిచికిలి (క)

తరుతటాకాదిసంతానవైఖరుల
సురసత్యవాక్యపరోపకారముల
పరగుచు సకలబాంధవాశ్రితుల
నలవడఁ బ్రోచి విద్యాగహాస్యములు 340
తెలిసిన సర్వజ్ఞప్రతిష్ఠ వహించి(?)
పరిపంథివీరుల బంధించి వైచి
శరణాగతశ్రేణి సత్కృపఁ బ్రోచి
మానితవర్ణాశ్రమములవారలను
భూనుతంబుగ కల్పభూజంబు లనఁగ 345
కరుణ కాధారమై ఘనతరకీర్తి
బిరుదసంపదలచే పృథివిపై వెలసె

పట్టభూర ఘనుండు

ఆకమ్మవంశసుధాంభోనిధియందు
రాకానిశాకరరమణ చెన్నొంది
యనుపమాటోపసాహసవిక్రమాఢ్యుఁ 350
డనుచు రాయకుమారు లభినుతించఁగను
వినుత రాడ్వ్యమదమై విస్మయం బగుచుఁ

భువి నుద్భవం బైనపోల్కి జన్మించి
జననాథు లెన్నఁగా జగతిప్రై వెలసె 370
ఘనుఁడు తిప్పభూమీకాంత శేఖరుఁడు.
ధీరుఁ డారావిళ్ళ తిప్పభూభుజుఁడు
పేరోళముగ ధాత్రి యేలుచు నుండి
భుజబలోద్దండుఁడై పొదలుచువచ్చు
జగపతిదళములు గడిసి చెండాడి 375
వికలంబుగాఁ జేసి వెన్నంటి తరిమి
యకలంకబిరుదధ్వజావళుల్ పట్టి
గొడుగు లందలములు గొనబుపల్లకులు
బెడిదంపుభేరులు పెద్దబూరుగలు
వన్నెవన్నెగు డాగ్లు వాజులు కరులు 380
చెన్నొందఁ గైకొని సిరులచే వెలసి
తనకీర్తి సకలదిక్తటముల నింపె
జనపాలు రెన్న రాజ్యము చేయుచుండె.

తిప్పభూపతిభార్య పెద్దమాంబ

పరమసాధ్వీమణి పటుశీల యనఁగ

పరఁగు పెద్దమాంబాగర్భమునను 385
హరిహరసదృశు లై యలరిననుతుల

తిప్పభూపతికుమారులు [illegible]

నిరువురఁ గాంచె మహీశసన్నుతులు
బలశౌర్యధనునయ్యపెద్దలింగప్రభు
నలఘుతేజుని వేంకటాద్రిభూవిభుని
నరయ నాయిరువురయం దగ్రజుండు 390
పరమపావనుఁడయ్యె పెద్దలింగప్రభుఁ

—{ అయ్యలరాయనివిభునకు లక్కమాంబకును కుమారుఁడు తిప్పనాయఁడు. }—

దతిశీలవతి లక్కమాంబికయందు
సుతుని శ్రీతిప్పవసుంధరాధిపునిఁ
గని పెంచి సకలభూకాంతులు గొలువ
పనుపడ తనయుని పట్టంబుగట్టి 395
ఖ్యాతి నెంత వారికి చెల్లని బిరుదు
లతిశయింబుగఁ దాల్చి యలరఁ బట్టించి
హగలు గగ్గోలురాయ హాజీరుఁ దనుచు[1]

1 హగలు గగ్గోలురాయి పజీరుఁ దనుచు (క)

ముగురుదునేదార్లు మొగి సన్నుతింప
బాపురే మాయయ్య భళిభళీ యనుచు 400
గోపాలరాజు చేకొని చూచి మెచ్చ
నళుకు బెళుకును లేక నాహవభూమి
తెలుఁగుబిజ్జలుమాడ్కి తెగువతోఁ జొచ్చి
మొనసి కంగనయోలి ముట్టడి యల్ల
మునుమున్నె విడిపించి మోహరంబైన 405
బలుదునేదారుల భంజించి వైచి
పొలుపొంద గంధేభముల నుగ్గుఁజేసి
పొదలుగ సిబ్బుల పొంగణగించి
యెదురుపఠాణీల నెల్ల మట్టాడి
చెలరేఁగి యెగసి వజీరులఁ జిదిపి 410
కలదక్కనీలఁ జీకాకుఁ గావించి
డేరాలత్రాళ్లెల్ల తెగ నరికించి
కోరి భాండారముల్ కొల్లలాడించి
తనపేరు వారికందనయోలికోట
యనురాగమున నొచ్చి యారాజుచేత 415
మెచ్చులు గైకొని మేదినీపతులు

లింగభూపాలు లాలితయశోధనునిఁ
గనిగాను నాలింగభూకాంతశేఖరుఁడు
తనదానధారా[illegible]పీనులు 435
వనధికి కళ్యాణ[illegible]కరుల్ నెరప
తనభుజంబున భూతధాత్రి యేవేళ
ఘనరత్నకేయూరగరిమఁ జెల్ల
మనుజాధిపతులు నెమ్మది కాన్క లొసఁగ
ధరణి యేలుచునుండెఁ దగుమహార్గమున 440

{ లింగభూపాలునిభార్య సిద్ధాంబ; సుపుత్రులు కొండభూపాలు, అయ్యపనాయుఁడు }

పరఁగ నత్రాపుల పర్వతాధిపుని
కన్నియ సిద్ధాంబ కరుణావలంబ
నెన్నఁగాఁ బెండ్లియై యొసఁగుచునుండి
నీరజాక్షప్రభానిసితాసివిజిత
ఘోరాహితనృపాలు కొండభూపాలు 445
సతతవదాన్యప్రసన్నసత్కాంతి
జితచంద్రు నయ్యపక్షితినాథచంద్రుఁ

 

సంగరాటోప ప్రచండాధి రాజ
పుంగవ ప్రాభవభుజగర్వహరణుఁ
గరుణాపయోనిధి గాయగోవాళ
బిరుదాంకుఁ డగులింగ పృథ్వీతలేంద్రు 465

— లింగభూపతి —

గద్దరి రిపువీరగజసింహమూర్తి

— ముద్దులనాయఁడు —

ముద్దులనాయని మోహనాకారు
నిటువంటితనయుల నిరవొందఁ గాంచి
పటుసత్యశీలుఁడై ప్రబలుచు నుండె *

---

* శంకర నిశ్శంకశౌర్యహాంవీర
కంకణహస్తసంగరరక్షపాల
శత్రుమహీనాథ సముదగ్రాకార
చిత్రలాంగలభీమసింహతలాట
నరశౌర్యముఖ్యనానాభరణ్యబిరుద
భరితుఁడు కొండపాలశేఖరుఁడు
తనకీర్తి ఘనాఘనాంతరములు నించి
ఘనులు భూజనులు సత్కవులు నుతింప

జలనిధి సంపూర్ణచంద్రునిలీలఁ
గలిగె శ్రీకొండ భూకాంతశేఖరుఁడు
ఆకొండనృపతి దయాపరమూర్తి
శ్రీకామినీనాథ సేవాభిరతుఁడు 485

అనిలోన నెదిరిన యహితకోటులకు
ఘనదివ్యభోగము ల్గలుగఁగఁ జేసి
వెన్నిచ్చి చను శత్రువిభులకు నెల్ల
సన్నుతం బైనమోక్షంబుఁ గల్పించి
శరణుజొచ్చిన రిపుజనకోటి నెల్ల 490

నురుభోగభాగ్యసంయుతులఁ గావించి
తనకీర్తి యాచంద్రతారకముగను
వినుతింప నెగడించి వెలయ భూస్థలిని
రాజతేజం డగు రావిళ్లలింగ
భూజానికొండభూభుజుఁడు మోదమున 495
సులవకపుత్త్రుల సుముహూర్తమునను *
జెలగుచు రాజ్యాభిషిక్తులఁ జేసి

---

* సొలవక పుత్త్రుల సుముహూర్తమునను (క)

కులుకుచుఁ జను పెండ్లికొడుకుచందమునఁ
బొదలుచు మానవపురిచెంతఁ జేరి
పదరునేదులకొమ్ముబలములమీఁద 515
గొదకక హరిణంపుగుంపుల గాంచి
కొదమసింహము చొచ్చుకొమరు చెన్నొంద
తేజిని చేసల్లి ధే యని నూకి
యాజిరంగముఁ జొచ్చి యహితసైన్యముల
గకవికల్ గావించి గద్దించి నరికి 520
ప్రకటించి తనపేరు వారిపోనీక
నెదురు రావంతుల నెలమి హుంజీర్ల
పొదలుదునేదార్ల పుడమిపైఁ గొల్చి
హత్తి వెంబడివచ్చు నవనీశు లెల్ల
తత్తరంబున వెన్కఁ దగులువెట్టంగ 525
నిరుమొనల్ నరికిన నేదిక్కుఁగన్న
ధరఁదొళ్ళియాడెడుతలలును నెగసి
పడెడికండలు బెట్టుపారురక్తములు
పొడిమైనయలుఁగులు పొలియు రావంతులు
గలిగి యొప్పెడుమహాకదనరంగమున 530

బలిమి భీము మురాళి బలరాము కులిశ
మలయజ ఘనసార మల్లికాతార
తారకాతుషార మందార నీహార
హారకుంద స్ఫటిక హారశరదభ్ర
హరి శారదా నారదాహీశ చంద్ర 550
శరదరచంద్రికాసాంద్రసత్కీర్తి
కార్తికేయార్జున కలితసాహసుఁడు
మార్తాండమండలమండితమండ
లాగ్రఖండితవిమతావనీనాథుఁ
డగ్రప్రతాపుఁ డత్యున్నతబలుఁడు 555
ఘనుఁడు రావిళ్లలింగనృపాలచంద్రుఁ

### లింగభూపతి కృతిభర్త

డెనయ వేడ్కల ధాత్రి నేలుచు నుండు.
కారుణ్యవితరణగాంభీర్యపటిమ
క్షీరపయోరాశి చెలువున నలరు
సాయపనాయనిసత్కులాగ్ర్యుండు 560
శ్రీయనంతనృపాలశేఖరుం డెలమి

మదనునిఁ గన్నక్రమంబున నెలమి
వరఁగు శ్రీభాస్కరాంబామణియందు
సరసరూపవిలాససత్కళామూర్తి
లలితభాగ్యవిశాలలక్షణాన్వితుని 580

## లింగభూపతికుమారుఁడు రామభద్రుఁడు

కలితచాతుర్యవిక్రమధురంధరుని
రామభద్రనృపాలు రమణీయశీలు
శ్రీమంతు బాంధవాశ్రితకల్పవృక్షు
బలరామ సత్వసంపన్నునిఁ గాంచి
చెలువుమీరఁగఁ బోషింపుచు నుండె. 585

## లింగభూపతిపరాక్రమము

అంగ వంగ యుగంధ రాంధ్ర విదర్భ
బంగాళ నేపాళ బర్బర ద్రవిళ
లాట కర్ణాట వరాట కాశ్మీర
గోట విదేహ కాంభోజ సౌరాష్ట్ర 590
ారు కరూశ మరాట కోశలాత్యంత
రణిత లేశు లెంతయుఁ సంతసింప

కురువీరబలముల గోరించినట్టి 610
నరుఁడే విభుండని నరనాథు లెంచఁ
గదిమిన శత్రువుల్ గళవళమంది
చెదరి పోరఁగ లేక చేతులు మొగిచి
కావుము బసువశంకరబిరుదాంక
ప్రోవుము బెళగంటిపురి శిలాటంక 615
శరణు గండరగండశత్రువిభాల
కరుణించి రక్షించు గాయగోవాళ
కీర్తించెదము మిమ్ము కేళాదిరాయ
యార్తులమన్నింపు మనసీశగేయ
యని వేడుకొనిన దయాదృష్టి చూచి 620
తనరు వేడ్కల ధర్మదారఁ బొన్పించి[1]
సమరంబు చాలించి చయ్యన మరలి
ఘనతతో ధారుణీరమణులచేత
దళవాయి వేంకటధరణీశు చేత
నలరుచు దగు సొచ్చు లగు మెచ్చు లందు 625

---

1 తనరు వేడ్కల ధర్మదారఁ బట్టించి (క)

సమరాంగణకిరీటి శాత్రవధరణి
రమణ త్రిదశకోటిరణరంగవిజయ
ఘాటిఘోటకఖురోద్ధతవైరికోటి
కోటీరవాటి సద్గుణమణిపేటి 645
యగుకోటిపాటిమాకావనీంద్రునకుఁ
దగనుద్భవించిన తరుణీలలామ
సరసకళాధామసౌందర్యసీమ

{ ముద్దులనాయనిభార్య తిరుమలాంబ; కుమారుఁడు వెంగభూపతి }

తిరుమలాంబామణి స్థిరలగ్నమునను
చెలఁగి కల్యాణమై సిరులచే నలరి 650
యొలమి ధరాస్థలి నేలుచు నుండి
నలకూబరజయంతనలచక్రవర్తి
లలితరూపవిలాసలక్షణమూర్తి
శతపత్రహితపుత్రశంకరమిత్ర
వితరణంబౌ షష్టివిద్యాప్రవీణు 655
మానినీ పాంచాలు మహనీయశీలు

నగణితకీర్తి నెయ్యముగల్గి మెలఁగి
వసగు శ్రీభాస్కరాంబామణి నెలమి
సరసవైఖరుల ముచ్చటలఁ బ్రోచుచును 675

## లింగభూపాలునికీర్తికాంతావర్ణనము

సలలితసంపూర్ణచంద్రబింబంబు
వలువుమీఱినయాననంబును గాఁగ
వలనొప్పు తెల్లకల్వలవిలాసముల
కలికిబెళుకులసోగకన్నులు గాఁగ
లలిత మాధవళతిలప్రసూనంబు 680
విలసిల్లు నాసికావిభవంబు గాఁగ
పలుచని ఘనసారఫలకపుబ్రాఁతి
చెలువొందు ముద్దుల చెక్కుళ్లు గాఁగ
మలచి సానలు దీరు మగరాలచాలు
కలితమౌ రదనవికాసంబు గాఁగ 685
సరసంపువలమురి సౌభాగ్యగరిమ
కరము రంజిల్లెడికంఠంబు గాఁగ
నరసి చూఁడగ నంద మగుకల్వలతలు

పరువడి భాసిల్లు బాహువుల్ గాఁగ
భూనుతంబై మించు పుండరీకములు 690
మానితహస్తపద్మంబులు గాఁగ *
శ్రీలవిరాజిల్లు సింహావిస్ఫూర్తి
లాలిత గగనావలగ్నంబు గాఁగ
చెన్నొంది మిన్నగు చెలగుచున్న
పొన్నక్రొవ్విరిమీఱు పొక్కిలి గాఁగ 695
పురుషజాతబంధుకస్ఫురితోరంబములు
బిరుదులు రాణించు పిరుదులు గాఁగ
సముదగ్రశారదాస్తంభభాగ్యములు
కమనీయమృదులోరుకాండముల్ గాఁగ
రకమై వెలింగెడురజతకాహళులు 700
సుకరంపుజంఘికోస్ఫురణాలు గాఁగ
నాకమహీజాతనవపల్లవములు
ప్రాకటం బగుపాదపద్మముల్ గాఁగ

* చెలువొందు తారాద్రి శిలాద్రిగాత్రములు
మలయుచు జొక్కపు గుబ్బలు గాఁగ (శ)

కళల నొప్పెడుతారకానీకములు
సొలపులు గలమేలిసొమ్ములు గాఁగ 705
బలుదండిగాఁగాయుపండు వెన్నెలలు
బొలుపొందు వెలిపట్టుపుట్టముల్గాఁగ
వెలసిన సత్కీర్తి వికచాబ్జముఖిని
పలుకులకొమ్మయంబరనదీరమణి.
కులుకు చక్కని పెండ్లికూఁతుఁ గావించి 710
నిలిచి పేరంటముల్ నెరపుచునుండ
భీమరాములు పెండ్లి పెద్దలై మెలఁగ
తామస మెడలించి దగ్గఱఁ జేరి
యలనారదుఁడు పురోహిత మొనరింప
చెలఁగి యశోలక్ష్మిఁ జేకొని వేడ్క 715
బలపరాక్రమభీమభాగ్యసంపదల
విలసిల్లె లింగపృథ్వీతలేశ్వరుఁడు
ఎంతకాలంబు మహీమండలంబు
దంతావళంబులు ధరణీధరములు
వననిధానంబులు వాహినీతతులు 720
దినరాజచంద్రులు దిక్పతుల్ సురలు

తారకావళులు వేదములు ధర్మములు
నారూఢి విలసిల్లు నంతకాలంబు
నాయు రారోగ్యంబు లమితసౌఖ్యంబు
లాయతసంపద లఖిలభాగ్యములు 725
మానితోన్నతసామ్రాజ్యభోగములు(?)
సురుచిరకల్యాణశోభనంబులును (?)
కరితురగాందోళికాస్యందనములు
గలిగి రావిళ్లలింగమహీంద్రుండు
వలనొప్పి జగతి ప్రవర్ధిల్లుచుండు 730
అని యిట్లు సకలలోకాభిరామునకు
ఘనఘనాఘనచంద్రకల్పధరాజ
శిబిదధీచిబలీంద్ర దిక్పాలకావన
విబుధధేనుసమానవితరణశ్లాఘ్యునకు
శరజన్మగాంగేయశక్రతనూజ 735
వరబలోద్దండదుర్వారశౌర్యునకు
బహుళప్రతాపప్రభాపరాభూత
మహనీయతరచండమార్తాండునకును
కోమలమాధుర్యగుణధురీణునకు

భామినీ నూతనపంచబాణునకు 740
సకలపురాణశాస్త్రవిధిజ్ఞునకును
వికటశాత్రవబలవిచ్ఛేదనునకు
శరణాగతార్తిసంరక్షకునకు
నరపతి సింహాసనస్థాపకునకు
గురుతర రావిళ్లకులభూషణునకు 745
ధర వెన్నఁదగులింగధారుణీపతికి
నంకితంబుగను నే నార్యులు మెచ్చ
పొంకించి రచియింపఁబూనిన యట్టి
పరమసౌగంధికాప్రసవాపహరణ
చరితంబునకుఁ గథాసరణి యెట్టిదన. * 750

---

* అయ్యపనాయకునికుమారుఁడైన కొండన్నృపతి కిద్దఱు పుత్త్రులున్నట్లు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని వ్రాతప్రతియం దున్నది.

*ఆకొండన్నృపతి బాహుబలోదగ్ర
భీకరశౌర్యగంభీరచాతుర్య
వినయవివేకప్రవీణులైనట్టి

# ప్రథమాశ్వాసము

## కథాప్రారంభము

సకలపురాణశాస్త్రంబులు వినుచు
నకలంకహృదయుఁడై నలరుచు నుండి
జనమేజయుండు వైశంపాయనునకు
వినయమార్గంబుల వినుతులు చేసి
విహితభక్తిజ్ఞానవిభవవైరాగ్య 5
మహితతపోధనమౌనికులేంద్ర!
పాండవులకు యదుపతికి నేతెరఁగు
భండనంబు ఘటిల్లె? ప్రదన మేరీతి?
అలర జయాపజయంబు లెవ్వరికిఁ
గలిగె నానతియిమ్ము కరుణాపయోధి 10
యని విన్నవించిన యతికులేంద్రుండు
మనుజేంద్రుఁ జూచి సమ్మతి నిట్లు పలికె.

## బదరికావన వర్ణనము

భూతలాధీశ! జంబూద్వీపమునను
ఖ్యాతి కెక్కిన యట్టి కాంతారములగు
మేలైన మిక్కిలి మిన్నంటి పెరిగి 15
పాటిల్లు పాటలి పనస ఖర్జూర
చూతమహావటాశోకహింతాల
మాతులుంగాశ్వత్థ మాధవి వకుళ
మందార చంపకామ్లాత తక్కోల
కుంద కురంటక కుబ్జ కుటజ 20
బదరికా జంబీర పాటలి నింబ
కదళికా కౌరద క్రముక పలాశ
తాల తక్కోలాది తరులతావితతి
కాలవాలంబునై యనవరతంబు
పల్లవదళపుష్పఫలవిలాసముల 25
సల్లలితామోద సరసమై ఖరుల
వాసవనందనవనమును బోలి
భాసిల్లు నిరతంబు బదరీవనంబు
ఆకాశనంబున ననవరతంబు

నాకాల మీఁకాల మని తేటపడఁగ 30
సొలపువాసనలచే జోటజోట వడియు
పలుచనిపూఁదేనెపై నాస పొడమి
చిగురుజొంపములపై చిత్తముల్ నిలిపి
తగుఫలాపేక్షల తమకముల్ మించి
గగనభాగం బెల్లఁ గప్పి యుప్పొంగి 35
జిగిమీఱ దిక్కులఁ జీకట్లు గ్రమ్మఁ
జను భృంగశుకపికసంఘముల్ గాంచి
తనరుచు బలుసీరదము లని తలఁచి
వెలయు కలాపము ల్వికసింపఁజేసి
యలమితోఁ జుత నటించుచు మయూర 40
తతులను తాళభేదనము వీణియలు
జతగూడ మీటుచు స్వరలయకాల
మానముల్ దెలిసి వేమరు రాలు గరఁగఁ
గానంబు లొనరించు గంధర్వపతులు
గానము ల్విని సొక్కి గదుపులై చేరి 45
పూనిన పరవశంబున వైరవర్గ
ములు మాని యానందమున వినుచున్న

సలలితబహువిధజంతుసంతతులు
కమనీయబహువనక్షేత్రవాగిరుల
కమలసంపూరితకమలాకరముల 50
రాజిల్లు రాజమరాళసంఘముల
నోజతోడుతఁ జేరి యొక్కొక్కగూడల
కిలకొట్టుచును జలక్రీడ లీవేళ
సలుపుచు మెలఁగు సద్బృ[illegible]
కన్నులపండువుగాఁ జూచి భ్రమసి 55
క్రన్నన విలుకానికయ్యంబునకును
తమకించి బోదలు గంధర్వశేఖరులు
కమలకాండాసక్తకమలాకరములఁ
గడునోర పోరులు గలుగక గుంద
నడుపులు నేర్పు కిన్నరరాజముఖులు 60
నలువొంద రంభాదినలినలోచనలు
సలలితనాట్యప్రసంగవైఖరులఁ
జెలువురంజిల్లుమై సిరిపొంకములును
బొలుపొందు నభినయంబులసోయగములు
గొలఁదికిమీరినకోపుచాలులును 65

బెళుకులు దళుకులు పేరిణివిధము
లొనరంగ వీక్షించి యుల్లము ల్చెదరి
యనయంబు మోహించుయక్షవల్లభులు
సొరిది నన్నియుఁ జూచి చూడని యట్ల
వెర వొప్పఁగా విని వినని మార్గముల 70

పరమేశ్వరుని మనఃపద్మంబునందు
నిరవొందఁగా నిల్పి యీషణాత్రయము
హరియించి యెపుడు బ్రహ్మధ్యాను లగుచు
ధరతపంబులు సేయు తాపసోత్తములు
మరి పెక్కుఁగలవిచిత్రమహిమలు గలిగి 75

పరువడి విలసిల్లు బదరికావనము.
ఆవనమధ్యంబునందు సత్యంత
పావనంబై భవభయహారం బగుచు
గరుడగంధర్వరాక్షసయక్షఖచర
సురకిన్నరమునీంద్రశోభితం బగుచు 80
ధర నెన్న మోక్షప్రదాయకం బగుచు
గరిమచే వెలయు గంగాతీరమునను

### పాండవులు గంధమాదనమున నివసించుట

పరువడి వసియించు పాండునందనులు
ధరణీసురులతోడఁ దమవారితోడఁ
దగినవేళలను గృహస్నానములను 85
నగణితంబగు పురాణాదులు వినుచుఁ
జెనఁటి యాగముల రాజు చేసినట్టి
లనయంబుఁ దలఁచుచు నావాసంబునను
ధూర్తదానవకోట్ల ద్రుంచివైచుచును
నార్తులఁ బ్రోచుచు నలరుచుండఁగను. 90

### వసంతకాల వర్ణనము

పొలుపొంద తీయనిపూవుఁ దేనియల
వలసి వల్లములుగా వలగొని త్రావి
మధుమత్తవిస్ఫూర్తి మలయుచు మెలఁగు
మధుపసంఘంబులు మధురగానముల *
జతలుగూడి యపాంగసంగతుల్మెరసి 95
సతతంబు క్రీడించుచుం దరుణాంగనలు

*మధురప్రసంగముల్ మధురవాక్యములు (క)

సలలితంబైన రసాలసాలములఁ
జెలువుమీరిన లేఁతచిగురులు మెసవి
కడుపులు నిండి పెక్కుసమైనసనల
కడలకుఁ దోలఁగించి కడు మెడలెత్తి 100
ప్రాకటంబుగఁ గూయుబలుకలకంఠ
కాకలీరవములఁ గలయంగనిరత
మానందహృదయులై యలరుచు మధుర
గానంబు లొనరించు గాంధర్వపతులు
వెలయు భూజములకు ప్రేగుగాఁ బండి 105
బలురసంబుల పరిపక్వంబులైన
ముంతమామిడిపండ్లు ముక్కునఁ జిమ్మి
గొంతులగోలఁదిగాఁ గుటగుట ద్రావి
తామరతంపరై తనివిదీరినను
వేమారు పుక్కిళ్ల వెళ్లఁగాయుచును 110
చెలువంబు మెరయ రాచిలుకలకులుకు
పలుకులతోఁగూడ బహుతాళగతుల
వరుసతో మాధుర్యవాగ్విలాసముల

కెరలి దర్పాలు బాడునెన్న రసఖులు *
లాలితస్వరకాలలయలాగగతుల 115
తాలమానంబులు దప్పకయుండ
కుటిలకుంతలములు కులికిసవరింప
నటియించు దేవతానలినలోచనలు
బొలుపుమీరిన మల్లెపూఁబోదరింప
వలరాజుకేళిలో వలపులు హెచ్చి 120
ప్రమదంబులను బహుబంధనైఖరుల [1]
రమణులతో సమ రతులభోగించి
యంతంత మోహంబు లగ్గలంబైన
కాంతులఁ బైకొని కళ లుప్పతిల్లఁ
బలుమరు ధమ్మిల్ల బంధము ల్వీడ 125
బలువిడి కబరికాప్రసవముల్ రాల
సొలపుమై చెమటలు సోనలై గురియఁ
జెలువంపుహారముల్ చిక్కులుపడఁగ
నలువురంజిల్లు కంకణము లందియలు

---

* బల్కు (క) (ట)  1 మార్గముల (క)

ఘలుఘల్లు రని తాళగతులచే మొరయ 130
పసుపడి సుపరతిబంధవైఖరుల
ననయంబు క్రీడించు యక్షకామినుల
నలసత వెడలింప నతులమోదమున
మలయుచు విహరించు మందవాతములు [1]
మనుజేంద్ర! మరి పెక్కుమహిమల నలరి 135
చనుదెంచె నపుడు వసంతకాలంబు

## భీముఁడు కందమూలములఁ దేఁబోవుట

ఆసమయంబున నాయరణ్యమున
భాసిల్లు వేడ్కల బాండవాగ్రజుఁడు
తమ్ములు హితులు బాంధవులు గొల్వఁగను
సమ్మతి ద్రౌపది నెయ్యంబు నెరప 140
పొలుపొంద ధౌమ్యాదిభూసురావళులు
చెలువంబుగను సుఖాసీనులై యుండ
ననురాగమునఁ జేర నరిగి యేవేళ
మునులు భూతభవిష్యములు దెల్పుచుండ

1 వాయువుల (త)

దుష్టదానవకోటి ద్రుంచివైచుచును 145
శిష్టరక్షణమును జేయుచుండగను
జెన్నొంద నొకనాఁడు చెలఁగుచు భీముఁ
డన్నకు మ్రొక్కి ధౌమ్యాదుల కెరఁగి
తమ్ముల ద్రుపదనందన నాదరించి
నెమ్మి నానాయుధనికరము లూని 150
మందస్మితంబున మసలక వేగ
కందమూలఫలార్థగమనుఁ డౌపుడు

ద్రౌపది భీమునితోఁ గూడ
వనవిహారము సేయఁ గోరుట.

ధరణీతల శ్రోణి ద్రౌపదీరమణి
అరసి దిగ్గనలేచి యనిలనందనుని
దారి కడ్డమువచ్చి ధన్యుఁ జూచి 155
నేరుపుతో మ్రొక్కి నిలిచి యిట్లనియె
అనఘాత్మ! నేఁడు నీయనిలజా వెంట
వనవిహారమునల్ప వాంఛ బుట్టెడిని
యీచెంత నున్న మహీరుహావళులు
పూచి కాచి ఫలించి పొదలుచున్నవియు 160

తక్కినవనముల తరులతావితతు
లిక్కడికన్నను యెక్కువ లేవొ!
అక్కడివనభూము లావినోదములు
మక్కువతోఁ జూచి మరలివచ్చెదను
యనుమతు లిచ్చెప్పక నవును కాదనక [1] 165
నెనరున తలఁపు[2]మన్నించఁగావలయు
నని వేఁడుకొన్నట్టియంభోజముఖిని
గనుఁగొని పాండవాగ్రజుఁ డిట్టు లనియె
వనజాక్షి యిటువంటివాంఛలు గోర
జను నె నీమదిలో విచారించి చూడు 170

ధర్మరాజు పలుకుట

మనకు రారాజుకు మానసిపగలు
ఘనముగా నేవేళ గలిగియుండఁగను
అదిగాక యీనిబిడారణ్యభూమి
మదదానవేంద్రులు మలయుచుండఁగను

---

1 అనుమతు లిచ్చెప్పక నవును కాదనక (చ)
2 సెలవు (378)

అనిలనందనుఁ డొంటి నరుగుచుండఁగను 175
చనియెదవన నీకు సమ్మత మగునె!
సరసీరుహానన సఖియలెల్లర్కు
లరసి చూచిన నెంతకైననువచ్చు
కామినిచే బలుఁగనినాన వగుట
యేమియుఁ దలపోయ నిది నీతి గాదు 180
కసిబోయి తిరిగెడు కావడిబరువు *
వసుధపై మోసేటివారికి తెలుసు
కడనున్నవారికిఁ గానఁగా రాదు
పుడమిలో పయనమై పోయెడివారి
నరికట్టఁగాఁ జెల్లదరుగుని వేఁగ 185
సరసంబు లిక చాలు చాలు రమ్మనిన
అండజయానరోషాశ్రువులొలుక
పాండవేయాగ్రణి భాషించి చెలికి

ద్రౌపది నిష్ఠురోక్తు లాడుట

నరవరోత్తమ నీవు ననుదూరవచ్చు

1 కాశికిబోయిన కావడిబరువు (ట)
కసిబోక తిరిగెడు కావటిబరువు (త)

నరుడుగా మీరు నాకై పడ్డ చేటు 190
లరసి చూడంగ నెన్నైనను గలవు
గరిమతో నేకచక్రంబునఁ జేరి
చలములు విడిచి భిక్షము లెత్తి గుడిచి
పలువురు విప్రులపంచల ముడిగి
యున్నతస్థితిమాని యున్నది యెల్ల 1?5
నన్నుంచి కాదె! యోనరనాథచంద్ర!
మాయజూదము లాడి మహిఁగోలుపోయి
దాయలచేఁ జిక్కి ధైర్యముల్ వదలి
కూళలై యాయుధకోట్లఁబోనాడి
ఆలి నంగడిబెట్టి యపకీర్తివడసి 200
బేలలై పగరకు భృత్యులై చేసి
చలములు విడిచి భిక్షము లెత్తి కూడు
పోలింపఁ ద్రోపులఁబోయి యన్నిటికి
యలసి యుండుటయెల్ల నన్నుంచి కాదె!
ఘోరాటవులఁజేరి కోపంబు లుడిగి 205
కూరలుగాయలు కూర్మిగాఁ గుడిచి
నారచీరలఁగట్టి నగుబాటుకోర్చి

చాయసువస్త్రభూషణములు నిచ్చి
పొలుపొందనిష్టాన్నభోగము లొసగి
నలుగురఁ జెందుట నన్నుంచి గాదె! 210

అనఘాత్మ! నిన్ను నే ననఁబని లేదు
తనదార బ్రహ్మాస్త్రతేజుఁ డప్పాండు *
మాయయ్య ద్రుపదభూమండలేశ్వరుఁడు
పాయని ప్రేమల పగలును రేలు
దాదులరొమ్ములఁ దనరఁగనట్టి 215

దూదిపానుపులయందు బనిచి గాపున
యేకోర్కెఁ గోరిన నేవేళ నైన
నైశాన్యఁగాఁ దెచ్చి కరుణతో నిచ్చు
పలుమారు మీపాలఁబడినది మొదలు
నలమటకోదువలే దది మీకె తెలుసు 220

నొకనాయకుని నమ్మి యుండినసతికి
సకలకోరికలెల్ల సమకూర్చు నతఁడు
అతులితాటోపు లత్యంతప్రతాపు

* లేదు (2421)

లతిధైర్యబల విక్రమాటోపులయిన
పతు లేవురును గల్గి పడుపాటులెల్ల 225
జితపడ ననుభవించితి నని పల్కు
యనిలతనూజుని యాననాబ్జంబు
గనుఁగొన నాతఁ డగ్రజున కిట్లనియె

### భీముఁడు ద్రౌపది నంపుమనుట

నరనాథ! మీయనుజ్ఞలు గల్గెనేని
ధరణిపై నా కసాధ్యములును గలవె 230
నను నీవు పేదమానవునిగఁ జూచి
యనిలనందనుఁ డొంటి యని పల్కఁదగునె
సాటికి నెక్కు నిశ్శంకరాయనికి
కోటముత్తిక లన గూడునే యెందు [1]
తిలకించి చూడు రాతికిగిలిగింత 235
గలిగిన నాకళ్కు గలుగుభూపాల [2]

---

1 కోటముత్తికె లన గూడునా యెందు (క)
కోటముట్టిక యనఁగూడునా యెందు (త)

2 గలుగునె లోకంబులోన భూపాల (చ)

నీకు నేవెఱచుట నిక్క మొక్కటిగా
కాక భయంబునే కల్గిన నెఱుఁగ!
కురురాజు నాకపక్షకొండఁగాఁ జేసి
పరునడి మొనఁజూపి పల్కితి రిపుడు 240
అతనికిఁ దోడుగా నమరగంధర్వ
పతు లేఁగుదెంచిన బన్నిఁ బెట్టింతు
ననుఁజూచి యిప్పుడ యానతీనాకు నవుడుఁ
డన విని ధర్మజుఁ డనిలజుఁ జూచి
ఓభీమ! కల దింక నొకసంశయంబు 245

ధర్మరాజు సంశయంబు

శుభితహారిణాక్షి యానీలవేణి
నిఁగ నేమి యనవచ్చు నిటువలెఁ గోర
సొగసినట్టిన రాదు సులభంబు గాదు
బహుయక్షరక్షసభయద మీవనము
విహితంబు గా దిది వీరాగ్రగణ్య! 250
యదిగాక నీవైన నర్జునుండైన
పదపడి నన్నుఁ గాపాడకయున్న

కలుషాత్ముఁడైన యాకౌరవాధిపుఁడు
పాలింతు నని చెంతఁ బొంచియున్నాఁడు.
అక్కట చనియెద నన ధర్మ మగునె! 255
అక్కడ గాండీవి యమరేంద్రపురికి
తతశక్తి నేఁగె నింతకుఁ జేరఁడాయె!
నతఁ డిందు రాక నిన్ననుపలే నని న
వినయంబుతో మ్రొక్కి వేడ్క రంజిల్ల
ననిలతనూభవుఁ డన్న కిట్లనియె. 260

### భీముని సమాధానము

అమరేంద్రపురినుండి యర్జునుం డిపుడె
కమనీయవస్తువుల్ గైకొనివచ్చు
వహికెక్కు కురుపతి వచ్చిన నకుల
సహదేవు లున్నారు సమయింపఁగలరు
జగదీశ! సతులవాంఛలు దీర్పకున్న 265
నగణితపాతకం బని యంద్రు బుధులు
ముద్దుంచి మన మీతమోనిభవేణి
పద్దుదీర్పకయున్న భావ్యంబుగాదు

లలనలు చిన్నబోయెను సిగ్గునను
తెలియఁజెప్పిన *దండ వేయిం గ్రోల్చిన 270
సకలలోకంబులఁ జండప్రతాప!
అకలంకగతి నిల్పు ననఘుండ వీవు
పెలుచ నీపేరు చెప్పినయంత మున్గఁ
దలఁచఁగా శక్యమే ధరణీతలేంద్ర!
ముక్తిప్రదాత కాముని గన్నతండ్రి 275
భక్తశరణ్యుఁ డాపద్బాంధవుండు
ఘనవర్ణుఁ డఖిలజగద్రక్షకుండు
మనపాలఁ గల్గఁగా మరిభయం బేల?
నుతికెక్కు నానందనుని ఘటోత్కచుని
ధృతిమీర మీసన్నిధిని నిల్పి పోదు 280
ధరణీశ సెలవిమ్ము తడవేల యనిన
నరనాథునకు మ్రొక్కి నకులుఁ డేఁగెనిటు.

### నకులుఁడు ద్రౌపది సంపు మనుట

తావకకీర్తిప్రతాపములు సకల

---

* పట్టిన. (ట)

దీపులయం దెల్లఁ దేజరిల్లఁగను
అదిగాక భీము బాహాటోపశౌర్య 285
విదితగదాదండవిస్ఫులింగములు
శిఖిశిఖారేఖ ప్రసిద్ధమై మిగుల
నిఖిలలోకంబులయందు వెలుంగ
నక్షీణరథకేతనాశ్వసారథులు
నక్షయదివ్యశస్త్రశరాసనములు 290
[బహులయక్షరాక్షసభయదమీవనము
విహితంబుగా దిది వీరాగ్రగణ్య
యదిగాక నీవైన నర్జునుండైన
పదపడి నన్నుఁ గాపాడక యున్న
కలుషాత్ముఁడైన యాకౌరవాధిపుఁడు 295
పొలియింతు నని చెంత బొంచి యున్నాఁడు
అక్కట చనియెద నన ధర్మ మగునె
అక్కట గాండీవి యమరేంద్రపురికి
తతశక్తి నేఁగె నింతకుఁ జేరఁడాయె
నత డిందు రాక ని న్ననుపలే నన్న 300
వినయంబుతో మ్రొక్కి వేడ్క రంజిల్ల

పదపడి యాలేఖ భద్రంబు చేసి 320
కరమధ్యమున గట్టి చట్టమైనట్టి
వరశరాసనము, చెల్వమున చేపట్టి
గొనకొని విలునారి గొనయ మెక్కించి
కనకపుంఖోజ్జ్వలకాండ మంకించి
నారి సంధించి యానాక మీక్షించి 325
ప్రారూఢకర్ణాంతపర్యంతమునను
దిగిచి కవ్వడి సన్నిధిని నిల్పు మనుచు
గగనవీథికి నేసె ఘనతరాస్త్రంబు
అపుడాశరాసము నద్భుతం బడర
గప్పున సురగలోకము సొచ్చివచ్చి 330
కాకోదరాధీశు గర్వం బడంచి
వైకుంఠమునకు జవంబున నేగు
గరుడుని లీల నాకాశమార్గమునఁ
గర మొప్ప నధికవేగమున నేతెంచె
వరభోగభాగ్యదుర్వారసంపదల 335
సరసమై చెన్నొందు స్వర్గంబునందు
కౌండిన్య గౌతమ కశ్యప కణ్వ

మాండవ్య మైత్రేయ మౌద్గల్య ప్రభృతి
పరమమునీశ్వరుల్ పార్శ్వభాగముల
నరసి పురాణశాస్త్రాదులు చదువ 340
తుంబురునారదాదులు వీణియలను
తంబురుల్ మీటి గీతములు పాడఁగను
రంభావధూటి తోరంపువక్షోజ
కుంభంబు లొక్కింత కులుకఁ జెల్వుగను
కొలువున వచ్చరుకాని మెచ్చి ముప్ప 345
నలుదెరంగుల మెచ్చి నాట్యంబు సలుప
నురగేంద్రనిభవేణి యూర్వశీరమణి
పరువడి కటకచభారంబులకును
గడువడిఁ బరికింపఁ గద్దు లేదనెడి
నడుము దొట్రుపడంగ నర్తనం బాడ 350
మెలకువ గతులచే మేనకాలలన
నిలుకడతోఁ జేరి నృత్యంబు సలుప
నలమంజుఘోషామృగాక్షి శాస్త్రో[illegible]
నలువునఁ జెలరేఁగి నటనలు సూప
గరుడకిన్నరయక్షఖచరకన్యకలు 355

సిరులు నోలుకఁ జేరి సేవలుసేయ
ఆకటీకట నిల్చి యమరగంధర్వ
రాకేందుముఖులు పరాకులు దెలుప
రహిమించు కాంచనరత్నసంఖచిత
మహితమహాస్థానమంటపంబునను 360
తిరవొందకొలువున్న దేవవల్లభుని
సరిగద్దె యెక్కి యచ్చరులు మెచ్చఁగను
కాలకేయాదుల ఖండించు బిరుదు
లోలి దేవతలెల్ల నుగ్గడింపఁగను
సరసకళావిలసద్వినోదములఁ 365
బరికించుచున్నట్టి ఫల్గునుమ్రోల
నమరసంఘములెల్ల నచ్చెరువొంద
భ్రమసి సంయమిరాజపటలివీక్షింప
సురవిభుం డెంతయుఁ జోద్యంబునొంద
పరివారములు భయభ్రాంతిచేఁ జెలఁగ 370
వ్రాలిన నమ్మహావాయుసాయకము
పోలించి కాంచి యాపురుహూతసుతుఁడు
ఆయస్త్రమున వ్రాయు నక్షరపంక్తి

వాయుసూనునియాన ప్రాంతఁ [illegible]
విహ్వలచిత్తుండై విస్మయుం డపుడు 379
సింహాసనము డిగి చేతులు మొగిచి
వరుస నస్త్రమునకు వలగొని ప్రక్క-
కరమొప్ప తన రెండుకరములు నెత్తి
కమ్మ నమ్మునసంటఁ గట్టినఁ బట్టి
కమ్మపై పాండవాగ్రణిముద్రఁ గాంచి 380
సిరిమించు నాశేఖ శిరసావహించి
గరిమతో నిటలభాగంబునఁ జేర్చి
కనుఁగవనొత్తి వక్షంబున నలమి
పసుపుదఁ గట్టిన బంధముల్ విడిచి
వినయంబుతో కమ్మ విప్పి వాసవుఁడు 385
వినుచుండ చదివె నావీర శేఖరుఁడు
"శ్రీమన్మహారాజ శేఖరుం డఖిల
భూమండలాధీశ భూరిమాణిక్య
మహితకిరీటశుభ ప్రభాజాల
విహితపాదాబ్జుండు వీరపుంగవుఁడు 390
సత్యవ్రతాచారు సర్వజ్ఞమూర్తి

నిత్యషోడశదాననిరతుఁ డైనట్టి
యనఘచారిత్రుండు యమతనూభవుండు
తనరార తనకూర్మితమ్ముఁ డైనట్టి
భుజబలవిక్రమాద్భుతయశోధనుని 395
విజయుని వేట్క దీవించి పుత్తెంచి
నట్టికార్యము నేటియరుణోదయంబు
దట్టించి పవననందనుఁడు కాంతార
మునకుఁ డాఁజని కందమూలఫలములు
గొనివత్తు నని వేగఁ గువలయనేత్రి 400
పతిహితచారిత్రి పాంచాలపుత్రి
నతని కడ్డమువచ్చి యాఁగిపోనీక
గొనకొని తనుఁదోడుకొనిపొ మ్మటంచు
వనజాక్షిచలపట్టు వదలదింతైన
నేమియుఁ దోఁచక నిపు డున్నవాఁడ 405
నాముద్దుతమ్ముఁడ నాకేశతనయ
కడఁకతో నీకమ్మ కన్నాక్షణంబె
పడిగ రమ్మని దూరి వ్రాసినలేఖ”
తేటగాఁ జదివి పార్థివుఁడు వేగంబె

ఖేదంబునకు ప్రద్యు[illegible] [illegible]ంచి కలిగె 410
దేవదైత్యవిదారదీనమందార
యీవిన్నవించెద నేనొక్కమనవి
వడిగ రమ్మని లేఖ వ్రాసె మాయన్న
తడవు నే నిందుండ ధర్మంబుగాదు
పాంచాలపుత్త్రి యాపట్టిన వ్రతిన 415
కొంచెపుపనిగాదు కుధరవిదార
కోరదు మున్నెట్లు కోర్కె లెన్నఁడును
మీరదు మామాట మిగుల దింతైన
చపలనేత్రికి యింతచలము పట్టుటయు
విపరీతకార్యంబు వివరించి చూడ 420
కలహంబు బహుళంబుగాఁ గల్గు మాకు
సెలవిమ్ము చనియెద శీఘ్రమే యనిన
తనయుఁ గౌఁగిటఁ జేర్చి తగ నాదరించి
కనకాంబరములు ఘనభూషణములు
గారవం బెసఁగ సుగంధవస్తువులు 425
పారిజాతాధిక ప్రసవదామములు
యావాసవుం డిచ్చి యనిచిన నతఁడు

దేవసంఘములు సుభళి యని మెచ్చ
సురనాథునకు మ్రొక్కి సొరిది నర్జునుఁడు
వరదివ్యరథ మెక్కి వడి నేగి యేఁగి 430
ద్వైతవనాంతరస్థల మటు చేరి
యాతతభయభక్తి యన్నకు మ్రొక్కి
వరుస ధౌమ్యాచారవరుని శ్రీపాద
సరసిజములకు సాష్టాంగము ల్సేసి
యనవొంద ననిలజు నడుగుల కెరఁగి 435
యనుజులదీవించి యతివ నూరార్చి
యందఱుఁ జూచుచున్నంత దేవేంద్ర
నందనుతో ధర్మనందనుం డనియె.
అర్జున విక్రమోపార్జన సముద
దుర్జనసంహార దోర్వీర సార 440
వనజాతదళనేత్ర వనవిహారంబు
జనఁదలఁచినది యీసామీరి వెంట
నిబిడఘోరాటవినిఖిలదానవులు
ప్రబలులై యందంద బలసియున్నారు
కౌరవాధీశుఁ డిక్కడ దృష్టినిలిపి 445

యిందిందిరాలక యీకోర్కె విడువు
మంచివస్తువులు ప్రేమమున యిచ్చెదను 465
సందీప్తదేవభూషణము లిచ్చెదను
ఇందుబింబానన యీకోర్కె విడువు
రమణీయదివ్యాంబరము లిచ్చెదను
కమలయాతాక్షీ యీకాంక్షలు విడువు
మంచివస్తువులు ప్రేమమున నిచ్చెదను 470
కాంచననాస! యీకాంక్షలు విడువు
కొంచక దక్కినకోర్కె లిచ్చెదను
కాంచనాంగిరో! బుద్ధి కాంక్షలు విడువు
అటుగాక చంద్రబింబాస్య! యీయడవిఁ
బటుతరకాలసర్పంబులు గలవు 475
అరుదందమీనాక్షీ యవ్వనభూమి
నరిసంచయములవిహారము ల్గలవు
కరిరుదయాన భూగహనంబులందు
గురుతరహర్యక్షకులములు గలవు
అరవిందపాణి! యీయడవిలోపలను 480
దురుసైనగంధసింధూరము ల్గలవు

హరిమధ్య! యిట్టిమహాభాగ్యమునను
కరమొప్పు శరభమృగంబులు గలవు
ఏమిగావలె నన్న నిచ్చెద నీకు
వామలోచన! యిట్టివాంఛలు విడువు 485
అన విని పాంచాలి యక్షుఁ జూచి
కనుఁగవ నశ్రుప్రపూర్ణమ్ము నిట్టనియె
అనఘ చారిత్ర! యీయమరేంద్రపుత్త్రు
యనుపొంద మున్నెన్నడైనను మున్ను
కోరి యీగతి వేడుకున్నదిగాదె 490
మారుతి మానవమాత్రుఁడే యకట
అడవిలో లేనిభయంబులు సెప్ప
తడబడి పెదవులు తడుపుచు నిట్లు
తెరగొప్ప నావాంఛఁ దీర్పక మీరు
పరిహాసించఁగ నెంత పని యుండె నాథ 495
మందారకుసుమదామములు నే నొల్ల
సందీప్తదేవభూషణము లే నొల్ల
రమణీయదివ్యాంబరములు నే నొల్ల
క్రమమొప్పు చందనగంధ మే నొల్ల

మంచివస్తువులు ప్రేమమున నేనొల్ల 500
కొంచక దక్కినకోర్కె నేనొల్ల
నంపిన గహనవిహార మంపుదురు
నంపకయున్న నే నన్నియు నొల్ల
నన విని కలకంఠి నపు డాదరించి
ఘనుఁడు కిరీటియగ్రజున కి ట్లనియె 505
జగతీశ! సతులు వాంఛలు దీర్పకున్న
నగణితపాతకం బని యండ్రు బుధులు
లలనలు చిన్నబాలలు వీరవరులు
తెలియ జెప్పినదండతీయ రెంతైన
ముద్దుగా నతిహర్షమున నీలవేణి 510
పద్దుదీర్పక యున్న భాగ్యంబుగాదు
సకలలోకంబులు చండప్రతాప
మకలంకగతి నిచ్చు ననఘుండ వీవు
పెలుచ నీపేరు చెప్పినయంత మమ్ము
దలపఁగ శక్యులే ధరణీతలమున 515
ననిలతనూభవుఁ డసహాయశౌర్య
ఘనధైర్యగాంభీర్యకలితతేజుండు

నరయ హిడింబ బకాసురవీర
వరుల చెండాడినవరబాహుబలుఁడు
సందేహ మేటికి సామీరి వెంట 520
యిందీవరాక్షిని నిపు డంప నగును
నావిని ధర్మనందనుతోడ నగుచుఁ
దావెస నిట్లను ననుమోద మెసఁగ
తావకకీర్తిప్రతాపము ల్సకల
దేవులయందెల్లఁ దేజరిల్లఁగను 525
భీమసేనునిగదా భీమప్రచండ
ధారావిజృంభితోద్దండప్రదీప్త
శిఖిశిఖారేఖాప్రసిద్ధతేజంబు
అఖిలలోకంబులయందు వెలుంగ
నక్షీణరథకేతనాశ్వసారథులు 530
నక్షయదివ్యశస్త్రాస్త్రజాలములు*]
గలమహాబలశౌర్యగాంభీర్యధైర్య

---

* 249-290 పంక్తులస్థానమున గూడినయవి (291-531 పంక్తులు) ఆంధ్రసాహిత్యపరిషత్తువారియొద్దనున్న (క) యను తాళపత్రప్రతియం దున్నది.

కలిత తేజోనిధి గాండీవి గలుగ
నిన్నిఁటికన్నను హితుఁడు బాంధవుండు
వెన్నుఁడు గలుగంగ వెరపేల మనకు
దర్పణంబునఁ బర్వతప్రకాండంబు 535
లోర్పున నణుకులై యున్న చందంబు
నకట దేవరపాలి యాజ్ఞలోఁ జిక్కి
యొకకొంతవెరపుచే నుందురుగాని
ధరణీశ నీసహోదరులు గోపింప
కుగారా జనఁగ నెంత కురుయోధు లెంత 540
సురవరు లెంత రక్షోవీరు లెంత
గరుడనాయకు లెంత గంధర్వు లెంత
నరు లన నెంత కిన్నరు లన నెంత
పరగ త్రిలోకాధిపతు లన నెంత
నెలకొని నీబల్మి నీవెరుంగకను 545

సహదేవుఁడు ద్రౌపది నంపుమనుట

తలపోయ నేటికి ద్రౌపది నంపుఁ
డన విని సహదేవుఁ డగ్రజుతోడ
ననువొంద నిట్లను నవనీతలేంద్ర

కడుభీతితోఁ దల్లికడుపుసొచ్చినను
కడపటవచ్చువికార్యంబు 550
రాకపోనేరవు రానికార్యంబు
లెక్కడనున్నను నింతైన రావు[1]
వలనొప్ప నలచక్రవర్తి రాఘవులు
తలపోయ లేర్వరె దైవవశంబు
దప్పింప శక్యమే ధాతకున్నైన 555
నెప్పటి కప్పటి కేమియనులో
యప్పటి కాపను లమరఁజేయంగ[2]
తప్పివచ్చినమీఁద దైవమున్నాఁడు
అదిగాక మోసఁబోయి యోడితి రిపుడు
మదినుండి నీపవమాననందనుఁడు 560
చలమున నెంతైన చట్రాతినార
వలచు నీపనులందు వలదన్న వినఁడు
అతివ నంపుట లెస్స యంపకయున్న
నతఁడు దోడ్కొనిపోవునది నిక్కువంబు

---

1 లెక్కడనుండిన నెంతైన బోవు. (4491)
2 యప్పటి కాపను లమరకపోవు. (1878)

నాకుఁ దోఁచినయంత నావిన్నపంబు 565
మీకుఁ జెప్పితి దేవ మీచిత్త మింక

## ధర్మజునిసంశయము

అన విని సహదేవు నక్కునఁ జేర్చి
యనుమోదమునఁ బాండవాగ్రణి పలికె.
తమ్ముఁడ నీపల్కు తథ్యంబు మాకు
సమ్మదం బగు నిందు చల్లలే దనుచు 570
నూఁదుక త్రావుచు నుండుమీఘనుఁడు
తోఁదేనెలేనిపాదులు దెచ్చు నెపుడు
మిముఁజూచుకొనుచు నేమియుఁ జింతలేక
నెమ్మదినుండు నన్నియుఁ గల్గినటుల
కాంతారమున నొంటిగా జనువేళ 575
నెంతవారికినైన నింతి సంగడము
నడవిలో నొకకార్యమైన నీరమణి
మెడగుదె కేతెంచి మే లెంచవలయు
నంపక యుండిన నతివదుఃఖించు
నంపిన యేమౌనొ యది గానరాదు 580

బహుభోగముల నున్న పాంచాలపుత్రి
గహనంబునందు సాంగత్యదోషమున
నలమటగుంద నేమనవచ్చు విధిని
పలుమరు దైన్యంబు పగవారి గూడె
నని తలయూంచి హా! యని వెచ్చ నూర్చి 585
కనుఁగవ కలితబాష్పకణములు నించి[1]

ధర్మసూనుఁడు ధౌమ్యునిఁ బ్రశ్నించుట

తెలియ ధౌమ్యాచార్యు నేఁ బోమటయును
అలరి యావిప్రకులాగ్రణి పలికె!

ధౌమ్యుఁడు ప్రత్యుత్తర మొసంగుట

నిటువంటిపనుల్ కైయేటికి మీరు
అటునిటు జూచెద రవనీతలేంద్ర 590
నాకుఁ దోఁచినరీతి నయశాస్త్రయుక్తి
వాక్రుచ్చుచున్నాఁడ వనితతో నిపుడు
కాననభూమికిఁ గదులుచున్నారు
నానావిహారముల్ నడుపుచున్నారు

---

1 ఘనముగా ఉంతించి కటకటా యనుచు (2421)

కనఁగలకార్యముల్ గనుచు నున్నారు 595
వినుతకీర్తులచేత వెలయు చున్నారు
మంచివస్తువులు ప్రేమంబునఁ గొనుచు
వేంచేయుచున్నారు వేవేగ నిటకు
కలఁగ నేటికి మీకు ఘనరాజ్యలక్ష్మి
చెలువంబుతో మిమ్ముఁ జేరుచున్నదియు 600
ననుమాన మేటికి నంభోజముఖిని
ననుపుట లెస్సయా యనిలజు వెంట
నన విని ధర్మజుఁ డౌఁగాక యనుచు
మనమున హర్షించి మారుతిఁ గాంచి
నాముద్దుతమ్ముఁడ నగరాజధీర 605
యోమరున్నందన యోభీము నేన
వనిత నీవెనువెంట వచ్చుచున్నదియు
ఘనమృగాధీశఖగసంకులంబు
తరులతానిబిడీకృతం బైనవనము
సరస చీమకుఁ దూర శక్యంబు గాదు 610

ధర్మరాజొడంబడుట

కంటికి ఱెప్పగాఁ గాపాడి వేగ

వెంటఁబెట్టుకరమ్ము వీరాగ్రగణ్య
అని సెలవిచ్చిన సమధికమోదమున
పనుపడ ధర్మజపదముల కెఱఁగి
యతనిచే దీవన లంది ధౌమ్యునకు 615
హితభక్తిసంభ్రమం బెసఁగ నెంతయును
మ్రొక్కి యాశీర్వాదములు గాంచి యలమి
గ్రక్కునఁ దమ్ములఁ గౌఁగిటఁ జేర్చి
నిశ్చలవృత్తితో నెలఁతఁగూడఁ దాను
పశ్చిమగమనుఁడై పరువడి వెడలె. 620
సంతాపమును బొంది శమననందనుఁడు.[1]
చింతించి నకులుని జేరఁగాఁ బిలిచి

### భీముఁడు ద్రౌపదితో వనమున కేగుట

వనితాలలామంబు వాయునందనుఁడు
ఘనమైన ఘోరదుర్గములకుఁ జనిరి
అమరగంధర్వవిద్యాధరయక్ష 625

---

1 శమననందనుఁ డంత సంతాపమంది
యమరేంద్రసుతునితో ననియె నెంతయును. (క)

ధర్మరాజువిచారము : నకులుని భీమునివెంటఁ బొమ్మనుట.

రమణీమణు లహోరాత్రు లెల్లెడల
నిరవొంద జరియింతు రివ్వనభూమి
నెరయ నామదిలోన నెగులు బుట్టెడిని
యవనిపై సఖులపై నర్థంబుపైని
ఎవరికి నైన నభీష్టంబు గలదు. 630

నరయక్షకిన్నరనాగగంధర్వ
గరుడఖేచరసిద్ధకామినీమణుల[1]
సరకుసేయని మహాసౌందర్యశాలి
తరుణిమాత్రంబె యీద్రౌపదీరమణి
చంద్రనివాసంబు సతి నెమ్మొగంబు 635

చంద్రవిలాసంబు సఖియ లేనగవు
కనకంబు నిరసించు కలికి మైమెఱుఁగు
కనకంబు నిరసించు కలకంఠినాస
కువలయానందంబు కొమ్మనేత్రములు
కువలయానందంబు కోమలిపిఱుఁదు 640

---

1 గరుడఖేచరనిశాకరబింబముఖులు (ట ; వ)

సారంగవిభవంబు జలజాక్షి వేణి
సారంగవిభవంబు చారుయానంబు
హరివినోదంబు తొయ్యలి రోమరాజి
హరివినోదంబు కంజాక్షి నెన్నడుము
అబ్జసౌభాగ్యంబు హరిణాక్షిగళము 645
అబ్జసౌభాగ్యంబు అలివ హస్తంబు
దానివిలాసంబు దానిరూపంబు
దానిమిటారంబు దానిచెల్వంబు
దానివయ్యారంబు దగఁగాంచితేని[1]
మానీంద్రులకు నెల్ల మది భగ్గడిల్లు 650
వనితయు మారుతి పచ్చునందాక
ననుమాన మగుచున్న దనఘాత్మ నాకు
పదపడి వారివెంబడి వడి నీవు
కదలిన నామది కలకదీరెడిని
అన విని నకులుఁడు యమసూతుఁ జూచి[2] 655

1 దాని యొయ్యారము దగఁగాంచితేని (ప)
2 అన విని గాండీవి యన్న కిట్లనియె (క)

### నకులుని ప్రత్యుత్తరము

అనఘాత్మ మీపల్కు లవియెల్ల నిజము
కరమర్థి మీయనుగ్రహమున నేఁగ
యిరవొంద వనభూమి కేతెంచునపుడు
నన్ను వీక్షించి గంధవహాత్మజుండు
సన్నల బిల్చి హస్తంబుఁ జేపట్టి 550
ఎన్నెన్ని విధముల నిటచాటి చాటి
యన్న యున్నాఁ డని యరిగె నెంతయును
పదరక నాతని పటువాక్యసరణి
మదిలో విచారించు మానవాధీశ[1]
మనమీఁద క్రోధ మేమరదు రారాజు 665
దినరాజసుతుఁడు బోధించు నాతనికి
చలమున శకుని దుశ్శాసను లెపుడు
వెలుచ మచ్చరములు పేర్చుచుండుదురు
కనుగల్గియుండక గడు మోసపోయి[2]

---

1 ఆమహామహునివాక్యము నిక్క మరయ
నీమది దలపోయుము నృపకులోత్తంస (2421)

2 కనుగల్గియుండ కిక్కడ మోసపోయి (2421)

వెనుక చింతించుట వ్యర్థసంబు 670
ధరణిపై పవననందనుఁ డ దేగకుండెను
నెనయ నాతనిబట్టి నీ వెఱుంగుదువు
గాక సంతట ద్రౌపదీకార్యమునేని
యాకట వనుల కీని నరిగెనగాని
వెనుక బుద్ధులు పదివేలు చెప్పెదవు 675
జననాథ యిపు డిది సమ్మతిగాదు
నావిని ధర్మనందనుఁ డట్లనియె
దా విచారించి యంతయు నూరకుండె
అంతట పవనుజుఁ డలివేణి దాను
కొంతద వ్వరుదెంచి కోనలోఁ గాంచి 680

## ద్రౌపదీవనవిహారము.

వనజాక్షి మాయన్న వలదన్న వినక
వనవిహారము వాంఛ నచ్చితి వీవు
అనువొంద నేఫలం బనుభవించితివి[1]

---

1 ననుబోటి బలశౌర్యనయశాలిచెంత (ట)
ననువంటి బలశౌర్య నయశాలిచెంత(క)

వనిత పోయినయట్ల వచ్చినయట్ల 685
గాకున్న నీమహాగగనంబునందు
నీ కభీష్టం బేమి నిక్కంబుపలుకు
మిచ్చుకువచ్చిన నేవస్తువైన
నిచ్చెద నీయాన [1]యిందీవరాక్షి
నావిని నవ్వి యానాళీకపాణి
తీవి నెమ్మదిని వాటిల్ల నిట్లనియె 690
ప్రాణేశ నాకోర్కె ఫలియింప నీవు
గాని యింకెవ్వరు గల రెంచి చూడ
నడుగ మంటివి గాన నడుగుట సులభ
మడిగిన యిచ్చుట యది దుస్తరంబు
నోటికి వచ్చినయట్ల నూరనవచ్చు 695
మాటాడి నిలుపుట మరికొద్దికాదు.
సతులు గోరినకోర్కె సఫలంబు సేయ
చతురాననునికైన శక్యంబు గాదు
బిరుదు వీరుండైనఁ బిరికివాఁడైన

1 సాధించి. (ట)

సరసి జాతులచెంత సాహసుం డౌను 705
ఎదురు వన్నెయుఁగక నెంతేఁగుఁబల్కు
కదిసి వేడినవేళ కళవళమందు
వలనని యడియాస వలదు భూపాల!
యలరువనంబుల కరుగుదవన్న[1]
కనకాంగివదనంబు గాంచి చూపొంగి 710
యనిలతనూభవుం డనియె సంతసమున
ఎంత మాటాడితి వింతిరో నాకు
కంతువిద్వేషితోఁ గదలివచ్చినను
అంభోజసంభవుం డడ్డగించినను
జంభాసురారి మచ్చరము చేసినను 715
కోరి త్రిలోకము గ్రూడివచ్చినను
దారుణ కార్యంబు దప్పను నేను
తిరమొంద నీకోర్కె దీర్చకయున్న

---

1 సరసాహసుండవు నిక్కంబుగాదు
నరనాథ పురుషులకడకేగినను
వసుధను [illegible]కంబు ఓమియుంపదలఁగు
ననిన పాంచాలితో సమీరజుం డనియె. (1378)

తరుణి నేధర్మజు తమ్ముఁడఁగాను
అన విని పాంచాలి యనిలనందనుని 720
గనుఁగొని యిట్లనె కటకటం బడుచు
నాజీవితేశ్వర నరనాథచంద్ర
రాజవంశాగ్రణిరణరంగభీమ
మతిలేక నే ననుమాటకె యింత
ప్రతినసేయఁగ నీకు భావ్యమే నాథ 725
వనవిహారముజాలు వస్తువుల్జాలు
నిను వేఁడుటలు చాలు నీ యీవి చాలు
బెదరె యుల్లంబు వచ్చినయట్టిత్రోవ[1]
పదపద నీఁకఁజాలు పదివేలువచ్చె
నన విని నవ్వి యయ్యనిలనందనుఁడు 730
ననబోణి వీక్షించి నలువొందఁ బలికె
శీతాంశువదన రాజీవదళాక్షి
నా తెంపు నా పెంపు నా భుజాబలము
గని యున్నదానవు గలఁగ నేమిటికి

---

1 పదపడి ధర్మజు కుజములకడను (2421)

లింపైన వాహిను లెన్నంగఁదగిన
కొలఁకులు నొరపైన కోన లెచ్చోట
గల వచ్చుటికి వేగ గమనించవలయు
అనిన సంతోషించి యనిలనందనుఁడు
చనుమార్గములను గంజాతలోచనకు 755
గరుడకిన్నరయక్షఖచరగంధర్వ
వరసిద్ధసాధ్యనివాసభూములను
వనములు నదులు పర్వతనికాయములు
ఘనమైనపొదరిండ్ల కలితంబులయిన[1]
మహితవస్తువులు వేమారు దెల్పుచును 760
విహితసంభ్రమముల విహరించుచుండ
పొసఁగ నాకట నొచ్చి బొరియలు సొచ్చి
బుసగొట్టుచును నేఁగు భుజగసంఘముల
కొదకక మెడలంటి గొరికి ఖండించి
బొదలు ముంగిసల చప్పుడు లాలకించి 765
యదరుచు కన్నంబులవి లీల వెడలి

1 మునిజనాగణ్యతపోనివాసముల (ప)

కదుపువై చనుమూపకములకు బొంచి
రాగించు బలుబిడాలములపై దుముకి
మూగిన రేచుగుంపులు మీర గొప్ప
గించు బెబ్బులులపై గినియుచు భల్లూక 770
సంచయంబుల నొంచుచు జనువరాహముల
బోనీక మార్కొనబోవ సింహముల
పైన లంఘించి కుంభంబుల వ్రచ్చి
మనుచు వేలె నని యంభోజవదన
ననుపమానందసమందిరాకృతిని 775
లలితలతాంతపల్లవపుష్పఫలతతి
వలనొప్పు శృంగారవనము సొత్తించి
తన కైశ్యవదననేత్రకపోలములకు
తన కాళికాధరదంతపంక్తులకు
తనకంఠబాహులతాహస్తములకు 780
తన కుచరోమాళితనుమధ్యదేశ
ఘనతరనాభికాకటిభోగములకు
తనయూరుజంఘాపదద్వయగతుల
కమరసమానంబులైన వస్తువులు

కమలాకరములందుఁ గని చెలరేఁగి
తుమ్మెదకదుపులఁ దోలి నెత్తమ్మి
గమ్మి యెమ్మె లడంచి కలువలు ద్రెంచి
పలుమారు నవచంద్రఫలకముల్ విరిచి
సొలవక కాంచనసూనముల్ రాల్చి
లలితమౌ బింబఫలంబులు డుల్చి 790
కలగక మొల్లమొగ్గలనిగ లడఁచి
చిలుకల నెగదోలి చెలగి శంఖంబు
కలిమెల్ల వోనాడి కంజకాండములు
చెలువముల్ బెకలించి చిగురాకుగిల్లి
తులకించి పువ్వుగుత్తుల నెత్తిబట్టి 795
చీమబారుల నొంచి సింగంబు దరిమి
వేమారు జిగిపొన్న విరిరేకు మడచి
తెలియంగ కర్పూరదిన్నియల్ ద్రొక్కి
చలమున కదళికాచర్మంబు లెత్తి
కరమర్ద్ది శాలికాగర్భముల్ సించి 800
యరుణాంబుజంబుల నటు నిటు బరచి
యంచలంచల మించు నంచలగముల

నిందుక చప్పట లిడిపారవశ్యము
రవణ మూ కదళికాకారంబు సొంపొంది
యవగాహ మొనరించి యటు వినోదించి 805
తనరారు కాంచనతరుల మధ్యమున
ఘనతరకల్పవృక్షంబులనీడ
భూనుతంబై మించు పూపొదరిండ్ల
జానొప్ప గిరిగింజచప్పరంబులను
ఘనసారమృదువేదికలపోలి వ్రాలి 810
జనపతి దాను విస్తారభోగముల
విలసిల్లురోదలేనివేడ్కల దేలి
పొలపొంద నొకప్రొద్దు క్రీడించి
అంతట జాలించి యచ్చోటు బాసి
కుంతీతనూజుండు కువలయనేత్రి 815
అంచితంబైననీలాభ్రంబు చెంత
మించులు గుల్కు క్రొమ్మించుచందమున
సతికేలు వదలక జనవల్లభుండు
పతిదండ బాయక పాంచాలపుత్రి
ఎంతయు వేడ్కల నింపుసొంపులను 820

వింత వనాంతమున వెదకి చూచుచును
నెయ్యంబుతోటల నికరంబులందు
నుయ్యాల లూగుచు నొగి పొదరిండ్ల
దూరుచు మీరుచు తుమికి యాడుచును 825
నీరజాకరముల నెఱి జొచ్చి హెచ్చి
యోలలాడుచు భ్రమ నొందోరుల్ గెరలి
వేలారువిధముల విశ్రమించుచును
కేళికానగముల క్రీడించి మించి
మేలైనకోనల మెలఁగుచు పూల 830
బంతులవేయుచు బలుదెరంగులను
మంతనం బాడుచు మరి జన నెదుట
మహిజాతముల్ రోమమార్గముల్ గాఁగ
రహిమించుగండశైలములబెడంగు
లలితమగా కుంభస్థలంబులు గాఁగ 835
చలరారు నలపారు టాకుల సిరులు
చలువొందునట్టి కర్ణంబులు గాఁగఁ
తిలకింపగిరినుండి దిగువకు సాగి
తోరమై తగచూడ తుండంబుగాఁగ

నారూప్యశిలకూటజాలంబగరిమ 840
వరుస మహాజలజాలంబు గాఁగ
బరువడి నెడలేక పారునిర్ఝరులు
దనరారు మదగజధారలు గాఁగ
లోనుండి యిల నంటు గోన బైనవిరులు
పనుపడ విలసిల్లుపదములు గాఁగ 845
ననలొందు రమ్యమృగవిహారమహిమ
గరమర్థి భయదలంకారంబు గాఁగ
నరుదుమీరినవారణాచలాధిపు
గనుఁగొని యత్యంతకౌతుకం బమర
నెనయ పాంచాలి కిట్లని పలికె 850
యిందీవరానన యీమహానగము
మందులగుబ్బ లీమలయాచలంబు
హిమపర్వతంబు హేమభూధరము
నమరుతారాగంబు నరుణాగోత్రంబు
నకలంకలీల నణకించుజాలి 855
సకలవస్తుచయంబు సకలభాగ్యంబు
సకలసౌఖ్యంబులు సకలౌషధములు

సకలవైభవము లచ్చటఁ గల్గియుండు
నొకవంక కిన్నరు లొకదిక్కు దివిజు
లొకచక్కి గంధర్వు లొకట గింపురుషు 860
లొక టెంకి యక్షేశు లొకచెంత సిద్ధు
లొకచోట గరుడులు నొకక్రేవమునులు
నమితమోదంబున ననవరతంబు
సమధికక్రీడల సలుపుచుండుదురు
వనజాక్షి యిమ్మహావైఖరిగొంత 865
గనుగొందు రమ్మని కడువడి జనఁగ
మనసిజపవమానమానవాధీన
దినవీరప్రతిమానదేదీప్యమాన
గరుడకిన్నరయక్షఖచరసంతాన
నిరతకల్యాణవర్ణితసంవిధాన 870
సౌభాగ్యసంధాన సంతతానూన
శోభనవిజ్ఞాన సుకరప్రధాన
భూసుతసంతాన భూజవితాన
నానాలతాసూన నవ్యనిధాన
మానితనిరుపమమణిమయస్థాన 875

తానమానసమాన తంత్రీస్వనాన
కలితసాంద్ర నవీన గంధర్వగాన
విలసితం బగు కోనవేట్కలింపూన
గని మెచ్చి మెచ్చి యాకామినీమణికి
ఘనవినోదంబులు గణుతించి మించి 880
పశ్చిమభాగంబు పరికించి కాంచి
యాశ్చర్యచిత్తుఁడై యనిలనందనుఁడు
ద్రౌపది నీక్షించి తగ నిట్టు లనియె
నోపంకజానన నో ముద్దుగుమ్మ
కలికి చక్కెరబొమ్మ కమ్మపూఁగొమ్మ 885
కులుకుమీటుమిటారి కోమలాకారి
యలరు మొల్లలబంతి యంగజాదంతి
కలితకైరవనేత్రి కాంచనగాత్రి
తనరువేడ్కల కొంతదవ్వుబచ్చితిమి
మనవివేకంబు లేమనవచ్చు నబల (త) 890
కుప్పలుగా నున్న గొప్పముత్యములు
చప్పరించుచు వెదచల్లుచుఁ గెరలు
కోపమసింహాదుల మార్కొని పోరి పోరి

కదలని శరభసంఘములఁ దోలుచును
మేదిని నేనుంగు మేతలాడుటకు 895
మోదంబుతో మిన్ను ముట్టి భోరునను
చండవేగంబున జనుదెంచుఘోర
గండభేరుండపక్షిరవంబులకును
భీతి నేగెడురణభీమగృధ్రముల
ఘాతకుదీరి దిగ్గనఁ బారతెంచు 900
బైరిల చప్పుళ్ల భ్రమసి రివ్వునను
బారులగుళ్లనిబ్బరముల దెలిసె
చలియించి పరతెంచుసాళ్వసంఘముల
నెలవెల్ల బరికించి నెగులునఁ బారు
వారణంబులఁ గని వణఁకుచుఁ బొదలు 905
దూరుజాల్ డేగలతోరంపురవళి
కలుకుచు నులుకుచు నన్యోన్యభీతి
కలకలార్భటుల కాకసము గంపింప
బర్దచు నానావర్ణపక్షిసంతతుల
నిరవందఁ జూపుచు నేఁగుచున్నంత 910
సింధురగమనరాజీవదళాక్షి

గంధవాహతనూజుఁ గనుఁగొని పలికె
నవనీశనందను డల్లనె మిన్నుముట్టి
వివిధభూరుహలకావితతులం దొదలి
కనకనానామణీకలితంబు నగుచు[1] 915
కనిపించుచున్న నగంబు పేరేమి?
యని విన్నవించిన యలినీలవేణి
ననురాగమునఁ జూచి యనిలజుం డనియె

### గంధమాదనపర్వత వర్ణనము

తరలాక్షి గంధమాదన మనుపేరఁ
బరఁగినశైలమీపర్వతమహిమ 920
లెన్న శక్యంబె వాణీశునకైన
పన్నగేంద్రునకైన పల్లవపాణి
మందరగ్రామంబు మణికోటినగము
మందులగుబ్బలి మలయాచలంబు
హిమచలోచ్ఛ్రయమును హేమభూధరము 925

---

1. కలిత నానామణికళికంబు లగుచు
విలసితంబుగ చాల వేడ్కరంజిల్ల

నమరుతారాగంబు నరుణగోత్రంబు
నకలంకలీల నణకింపఁజాలి
సకలవస్తుచయంబు సకలభాగ్యములు
సకలసౌఖ్యంబులు సకలౌషధములు
సకలవైభవము లిచ్చుటఁ గల్గియుండు 930
ఒకవంక కిన్నరు లొకవంక దివిజు
లొకచక్కి గంధర్వు లొకట కింపురుషు
లొకటెంక యక్షేశు లొకచెంత సిద్ధు
లొకచోట గరుడులు నొక క్రేవమునులు
నమితమోదంబుల ననవరతంబు 935
సమధికక్రీడల సంచరింపుదురు
వనజాతీ యిమ్మహావైఖరుల్ గొన్ని
గనుఁగొందు రమ్మని గడువడిఁ జనఁగఁ
గడురమ్యముగఁ గ్రొత్తగా ననలొత్తి
వడిజలకణములు వానలై కురిసి 940
సలలితపుష్పగుచ్ఛంబుల వ్రాలి
తొలకెడుపూఁదేనెతోఁగూడ పక్వ
ఫలరసంబులఁ జాలుపైని వర్షించి

బలుకాల్వలై పారి పండువెన్నెలల
కువలయాధిప శిలాకోటులు గరఁగి 945
ప్రవహించి దుముకు నిర్ఝరములఁ గూడి
పచ్చరాచలువలపై నిండి యున్న
పచ్చికస్తూరి తెప్పలు లోఁగొనుచు
సొంపైన సంకల సోలపు జవ్వాది
రొంపుల మీఁద నారూఢిగా దుమికి 950
పసుపడ నేరులై పాఱుచు తేట్లు
పునుఁగున జొబ్బిల్లి పొలుపొందు వెదురు
గుములపై వడిసొచ్చి కుసుమపరాగ
సముదయంబుల మంచికారదలతుల (తరుల)
పొంతలగపురంపు ప్రోవుల నెల్ల 955
వింతగాఁ గలయించి వెల్లువల్ బారి
కడురమ్య మగుతరంగములచే నలరి
బెడిదంబు లగుచు నొప్పెడుపుణ్యనదుల
నవగాహనముల నెయ్యమున గావించి
కవగూడి యువల వేడ్కలుమీరఁ జనఁగ 960
ఉన్నతావరణచంద్రోపలగిరులు

సన్నుతికెక్కిన సాలము ల్గాఁగ
లలితవినూత్నపల్లవరసాలములు
పసమించు మణిసౌధపంక్తులుగాఁగ
ప్రారూఢపుష్పపల్లవకింశుకములు 965
భూరిమాణిక్యగోపురములుగాఁగ
పొలుపొందఁ బూచిన పొన్నభూజములు
బలుమగరాల యుప్పరిగెలుగాఁగ
నెంచ మొగ్గలబోల్చు నీపూలసిరులు
మంచిముత్యపు మేలు మచ్చులుగాఁగ 970
బహుసూనరమ్యచంపకమహీజములు
మహనీయ హేమధామంబులుగాఁగ
సిరు లుల్లసిల్లఁ బూచిన పొదరిండ్లు
సరసంపు చిత్తరుచవికెలుగాఁగ
ధర నొప్పుగురువింద ద్రాక్షపందిరులు 975
మెరపైన చెందొవల్ మేల్కట్లుగాఁగ
కొమరు చెన్నొందు వైకుంఠంబుపోలె
సముదగ్రమాధవసంచార మగుచు
నిటలాక్షలోచననిలయంబుపోలె

పటుసర్వమంగళాభ్యంచిత మగుచు 980
వారిజాసనునినివాసంబుపోలె
నారదశారదానందంబు దగుచు
పురుహూతపట్టణంబునుబోలి యెపుడు
నెరయు రంభాహారిణీయుతం బగుచు[1]
పురుడింపఁగ నయోధ్యఁబోలె శ్రీరామ 985
భరతలక్ష్మణకళాబంధురం బగుచు
పొలుపొందుద్వారకాపురమునుబోలె
బలభద్రహరిచక్రభాసురం బగుచు
కవిరాజకల్పితకావ్యంబుఁబోలె
నవరసాలంకారనైపుణ్యమగుచు 990
సతతకవిస్తుతఛందంబుఁబోలె
యతిగణవర్ణఫలాన్వితం బగుచు
రమణీయరత్నాకరంబునుబోలె
విమలాబ్జబహురత్నవిలసితం బగుచు
ఘనరామరావణకదనంబుఁబోలె[2] 995

1. నెరయ రంభాప్సరోనిర్గతంబగుచు.
2. 4491 లో లేదు.

వనచరాధిపదైత్యవర్ణితం బగుచు
నొరపైన భారతయుద్ధంబుఁబోలె
గురుకర్ణభీష్మసంకులమును నగుచుఁ[1]
దనరారు గంధమాదనపర్వతంబు
చనవున కమలలోచనకుఁ జూపుచును 1000
పలుచనీహారసోపానమార్గమునను
నెలమితో తిన్నగా నెక్కిపోవుచును
మదగజగమనయామార్గంబునందుఁ
బొదలు తుమ్మెదలఁ జూపుచు వేగవేగ
మలయక మిట్టతామరలు ద్రుంపుచును 1005
విలసిల్లు సంపఁగెవిరులు రాల్చుచును
వెసచంద్రఫలకముల్ విఱిచి వైచుచును
అసమానబింబఫలాళి డుల్చుచును
కుందకోరకముల గుంజివేయుచును
పొందైన చిలుకగుంపులను దోలుచును 1010
తెలివైన పోఁకబోదియలు గీటుచును
తొలఁగక జిగిఁదమ్మితూండ్ల ద్రెంచుచును

1. 4491- లో లేదు.

సలువు మీరిన లేఁతపనసలు గిల్లుచును[1]
సలలితసూనగుచ్ఛముల దువ్వుచును
పదరుచు కృష్ణసర్పములఁ దోలుచును 1015
కోదమసింగముల బింకములఁ బాపుచును
చక్కనిఘనసారసైకతస్థలులఁ
ద్రొక్కుచు ననఁటుల తొలఁగ ద్రొబ్బుచును
పొల్చు నిమ్మలబిల్వపాటలబిగువు
సిల్చుచు తాఁబెళ్ళ చదర నూఁకుచును 1020

నరుణాబ్జములు తమ్మి హంససంఘముల
నురికింపుచును మది నుల్లాస మొంది
పతికేలువదలక పాంచాలపుత్రి
సతి నందఁబోయెగ జనవల్లభుండు
వింతస్థలంబుల వెదకి చూచుచును 1025
సంతోషచిత్తులై చన చన నెదుట
మనసిజపవమాన మాధవస్థాన
ఘనవాసనానూనకలితనవీన

1. సొలపుమీరిన లేఁతపనసలు గిల్లుచును (1578)

ఫలపల్లవోత్త్రాన పావనాసూన
లలితవనాసీన లావణ్యమాన 1030
మానితగాంధర్వమానిని గాన
మానస్వనాధీన మార్గఫణీన
తాండవలసమాన దాననిధాన
పాండురద్రుమవిటపస్థలోడ్డీన
కలకంఠముఖపతగవ్యాజమాన 1035
కలకలాకీర్ణలోకస్తూయమాన
సలలితశీతలచ్ఛాయాసమాన
విలసితం బగుకోన వేడ్కలింపూన
గని మెచ్చి మెచ్చి యాకామినీమణికి [1]
ఘనవినోదంబులు గనుపించె వేగ 1040
పశ్చిమభాగంబుఁ బరికించి చూచి

## సూర్యాస్తమయసమయము

మాశ్చర్యచిత్తుఁడై యనిలనందనుఁడు
అంచితాంబుజపాణి యలినీలవేణి

---

1 గని మెచ్చి మెచ్చియాకాననంబునను (ట)

పాంచాలపుత్త్రి నెప్పుడుఁజూచి పలికె
సలలితమృదుపాణి సైకతశ్రోణి 1045
తలిరాకుఁబోణి యాద్రౌపదీరమణి
తనరు వేడ్కల నెంత దవ్వు వచ్చితిమి
మనవివేకంబు నేమనవచ్చు నబల
తిలకించి పడమటిదిక్కు వీక్షింపు
నలినాక్షి ఘడియ యున్నది ప్రొద్దుగ్రుంక 1050

భీముండు ద్రౌపదితో ధర్మజుకడకుఁ దరలుదమని చెప్పుట

నీయహార్యస్ఫూర్తి యెల్లఁ జూచుటకు
వేయిగన్నులు గలవేలుపువశమె!
తడవిందు నిలిచిన ధర్మనందనుఁడు
బుడిబుడి యదటునఁ బొక్కి చింతించు[1]
నామీఁద నీమీఁద నరనాయకునకుఁ 1055
ప్రేమవాత్సల్యంబు ప్రియమును గలదు
ననుబాసి నినుబాసి నరనాథుఁ డెంత

---

1 బుడి బుడి యదలును బొక్కి చింతించు (క)

ఘనదైన్యభయములఁ గలఁగుచున్నాఁడొ![1]
పోవలె పద మని పొసఁగఁ జేపట్టి
పావని మరలింపఁ బాంచాలి పలికె
సన్నుతాటోప! మీసంగడి రాఁగ 1060
నన్నియుఁ గనుఁగొంటి నభిలాషదీరె
కలకంఠ శుకముఖ్యకలకలధ్వనులు
విలసిల్ల వీనుల విందుగా వింటి
సురుచిరదివ్య ప్రసూనవాసనలు
గరిమ నాఘ్రాణింపఁ గలిగె నీవలన 1065
పరిపక్వమాధుర్య ఫలవితానములు
పరువడి రుచిగొని భక్షింపఁ గలిగె
సమ్మతి నొందితి చనుఁ డన నతఁడు

---

1 కవ్వడి నిచటికి గదముచున్నాఁడొ
యెవ్విధి నున్నాఁడొ యిందునిభాస్య
అర్జునుం డిచటికి నరుదెంచెనేని
దుర్జనుం డైనట్టి దుర్యోధనుండు
ఏపనుల్ దలఁచునో యెఱుఁగరా దతని
చేపట్టు గతజలసేతుబంధనము. (త)

### ద్రౌపది యంగముల కీర్తనము

నెమ్మితో డత గమనించు నవ్వేళ
బాలభానుప్రభాభాసితం బగుచు 1070
లాలితామోద విలాసంబు నగుచు
కమనీయకలితశృంగారంబు నగుచు
రమణ లోకైకవిరాజితం బగుచు
సముదితఘనతరైశ్వర్యంబు నగుచు
కొమరొందు బిగిబిగిఁ గులుకుచు నలరి 1075
వేయుదళంబులు వెలయుపద్మంబు

### సౌగంధికము వచ్చి వారలకడఁ బడుట.

వాయువశంబున వడి నేఁగుదెంచి
వరసౌరభము దిశావలయంబు నిండ
నిరువురిసన్నిధి నెలమి వ్రాలినను
పన్నగాశనయాన పాంచాలతనయ 1080
కన్నులపండువు గ్గాఁగ వీక్షించి
గరిమెతో దనముద్దుకరముల నెత్తి
సరసలోచనపంకజంబుల నొత్తి

భావించి కాంచనపద్మంబుఁ గాంచి
పావనివదనంబు పరికించి గాంచి 1085
వామలోచన ఖిన్నవదనాబ్జ యగుచు
భీమసేనునిఁ జూచి ప్రియమునఁ బలికె
ధరణీశ కనకపద్మము గనుఁగొనిన
ద్రౌపది సౌగంధికములఁ గొన్నింటిఁ దెమ్మని భీము నడుగుట
నరుదార మదిలోన నాసవాటిల్లె
గరిమెతో నివ్విరిఁ గైకొందుననిన 1090
సరస మున్నెవ్వరో సవరించినారు
పరులు ధరించిన ప్రసవసంఘములు
నొరులకు ధరియింప యోగ్యముల్ గావు
వనవిహారమునకువచ్చు నవ్వేళ
చనువున ననుఁ బిల్చి సత్యప్రతిజ్ఞ 1095
నడుగు మిచ్చెద నని యంటిరి మీర
లడిగెద నిటువంటిహాటకాబ్జములు
గనుఁగొని యొండైనఁగలదేని తెమ్ము
ఘనత మీసత్యవాక్యము నిల్పుకొండు
చేకొని మీర లిచ్చినవరంబునకు 1100

నాకోర్కె చెల్లించు నాప్రాణనాథ
యీవర మీకున్న నిచ్చోటు పాసి
నే వచ్చునది లేదు నీపాదమాన
అన విని చెగ్గిలి యనిలనందనుఁడు
కనకాంగి పల్కులు కడుముల్కు లగుచు 1105
మనమున నాట ధర్మతనూజునీతి
ఘనముగాఁ దలపోసి కామిని జూసి
కనువిచ్చి మోము వికాసముగాఁ జూచి
యినుదిక్కు వీక్షించి యిట్లని పలికె
కలకంఠి కంటివే కమలబాంధవుఁడు 1110

### ద్రౌపదీ భీముల సంవాదము

పోలుపొందు పశ్చిమాంభోనిధిఁ జేర
నిరులు గ్రమ్ముచు నున్న నీకాననంబు
సురదైత్యులిచట హెచ్చుగ మెలంగుదురు
నారీశిరోమణి నను వంటి మేటి
వీరశేఖరు నీవు వేడితి విపుడు 1115
ఇమ్ము దప్పినవేళ నెంతేసి పనులు

సమ్మతి గాని విచారంబు లనక
కోరుట కొడుపలోఁ గోరినయట్టి
కోరిక లీకున్న కొడుపలో కొడుప
కటకటా సమయంబుగాని యీవేళ 1120

నిటువలె నడిగిన నేమనఁగలను
నిబిడాటవులయందు నిన్నుఁబోవిడిచి
యబల యేవిధమున నరుగుదు నేను
ప్రాణపర్యంతమా పనులయందైన
మానంబు పోకుండ మనవలె నంద్రు 1125
అటుబోవ నిట నెవ్వరైనను గలరె
యిట నున్న నటు నన నెవ్వ రున్నారు
ఇట నిల్తు నటఁ బోదు నేన యటన్న
పటుతరవిశ్వరూపంబును లేదు
తెగువ నిచ్చోటికిఁ దెప్పింతు నన్న 1130
మగువ యాకర్షణమంత్రంబు లేదు [1]

1 రహిమీర నిచ్చటికి రప్పింతు ననిన
మహిమ నాకర్షణమంత్రంబు నెఱుఁగ (క)

మాయన్న చెంత నెమ్మది నిన్ను నిలిపి
పోయెదఁ దెచ్చెదఁ బ్రొద్దున లేచి
కనకాంగి సౌగంధికములు దేకున్న
పనుపడ నామోము పరికింపవలదు 1135

లోలాక్షి ముగుదాటిలోఁ గాలు దూర్చి
నేలమార్గము మాను మీఁదనియంత
చనుదెమ్ము పోదము జాగేల ననిన[1]
వనజదళాక్షి పావని కిట్టు లనియె
అనఘాత్మ నీవంటి యసహాయశూరు 1140
నినువంటి నెరయోధు నే వేఁడుకొనిన
కళవళపడి చేతగాని మానవుని
వలె దూరిపలుక నెవ్వరు చెప్పఁగలరు
మునుపు యిచ్చెద నని మొనసినవేళ
వెనుకముందఱఁజూడ నీరధర్మంబె 1145
యీపని మీఁదన్న యింతయు విన్న
కోపించుకోరికల్ కొనసాఁగఁబోవు

---

1 చనుదమ్ము పోదాము జాగేల యనిన (క)

ముల్లోకములఁ జూడ ముగుదలకోర్కి
చెల్లించఁగలవీరశేఖరు లెవరు
నీవు చింతిల నేల? నెగులొంది నన్ను 1150
భావించి చూచి కోపము సేయ నేల?
విచ్చలవిడి పల్కు వేళలు వేరు
ఇచ్చుట బరికింప నెవ్వరు లేరు
ఇచ్చుట లే దను మిపుడె నీవెంట
వచ్చెద ననిన పావని యిట్లు పలికె 1155
నళినాయతాక్షీ యెంతయు బాలకన్నఁ
బలుచఁగా ననుఁదూరి పలుకఁగ నగునె,
యీయరణ్యమున నిన్నిరవొంద నిల్పి
పోయిన నపకీర్తిఁ బొందుదు నిజము;
కుసిమీర వెంట దోడ్కొని పోదు ననిన 1160
పసదప్పి కార్యంబు పైకొనివచ్చు;
ముందఱ చఱి వెన్క పులి పొంచియున్న
చందమాయెను! నీదుసౌఖ్యంబు రమణి;
కలఁగక నీవంటి కాంత యీబుద్ధి
దలఁచుట యిది యెల్ల దైవయోగంబు 1165

వామాక్షి చలపట్టి వదలవు మీఁద
నేమిగా నున్నదో గుఱుఁగంగరాదు,
నినుఁ దూఱ నేమి నా నేరమె గాదె!
యన విని పాంచాలి యనిలజుఁ జూచి,
అమ్మక్క చెల్లి! యో యనిలతనూజ!
ఇమ్మెయి ననుఁదూఱి యేల పల్కెదవు! 1170
ధర్మనందను కూర్మి తమ్ముండ వగుట
ధర్మశాస్త్రము లాడి తప్పరా దనుచు
మొరలు పెట్టుచు నుండు మొనసిన నెపుడు
విరులు గోరుట లవివేకమే నాథ!
భీముఁ డాడినమాట బేలిక నటన్న 1175
భూమి విశేషంబు పొందుట గాదు
పెక్కుగా నాసలు పెట్టుటకంటెఁ
గ్రక్కున లేదనఁ గలుగుపుణ్యంబు;
పట్టిన ప్రతిన సేపట్టున నైన
గట్టిగా వదలని ఘనధైర్యశాలి 1180
నరునకుఁ గాక పదునాల్గులోకముల
నొరులకు చెల్లునే యుర్వీతలేంద్ర!

అన విని చింతించి యనిలనందనుఁడు,
తనమదిలోఁ గొంత తడవు చింతించి, 1185
చలపట్టి వదలదు జలజాయతాక్షి
తొలఁగఁగూడదు బహుదుర్ఘటం బాయెఁ!
గొరగానిసంగతి గూడి నే నిట్లు
ఇరుకున జిక్కితి నే మనవచ్చుఁ !
గొనకొని తాఁజేసుకొన్నంత తాఁనె 1190
యనుభవింపకతీర దజునకునైన,
గురుతుగా మెడఁజుట్టి కొన్నట్టిపాము
గరువక విడుచునే కటకటా యింక !
కావలియై యింతి కడనుండ నెవరు?,
దేవప్రసూనము ల్దెచ్చువా రెవరు? 1195
వనజాతములఁజూపు వార లెవ్వారు?
అనుచు వితర్కించు నాసమయమునను

నారదాగమనము

శ్రీకాంతుచరితముల్ చెలగు వేడుకల *

* శ్రీకాంతుచరితలంచితవైభవమున (2421, 4502)

పొందమ్మివిరిగోరి పొళ్ళుచున్నదియ
నివియున్న నెలవు లే నెంతయు నెఱుఁగ
వివరించి యొండైన వెదకెద ననిన 1215
నిక్కడి కక్కడి కే నొక్కరుండ
నెక్కడ దెత్తునే హేమకంజములు
కడఁకతో నిచట నొక్కరుఁడు కాపున్న
గడియలోఁ దెచ్చెద కనకపద్మములు
అనఘాత్మ దీని కుపాయ మేమైన 1220
ననువొందఁగా వేగ నానతిమ్మనిన
జలజసంభవసూతి జనపతిఁ జూచి
నలువొందఁ జిఱునవ్వు నవ్వి యి ట్లనియె
ధరణీశ మీ కసాధ్యము లైనపనులు
కరమర్థి సకలలోకములందుఁగలవె! 1225
వనజాక్షి చెంత కావలి యుండునట్టి
ఘనునిఁ జెప్పెదను నాకర్ణింపు మిపుడు
సన్నుతాటోపుఁడు చండవిక్రముఁడు

{ నారదుఁడు ఘటోత్కచుని నందునిచి కమలములఁ దెచ్చుటకుఁ బొమ్మనుట }

వరబాహాబలుఁడు దుర్వారశౌర్యుండు
తరణితేజుఁడు ఘటోత్కచుఁడు నీతనయుఁ 1230
డారాక్షసాధీశు నరయ నిందునిచి
పోరాదె తేరాదె భూరి సత్త్వములు
కమలంబు లన నెంత లోకము లన నెంత
నిమిషమాత్రము పట్టునే నీవు దలఁప
ద్రౌపదీరమణి సంతతపుణ్యశాలి 1235
యోపిక లేక దా నుసుఱుసు రనిన
నాపదల్ సంధిల్లు నవనీతలేశ
యీపువ్వుఁబోఁడికి నీరుకంజములు
గొనివచ్చి మదిలోని కోర్కెలఁ దీర్చు
మనుజేంద్ర నీ వేగుమార్గంబునందు 1240

{ నారదుఁడు భీమునితో నతని కార్యము నందొకమహాత్ముఁడు సాయపడునని తెల్పుట }

ఘనమూర్తుఁ డొకఁడు నీకు సబంధువుఁడు
కనకకంజము లున్న క్రమముఁ దెల్పెడిని

మనమునఁ దగుననుమానము ల్మాని
చను మని దేవతా సంయమిఁ గదలె
అంతట గంధవాహాత్మజుం డధిక 1245

ఘటోత్కచుఁడు భీమునికడకు వచ్చుట

సంతోషచిత్తుఁడై సతిని లాలించి
యమితలోకభయంకరాకారమూర్తి*

---

* అఖిలలోకభయంకరాకారమూర్తి
సుఖపుణ్యకీర్తి భాసురజయస్ఫూర్తి
కమనీయసకల రాక్షసచక్రవర్తి
సముదగ్రశత్రుసంచయసమవర్తి
బలశౌర్యధైర్యప్రభావప్రతాప
పటులోగ్రుఁడఖిలదిక్పాలకద్రిదశ
ప్రకటవిద్యాధరగరుడగంధర్వ
యక్షకిన్నరసిద్ధహారిదశ్చచంద్ర
రాక్షసాధిపనవబ్రహ్మారుద్రాది
లోకచతుర్దశలోకానవరత
భీకరుఁడగుహిడింబీనందనుండు (త)

సముదగ్రశత్రుసంచయసమవర్తి
ఘనబలోద్దండ విక్రమకళాస్ఫూర్తి
తనతనూభవు ఘటోత్కచుఁ దలంచుటయు 1250
దలఁచినయంత సుద్దండప్రచండ
బలశౌర్యనిధి హిడింబానందనుండు
అట్టిట్టు త్రిజగంబు లల్లలనాడఁ
బెట్టుగా ప్రస్థానభేరి వేయించి
గగనచుంబి ప్రచండ గండభేరుండ 1255
ధగధగద్ధగితకేతనధాళధళ్య
నానాయుధోజ్జ్వలనవరత్నఖచిత
భానుతదళచక్రభూరిపటోత్కటి
మహనీయఘంటికామార్తాండసదృశ
బహుళకాంచనకుంభ భాసురప్రకట 1260
పంచాననవ్యాఘ్రభల్లూకశరభ
సంచయభయదోగ్రచర్మసంకలిత
వితతమనోవేగవిధజవనాశ్వ
శతపరిభ్రాజితస్యందనం బెక్కి
మరదముల్ నలుబదియాఱుకోట్లసుర 1265

కరిఘుట లోకకోటిగఢలుకొనంగ
హారులు లెక్కల కెక్కువై పిక్కటిల్లఁ
దరుచుగా బలువీరదానవు ల్గొలువ
తమకంబు బలము నుద్దండంబు చలము
గమకమై పెనఁగొన గడువడి నేఁగి. 1270
తల్లిదండ్రులకు వందనములు చేసి
మెల్లమెల్లన లేచి మిక్కిలి పొగడి
వడముడి వదనంబు వలనొప్పఁ జూచి
కడుమోదమున ఘటోత్కచుఁ డిట్లు పలికె
పనియేమి మాయయ్య! పనియేమి దేవ! 1275
పనియేమి భూపాల! పనియేమి స్వామి!
భోరున నాకొకబుద్ధి మన్నించు
చారణ గరుడఖేచరులఁ జెండుదునో!
హరిహయ వైశ్వానరాంతక నిరుతి
వరుణ వాయు కుబేర వామదేవాది 1280
ఘనదిశాధీశుల కట్టలకఁబట్టి
కొని వత్తునో! భూపకుంజరావళుల
కొట్టుదునో! భూతకోటులనెల్ల

పట్టుదునో! దైత్యపతుల నెంతయును
చట్టలు చీల్తునో సర్వాధినాథు.  12
ధట్టింతునో! చతుర్దశభువనముల
నట్టిట్టు చేతునో! యంబుధు లెల్ల
బెట్టుగా వింతునో! భీకరస్ఫూర్తి
కురుబలంబుల నెల్ల గూల్తునో! లేక
వరబల్మి పట్టి తేవలయునో! యంటను  129
నని బల్కునందను నక్కునం జేర్చి
తనరు వేడుక వృకోదరుం డిట్టు లనియె

ద్రౌపదియొద్ద భీముండు ఘటోత్కచు నునిచి
సౌగంధికముల గరుగుట

ఓవీరశేఖర! యోదైత్యనాథ!
ఓవిశ్వభీకర! యోయింకుమార!
వనవిహారమునకు వచ్చు నవ్వేళ  129
వనజలోచనకు నేవర మిచ్చినాఁడ
బోఁడిమి నిటువంటి భూరిపద్మములు
వేఁడుచు నున్నది వికచాబ్జవదన

ఆడినమాట లే దనిన పాపంబు
పొడి దప్పుట రాజపంతంబుగాదు. 1300
నిన్నుఁ బంపగవచ్చు, నీచేత నౌను;
నన్ను వేడినది యీనాళీకపాణి
యిదిగాక రణమున కరుగుటకంటె
నదనుమానము గాచు టది మిక్కుటంబు
నాసాటివాఁడవు, నాముద్దుపట్టి 1305
వాసికెక్కిన ధైర్యవరశౌర్యనిధివి
అచ్చెరువడి మీర లందఱు బొగడ [1]
తెచ్చెద జాముకు దివ్యసూనములు
కనకాంబుజము గొని కలకంఠి దోడ్క
జననాథుఁ డున్నయాస్థలమున కరుగు 1310
మని దానవాధీశు నక్కునఁ జేర్చి
కనకాంగి నెంతయుఁ గౌఁగిట నలమి
పోయివచ్చెద నని భుజ మప్పళించి

---

1 ఇచ్చట నీవుండు మే నేఁగి వేగఁ
దెచ్చెద జాములో దివ్యసూనములు (త).

వాయువేగంబున నాయుజుఁ డరిగె.
అనిలజుం డరిగిన నాఘటోత్కచుఁడు[1] 1315
మొనసేయ నున్నను మోసం బటంచుఁ
దనబలంబులనెల్లఁ దగ వేలు వేలఁ
గొనఁగొని యష్టదిక్కుల బారు దీర్చి
నలుదిక్కులందు నెంతయు నొచ్చరికల
బొలుపొంద గోపురంబులు బెట్టి రమణి. 1320
నొకపొదరింటిలో నుంచి తా నొక్క
నికటదేశంబున నిలిచి కాపుండె
అంతట బాంచాలి ననిలజుఁ దలఁచి

### ద్రౌపది సంతాపము

ఎంతయుఁ దల యూఁచి యిది చిత్ర మనుచు
మనమునఁ గడు ననుమానంబుఁ బొదమి. 1325
తనలోనె తాను నెంతయుఁ జింత నొంది
జనపతి వల దని చాటిచెప్పినను

---

1. భీముఁ డేఁగిన హిడింబీనందనుండు
నేమరి యుండుట నిది మోస మనుచు (గ).

వినవైతి నే నింత వీఱిఁడి నైతి
వనవిహారం బేల వచ్చితి! వచ్చి
కనకకంజము నేల కాంచితి! గాంచి. 1330

పదరి నే నెందుకు పట్టినపట్టు
వదలక ననిచితి వాయునందనుని!
మించిన నామాట మీఱంగ లేక
వేంచేసె నొంటిగా విపినభూములకు! *
కరమర్థి సౌగంధికము లున్న నెలవు. 1335

లెఱుఁగునో యెఱుఁగడో యేకార్య మగునొ!
ఆసకు సిగ్గులేదాయె! యయ్యయ్యొ!
నా సరివారిలో నగుబాటు గలిగె
వెలయ పెద్దలబుద్ధి వినక నే వచ్చు
ఫలమెల్ల చేఁజేత ఫలియించె నిపుడు. 1340

పతి నంపి యెంత పాపంబు గట్టుకొంటి!
మితిలేని యపకీర్తి మెడఁగట్టుకొంటి!

---

* హెచ్చుగు నాకోర్కె మీరంగ లేక
విచ్చేసె నొంటిగా విపినభూములను (త).

అన విని పాంచాలి యసురేశుమోము
గనుఁగొని గద్గదకంఠయై పలికె
మాయన్న! దైతేయమండలాధీశ!
మీయయ్య నెరయోధ మిక్కిలి నీవు
విలుకాండ్ర మేటివి వీరశేఖరుఁడ 1365
వలఘుతరోగ్రమాయాప్రవీణుఁడవు
అసహాయశూరుండ వని యొఱుంగుదును
పొసఁగ నీశౌర్య మిప్పుడు గానవచ్చె
నేకాకియై భీముఁ డేఁగు నవ్వేళ
ప్రాకట చతురంగబలములఁ గూడి. 1370
నిచ్చట నీ వుండు టిది ధర్మ మగునె!
హెచ్చైన రథికుల నిటఁగాపుఁ బెట్టి
చనరాదె నీవు నీజనకుని వెంట!
చేనవరి వగుచు నిచ్చటను నీ వున్న
దనుజవీరులనైనఁ దగ నంపవలదె! 1375
వనవీథియందు నెవ్వరు లేనిచోట
దిద్ది మీసము దువ్వి దిగ్గన లేచి

వటపత్రశయన శర్వ బ్రహ్మాలకును
వరుస నెమ్మనముల వణఁకు వాటిల్లు. 1395
నరపతిమాత్రుఁడే నను గన్నతండ్రి!
గతి దప్పి వేఱొక కార్యమా నేని
సుతు నన్నుఁ జుల్కఁగాఁ జూడంగ వలదు
బ్రహ్మాండభాండముల్ పగులఁగొట్టుదును
బ్రహ్మరుద్రాదుల బంధించి వైతు. 1400
వాలాయమునను నవనిధానములును
గాలింతు సకలలోకములు భేదింతు
కడి గొందు గులమహాగ్రావసంఘముల
మడియించెదను గ్రహమండలి నెల్ల
భూవరు డెత్తు మద్భుజశక్తి నీవు. 1405
భావించి చూడుము పాంచాలతనయ!
నన్ను నాబల్మి నెంతయు నెఱుంగకను
కన్నతల్లివి గాన కారు లాడితివి
జనని యిందుల కేమి సంతోష మాయె
విను మింక నొకనీతి విన్నవించెదను. 1410
ననఁబోణి యిచ్చట నను నిల్పి చనిరొ

జనపతి యుంచు నచ్చట నుండ కేను
యతని యానతి మీఱి యరిగితి నేని
యతివరో! స్వామి భృత్యన్యాయ మగునె? [1]
మాయయ్య యసహాయమహితశౌర్యుండు. 1[illegible]
మాయయ్య యత్యంతమానధనుండు
దేవప్రసూనము ల్దెచ్చి యిమ్మనుచు
నావీరు నొక్కని యడిగితి వీవు
యతఁడు దాఁ దెచ్చెద నని మమ్ము నెల్ల
చతురోక్తి మెరసి యిచ్చట నిల్పి చనియె 140
నాతని కేసహాయంబుఁ బంచినను
నాతండ్రికిని ప్రతిజ్ఞాభంగ మౌను[2]

---

1 యితరమా స్వామి భృత్యన్యాయ మగునె (ట).

2 అమరేంద్రు గొట్టెద నగ్నిఁ బట్టెదను
శమను ముట్టెదను పుణ్యజనుని మొట్టెదను
వరుణుని తెంచెద వాయు నొంచెదను
నరవాహనుని మహానటు నళించెదను
వాలాయమున సప్తవరనిధానములు

వచ్చును నీమనోవల్లభుఁ డిపుడె
తెచ్చు నీచెంతకు దేవసూనములు 1425
అనుమాన మిక మాను మనిన పాంచాలి
దనుజవీరునిఁ జూచి తలయూచి పలికె

---

గాలింతు సకలలోకములఁ జరింతు
కడిగొందు కులమహాగ్రాహసంఘములు
మడియింతు గ్రహతారమండలి నెల్ల
భూవరుదేవి సమ్మదమున నీవె
భావించి చూడుము పాంచాలితనయ
నన్ను నాఖ్యాతి నెంతయుం నెఱుంగకను
కన్నతల్లివిగాన కారులాడితివి
జనని యిందుల కేమి సంతోషమాయె
విను మింక నొకరీతి విన్నవించెదను
ననుఁ జేరఁ బిలచి యెంతయు గారవించి
కనికరంబున గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి
తనయ భద్రం బని తడయక నేఁగి
యదిగాక నికనొక్క యనుమాన మెదవె
నదియుఁ జెప్పెద విను నంభోజవదన (త).

అన్న సంగరశూర హాసుకుమార
చిన్నన్న నా కిన్ని చెప్ప నేమిటికి
అపజయశకునంబు లయ్యెడి నిపుడు 1430
విపరీతములు పుట్టె వినువీథియందు
మది తల్లడము నొందె మస్కావ దొలఁగె
నిదె చూడు మెడమకన్నిగ గొట్టెడిని
నాపతి నాదాత నాపట్టుఁగొమ్మ
నా పెన్నిధానంబు నాప్రాణవిభుఁడు 1435
నాకూర్చు చెలికాఁడు నాకొంగుపసిఁడి
నాకోర్కె చెల్లించు నాకూర్మిమగఁడు
భీముఁడు రిపురాజభీముఁడు సుగుణ
ధాముఁడు పటుబలోద్దాముఁడు ఘనుఁడు
ఆయుధహీనుఁడై యడలుచు సర్వ 1440
కాయమంతయు నంపగమి గాఁడి వెడలి
పచ్చిగాయంబుల బహుళరక్తములు
విచ్చలవిడిఁ బార వెక్కసపడుచు
పొదరుచు నడరుచు బొబ్బరించుచును
నెదుట నిల్చినలీల లెసఁగెడి నిపుడు 1445

అని యని వగచి హా యని విలపించు
ననఁబోణి గాంచి దానవనాథుఁ డనియె
వెరవకు మాతల్లి! వెరవకుమమ్మ !
వెరపు నీ కేటికి వికచాబ్జవదన !
రహిందూరదృష్టి దూరశ్రవణములు
మహితమాయోపాయధర్మకర్మములు 1450
వరుస ననాగతవర్తమానములు
కరతలామలకముల్ కలకిఁక నాకు
న న్నెఱుంగక యుండ ననుఁగన్నతండ్రి
కిన్ని బాధకములు ఏటికి వచ్చు ?
నపజయశమనంబు లయినవి యెల్ల 1455
చపలాక్షి మనకు విజయ మని తలఁపు

ఘటోత్కచుని సాంత్వనము

ఇంతుల కెడమక న్నిగ మొత్తినను
నెంతయు శుభమగు నిందుబింబాస్య
కొత్తగాయంబులఁ గుందుచు విభుఁడు[1]

---

1 కొత్తగాయములతో కొతుకుచు విభుఁడు
హత్తి నిల్చినయట్లు లయినది వినుము

హత్తి నిల్చిన యట్టు లైనది వినుము 1460
కలితమౌ సౌగంధిక ప్రసూనములు
వెలది వేగమె దెచ్చి వేడ్క నీ కిచ్చు
నమ్ము నావచనముల్ నాళీకపాణి
సమ్మతి నొందుము చలియింపవలదు
సతికి నెంతయు మనోజయము గల్గినను 1465
పతికి నంతటిబాహుబలశక్తి గలదు
తిరమొంద నీదుపాతివ్రత్యమహిమ
పరమదీర్ఘాయువు పాండుసూనులకు

---

*యదువంశకలిత క్షీరాబ్ధిచంద్రుండు*
*పరమదయాళుండు భక్తవత్సలుఁడు*
*కరిరాజవరదుండు కపటనాటకుఁడు*
*భవరోగవైద్యుఁ డాపద్బాంధవుండు*
*రవికోటితేజుఁ డార్తశరణ్యమూర్తి*
*మన్మథజనకుండు మదవిభేదనుఁడు*
*చిన్మయుం డాదిలక్ష్మీనాయకుండు*
*కరుణతో మనపాల గలుగు నన్నాళ్లు*
*సరసిజానన యుపజయ మేల కల్గు (ర).*

వని యొక్కరథముపై యబ్జాక్షు నునిచి
కనకపంకేజంబు గైకొని వేగ 1470
వలనొప్ప బదరికావనమార్గమునను
బలములతోఁడ నిబ్బరమునఁ జనియె

సూర్యాస్తమయవర్ణనము

తను ప్రయోగింప నుద్దండత వెడలి
దనుజవీరులనెల్లఁ దగఁ దునుమాడి
ఘనరక్తయుక్తమై గ్రక్కున మరలి[1] 1475
చనువున పశ్చిమజలరాశి యనెడి
చెలువంపు టొరలోనఁ జేరు కంజాక్షు
సలలితం బగుదివ్యచక్ర మనంగ
నరయ మహాసటుం డనువీరముష్టి
దురుసునఁ బరువళ్లు ద్రొక్కనవ్వేళ 1480
నలరుచు సమయకంజాక్షువాయించు*

1 ఘనతరరత్నసంకలితమై మరలి (త)

* ప్రతిలేని నాభుజాబలశక్తిపాండు
సుతులకు వర్ణింగి జోడుమృగాక్షి

పలుమఱు నిటువంటిపనులకై నీవు
వలవదు విలపింప వనజాతపాణి
యని కోటిచంద్రమార్తాండసంకాశ
ఘనతరమాణిక్యఖచితసంకలిత
తనదివ్యమకుటంబు ధవళాక్షిపాద
వనజాతములు సోఁక వరభయభక్తిఁ
బ్రణమిల్లి లేచినఁ బటుబలాధిపుని
రణరంగవిజయుని రాక్షసాధిపుని
కనుఁగొని పాంచాలి కవదిశిరాణి
యనువొంద దీవించి యతని కిట్లనియె
దనుజేంద్ర నినువంటితనయుఁ డుండఁగను
మనసులో నా కనుమాన మేటికిని
యదుకులస్వామి కటాక్షంబు గలుగ
పదపడి మఱికొంతభయము నాకేల
పంకజంబులకు నే పతి నంపినట్టి
యపకీర్తి దక్కగ నెంతయుఁగాని?
విపరీతములకు నే వెరువలేదన్న
యని పల్కి తనమదియడలు వారించి
కనకాంగినిశ్చలగతి యున్నయంత
తను బ్రయోగింప నుద్దండత వెదలి

చెలువైనబంగారు జేగంట యనఁగ
వినుతారుణప్రభావితతవైఖరులఁ
దనరు పంకజబాంధవుఁ డస్తమించె?
గరిమెతో ఫణిరాజకన్యకల్వేగ 1485
గురుతైన బుఱ్ఱట క్రోవులు బూని
పరపైన యస్తాద్రిపై నెక్కి నిక్కి
సురకామినులమీఁద చూడ్కులు నిలిపి
నెయ్యముల్ మనమున నివ్వటిల్లంగ 1490
నురగకన్యలమీఁద నొగి జలరేగి
కరమర్థి దేవతాకములలోచనలు
మురియుచు రతనంపు మొరిటెల ముంచి
గురుతుగా నించినకుంకుమో యనఁగ
సడలక దట్టమై సాంధ్యరాగంబు 1495
పడమటిది క్కెల్ల ప్రభవించి మించె
వెడవిల్తుఁ డెంతయు వేట్క రంజిల్ల
వడి పాంథులా సురవర్గంబుమీఁద
విలసిల్లు రసదాళి విల్లెక్కువెట్టి
తొలఁగక నేసిన తుది మిన్నుదాకి 1500

మొనలు చిక్కఁకయున్న మొల్లబాణంబు
లనఁ బొల్చె తారక లాకాశవీథి
రమణీయగిరిగహ్వరంబులు వెడలి
గమకమై చనుభల్లుకంబు లనంగ
గరుడవాహనుమీఁదఁ గదుదండు వెడలి 15
పరతెంచురాక్షసబలము లనంగ[1]
ననిలునిఁ దార్కొన నధికవేగమున
కనలుచు చను ఘనాఘనము లనంగ
తనర నెల్లడల కానగ్గై నిండి?
కనుపించు హరిదేవకాంతు లనంగ 1
భూనభోభాగముల్ పూర్ణమై కవిసి[2]
కానఁగానఁగ మించె కటికిచీఁకటులు

## చంద్రోదయవర్ణనము

ఆసమయంబున యామినీరమణి
భాసిల్లు హరిపదపద్మావధూటి

---

1 అలఘుపంకజభవాండకరండభూరి
కలితబంధురదివ్యకస్తూరి యనఁగ

2 భూనభోభాగసంపూర్ణమై కదిసి

కరుదు మీఱఁగ మంగళార్తులు పెట్టి 1515
పరఁగ నెత్తిన వెండిపళ్లెర మనఁగ
కలితమౌ పదియారుకళలఁ జెన్నొంది
తొలిదిక్కు ననుదోఁచె తుహినకరుండు
అలరుచు చందురుం డనుమాంత్రికుండు
మలయుచు దిశ లన్ని మంత్రించి కట్టి 1520
తగ నంధకారభూతంబుల దరిమి
పొగడొందఁ జల్లు విభూతి యనంగ
పొసఁగ నభోలక్ష్మి భూకాంతమీఁద
గసటుదీరగ నించు కర్పూర మనఁగ
మునుల నెల్లను దేవమునులఁ గావించి 1525
వనధు లెల్లను క్షీరవారిధుల్ జేసి
భూజాతములఁ గల్ప భూజము ల్సేసి
రాజవర్యుల బలరాములఁ జేసి
నదుల నెల్లను దేవనదులు గావించి
వదలక సతులవా గ్వనితలఁ జేసి 1530
యలరుపతుల రాజహంసలఁ జేసి
కలమృగంబులను సింగములఁ గావించి

కడిమి విద్యలఁజూపు గారడసాని[1]
వడువున చంద్రికావైఖరు ల్వెలసె[2]

---

1 (1) కడిమి విద్యలు జూపుఁ గారడీగాని
(2) కడిమి విద్యల చూపుగారడసాని
(3) కడిమివిద్యలు జూపు గారడసాని

2 వరుస నారదమునివరులెల్ల నవ్వ
శరనిధులటుసుధాజలరాశిఁ గరల
తరుచైన యఖిలభూతములు వసింప
లరిధరాజములు కల్పకము నెగ్గింప
కరమర్థి నదులు గంగను వరిగింప
తరుణులెల్లను శారదను బొల్పుసేయ
ఖగములు హంసల గదుముచు దిరుగ
మృగములు సింగంబుమీఁద దండెత్త
కమలాక్షి కమలాంక కమలసంభవులు
మమతతో సతులనేమరకుండఁ జేయ
కడు దాసియా మహాగారడసాని
వడువున చంద్రికావైఖరుల్ వెలసె

## మలయమారుతవర్ణనము

మలయాద్రి చెంత నెమ్మది నుద్భవించి 1535
పొలుపొందు మల్లెపూఁబొత్తుల బొరలి
యొనరు పూఁదేనియ యుగ్గున బెరిగి
పనుపడ నునుమంచు బాల నీడేరి
వరుస నానాసూనవాసన లాని
శరజాకరముల ముచ్చట నోలలాడి[1] 1540
కపురంపుఁదిన్నెలఁ గడువినోదించి
విపులమా చందనవృక్షంబు లెక్కి
యొగి కల్పలతలతో నుయ్యాల లూగి
జిగిమించు తేటితేజీ నెక్కి నిక్కి[2]
పంచధారాగతు లుపన్యసింపుచును 1545
నంచల నంచల నటు దువాళించి
చెలఁగుచు నాకవీధి చేవాగెసడలి
తొలఁగనీక కుదించి దుమికించుకొనుచు

---

1 సరసులయందు ముచ్చట నోలలాడి

2 జిగిమించు లేడి తేజీనెక్కి నిక్కి

వలనొప్పు మేటిరేవంతునిలీల[1]
మలయుచుఁ జనుదెంచె మలయానిలుండు. 15
అంతకుమున్నె యయ్యనిలనందనుఁడు
సంతోషచిత్తుఁడై చన చన నెదుట
పాఠీనకర్కట బహుజలగ్రాహ

## కళావదీవర్ణనము

కాఠీన కర్పర కమఠాళిఘోర
వారిభేక భేకీ మహాధ్వనీఘోర 15
కరిభీమ తిమితిమింగిలారావ
కోలాహలంబునై కొమరొందుదాని
హాళిదరు ల్మించి యరుదెంచుదాని

---

1 యంతట నంతట నాగి నిల్చుచును
పొంతట చౌపుటంబులు త్రేడెములును
నంచల నంచల నటు దువాళించి
చెలఁగుచు నొక వీథి చేవాగె నడలి
తొలఁగక కిసరించి దుమికించుకొనుచు
వలనొప్పు మేటిరే వంతునిలీల

(క

వలగొనియున్న శైవాలజాలంబు
లలితమౌ వేణీవిలాసంబు గాఁగ 1560
పొలుపొందు వికసితపుండరీకంబు
కలితమౌ వదనవికాసంబు గాఁగ
కలికి నిగ్గుల నల్లకలువలసిరులు
తళుకులు గుల్కు నేత్రంబులు గాఁగ
వలనొప్ప రంజిల్లు వలమురిగరిమ 1565
కళల రాజిల్లెడు కంఠంబు గాఁగ
నలువొందు మృదుల మృణాలవైఖరులు
బలురమ్యమై యొప్పు బాహువు ల్గాఁగ
నరుదుగా వికసించు నరుణాంబుజములు
గరిమశోభిల్లెడు కరములు గాఁగ 1570
కర మొప్ప నలరు పంకజకోరకములు
సరసంపుబిగి వాడిచన్నులు గాఁగ
నందమై మెలగెడి యావర్తసరణి
పొందుగా నలరారు పొక్కిలి గాఁగ
నారూఢసలిలవేదండతుండములు 1575
తోరంపు మెరుగు పెందొడలును గాఁగ

నంచితం బగుచున్న యాంకచ్ఛపములు
మించులు దులికించు మీఁగాళ్లు గాఁగ
నలరుచు వెలయు ముక్తాబ్జపత్రములు
పలుచని కోమలపదములు గాఁగ

ననయంబు విహరించుహంససంగతులు
ననువుమీరిన మందయానంబు గాఁగ
పవనవిధూతపుష్పపరాగమహిమ
రవణమౌ చిత్రాంబరంబులు గాఁగ
పరఁగు కళానదీప్రాంతంబుఁ జేరి

వెరవున సంధ్యాదివిధు లాచరించి
పంతంబు నుదుట నిబ్బరము నగ్గలము
నంతకు నంతకు నధికంబు గాఁగ[1]

---

1 అంతకు మున్నె యయ్యనిలనందనుఁడు
కొంతద వ్వరుదెంచి కొల నటు గాంచి
స్నానంబు గావించి సంధ్యాదివిధులు
భూనుతంబుగ సల్పిఁ బోరున కదలి
పంతంబు నుదుట నిబ్బరము నగ్గలము

భీమునిప్రయాణము; అతఁడుశంఖమును బూరించుట.

మలయుచు చనుచున్న మార్గంబునందు
పులులతోఁ గలఁబట్టి పులులను మోఁది 1590
కరితుండములఁ బూని కరులను జదిపి
హరివాలము లమర్చి హరుల మర్దించి
శరభసంఘంబుల చక్కఁగావించి
కరకరి బలుపన్నగంబుల మోఁది
ననువొందఁగా నట్టహాసంబు చేసి 1595
ఘనశైలజాలము ల్గంతులుగొనుచు
పొసఁగ మహానదు ల్దాంగి లంఘించి
మసలక గహనము ల్మరి చొకళించి
తనపాదయుగళంబు తాకినతరుల
కనగ నిట్టటు చేఁప కట్టుగాఁ బడఁగ 1600
చరణఘాతల గండశైలముల్ పెకలి
కరమర్థి యెగసి యాకాశంబు గప్ప

నంత కంతకు ఘూం తి యధికమై మించి
తనధైర్యలక్ష్మి యెంతయుఁ దోడునడువ

వరవేగసంఘాతవాతజాలములు
సొరిగి జంతువులెల్ల సుడిగొని తిరుగ
యలవైనతేయుని యనువు జె న్నొంది 1605
ఎలమి మహోద్ధతి నేఁగుచు నుండి
గరుడకిన్నరయక్షగణము భేదిల్ల
గిరులెల్ల సురుల మిక్కిలి దిక్కు లవియ
ధారుణి గంపింపఁ దరువులు పెకల
ఘోరున శంఖంబుఁ బూరించుటయును 1610
పిడుగుమ్రోఁతలఁబోలు బెడిదంపురవము

ఆంజనేయుఁడాశంఖారావమును విని లేచుట

కడువడి విని లేచి కపినాయకుండు
వడముడి శంఖారవం బిది యనుచు
తడయక యంత సుదగ్రతఁ జూచి[1]
యతఁడు వచ్చినకార్య మంతయు నెఱిఁగి 1615
అతనిభుజాబలం బతనిశౌర్యంబు
దెలిసి పద్మము లున్న తెఱఁగెల్లఁ జెప్ప

1 తడయక సెంతయుఁదా విచారించి

వలయు నటంచు జవంబున లేచి
మనుజేశుఁ డేతెంచుమార్గంబునందు
కొనర కన్నులు మూసి యొంగి నోరు దెరచి 1620
పలుకులు నఱచుచు బయలు బ్రాకుచును
తలవడ కింపుచు ధగ్గుచు నిలిచి[1]
పలువిడి రొజుచుఁ బడియుండె నచట

---

1 అతిరయంబున జను నాభిమసేను
గలియొల్ల మున్నె తా గన్నట్టె తెలిసి
యంతరంగంబున నాంజనేయుండు
గొంత చింతించి వేగురుముదికోతి
తనువు గైకొనివచ్చి తగమ్రానికింద
నొనర కన్నులుమూసి నొగి నోరు దెరచి
తెరువుకడ్డముబడి తెలివి లేనటుల
కరచరణాదులు కదలింపలేక
నుసు రుసు రనెడి నిట్టూర్పులతోడ
బుసపెట్టుచును బోరుగొండచందమున
మూల్గుచు బలుకుచు ముడుగుచుఁ బొరలి
నీల్గుచు వడకుచు నెరయ నున్నంత. (త)

అలఘుబలోద్దండుఁ డాంజనేయుండు
ఆపాండుసుతుఁ డడ్డమాఁగయు లేక[1]

### భీముఁడు హనుమంతునిఁ జూచుట

నేపున జనుదేర నెలమి గట్టెదుర
నడలుచు వణఁకుచు నరచుచు నిట్లు
బడియున్న వనచరు భావించి చూచి
కరుణాకటాక్షుమాఘునునిపై నునిచి
పారిపారి మేనెల్ల పుణికి చూచుచును 1630
వెరవకు మని చీరి వెన్ను చే జరచి
యిరుమైల నడలించి యిట్లని పలికె[2]

### భీమహనుమంతుల సంవాదము

అనఘాత్మ! నీ వెవ్వరయ్య! యిచ్చోట
కనుమూసి పడియున్న కారణం బేమి

---

1 (a) ఆపాండుసుతు డడ్డ మాగెయుం లేక (ప)
(b) ఆపాండుసుతు డడ్డమాజ్ఞ యుంలేక (త)
2 (a) యిరవంద నదలించి య ట్లని పలికె (క)
(b) యిరువందఁగా హెచ్చరించి యిట్లనియె (త)

మేదినీరుహాచర్య! మిక్కిలి నీకు 1635
ఈదైన్య మీభయం బెటువలెఁ గల్గె?
అదిగాక శతవృద్ధవైతి పీ వింక
కొదువ వస్తువు లేమికోరెద విప్రుడు
పనిఁబూని నేవచ్చు పయనంబు మాని
గొనకొని నిను గనుంగొనినది మొదలు 1640
మాయన్న నీమీఁద మనుత పుట్టెడిని[1]
యీయున్న విధము నీవింతయుఁ దెలుపు
మని సారె సారెకు యదలించి పిలువ
వినియును నొక్కింత వినని చందమునఁ
గనియును లేశంబు గనని మార్గమున 1645
తనుదానె ప్రక్కలు తలగిరికొనుచు
విప్పగా రెప్పలు విప్పించి నవ్వ
తప్పి వ్రాలినబొమ ల్ద్రాల్చి నిక్కించి
పెదవులు నట్టిట్టు బెట్టుగాఁ జెదరి
పదరించిదులు ద్రొక్కి పం డ్లూగులాడ 1650

1 మాయన్న నీమీద మర్లుబుట్టెడిని (వ; ట.)

నలసతచేఁ జూచి యలుకుచు కీఁచు[1]
పలుకుల నిట్లనుపాండునందనుని
నీ వెవ్వరో యయ్య నీకుఁ బే రేమి?
యేవస్తువులకు నీ వేఁగుదెంచితివి?
గరిమెతో నీమోము గనుఁగొన్నయపుడె 165
సొరిది నాతమ్మునిఁ జూచిన ట్లాయె;
నింతింత యని మది నెన్నంగరాని
సంతోష మందితి జనపాలచంద్ర!
బడలి కెల్లను దీరె భయములు దారె
నడలు దైన్యము మాసె నాఁకలి పాసె 166
తత్తరంబు దొలంగె తాల్మి చెలంగె
చిత్తంబు జిగురించె చెలువంబు మించె
తపమెల్ల ఫలియించె ధన్యుండనైతి
నృపచంద్ర! దైవంబు నినుఁ జూపె మాకు
మేదినీవల్లభ మీస్వరూపంబు 166
నాదిగర్భేశ్వరునట్లు గన్పించె

1 కీలు, పలుకుల నిట్లను (ట. త.)

వలనొప్పఁగా చక్రవర్తిచిహ్నములు
తొలఁగక నీయందు దోఁచుచున్నవియు
నిన్నియుఁ గల్గి నీ వెవ్వరు లేక
ని న్నగపంక్తుల నీయరణ్యముల 1670
జడియక యీనిశీసమయంబునందు
కడు నొంటిగాఁ జన కారణం బేమి?
నీరాజసంబును నినుఁ జూడ లేక
యీరీతి బనుపువా రెవ్వరు నిన్ను[1]
మనుజాధినాయక మముబోంట్లకైన 1675
నిను గనుఁగొన్నను నెనరు బట్టెడిని
తెలియంగ నిది దొడ్డదేవతాభూమి
మలసి చూచిన నీవు మానవరూపు
చండపంచానన శరభశార్దూల
గండభేరుండము ల్గల వెల్లయెడల; 1680

---

1 నిత్తరి యొకవ్వా ర విన్నవిందను
చిత్తావధానివై చెవియొగ్గి వినుము
... ... ... ... ...
ధారుణి నిర్దయదాక్షిణ్య లగుచు (శ)

నదిగాక యక్షవిద్యాధరామరులు
కొదకక నినుఁ గన్నఁ గొట్టి చంపెదరు;
చనవల దోయన్న చన దనరాదు
ఘనుఁడవు నీచేతఁ గానిది లేదు
నీవు వచ్చినపని నిక్కంబు పలుకు 168
నావిధం బెఱిఁగింతు నరనాథ యనిన
తనజనకుని పేరు తనయన్న పేరు
తనపేరు తనసహోదరుల పేరులును
వినయమార్గంబున వేర్వేరఁ దెలిపి
వనితయుఁ దానును వనికి వచ్చుటయు 169
కనకకంజము గాంచి కాంత వేడుటయు
ననువొందఁ దెచ్చెద నని పల్కి చనుట
పూసగ్రుచ్చినయట్లు పొసఁగఁ దెల్పుటయు
వేసాలవానరవీరుఁ డి ట్లనియె
ధరణీశ; పాండునందనులకుఁగాక 1695
నొరులకుఁ దరమె యి ట్లొంటిగా నేగ
జననాథ మ్మా కతిసంతోషమాయె
కనకాబ్జములఁజూడఁ గర పెద వెనుక

పసుపడ నే నిందు బడియున్న తెఱంగు
వినుపింతు విన వన్న విశదంబుగాను[1] 1700

నీవిధంబునను నే నిబిడాటవులకు
కావరంబున నొంటిగాఁ జనుదెంచి
మిన్నకైనఫలములు నొక్కుచు వేడ్క
వనమెల్ల వెదకుచు వచ్చి యామ్రాను
పరికించి యిందొక్కఫలము వీక్షించి 1705

యరుదైన ఫల మహాట యాస వాటిల్లి
యరుగక యీతరు వెక్కఁగా బోయి
పరబల్మి చెడిపోయి వ్రాలి యున్నాడ
ముదిమి పైకొని నేత్రములు చూపు దరిగె
పదపడి యీపండు పడినభక్షింతు 1710

ననిన శతాబ్దంబు లయ్యె నీవరకు
మనుజేశ యీమహామాయాఫలంబు
పడినది లేదాయె ఫలముపై నాస

1 పదరుచు నే నిందుఁబడియున్న తెఱంగు
విదితంబుగా నేను విన్నవించెదను (ట; ప)

విడిచిపోయెదనన్న వెసకాళ్లు రావు
కోరుచుండఁగఁ బిచ్చుగుంటపై ఘనము 171
జారుభాగీరథిఁ జనుదెంచు లీల[1]
వచ్చితి వీవు నావయసు నిన్నడుగ
వచ్చంబులేని సత్వంబు నిన్నడుగ
మానవాధీశ! యొక్కటే పండు
యీామ్రాన నున్నది యీాతీంపు మయ్య 172
అనఘాత్మ! పాండవు లార్తరక్షకులు
ననుచుఁ బల్కఁగ విని యడిగెద నిన్ను
యీాపండు సాధించి యిచ్చితివేని
యేపనులైన నయ్యెడిని నీచేత

1 (a) కోరుచుండఁగ పిచ్చుగుంటుయంగమున
చారుభాగీరథి చనుదెంచులీల
తలఁప శక్యముగాని దారిద్రుసకును
నలువొంద పెన్నిధానం బబ్బినటుల
నిచ్చలో నాడబోయినతీర్థ మెదురు
వచ్చి నిల్చినమాడ్కి వచ్చితి నీవు
(b) కోరుచుండగ పిచ్చుకుంటపై వేగ.

ధీరత నాకోర్కె దీర్చకయున్న 1725
నీరజంబులఁ దేను నీకు శక్యంబె!
అంటక ముట్టక నామహాఫలము
గెంటించి నను బ్రోచి కీర్తి వహించు
తమకించి వేవేగ తరు వెక్క వలదు
విమలాత్మ ననువలె వృద్ధ వయ్యెదవు 1730
ఆఁకలి దీర్చిన యాపుణ్యనిధిని
శ్రీకాంతున కెన సేయంగవచ్చు;
నని సన్నుతించిన నయ్యగచరాధిపుని
కనుఁగొని యర్జునాగ్రజుఁ డిట్లు పలికె
ఇది యెంత పని వానరేంద్ర! యీమాయ 1735
గదలించి ఫల మిత్తు ఘనశక్తి మెరసి
మెప్పుగాఁ దలుపులు మ్రింగువానికిని
యప్పళా లననెంత యని విజృంభించి
విల్లెక్కువెట్టి యవ్వీరశేఖరుఁడు
భల్ల మొక్కటిఁ బూని పండు నే యుటయు1740
నది బీరువోయిన నైదంబకములు
గదియించి వేసిన కడల కేఁగుటయు

పదియు నిరువది ముప్పది నారసములు
పొదివి యేసిన తప్పిపోవుటఁ జూచి
విరివిగా నూరులు వేలు లక్షలును 1745
గురుతరాస్త్రము లేయ గురి తాఁకకున్న
పోలించి కోటు లర్బుదములు మేటి
వాలమ్ము లేసిన వ్యర్థమై చనిన
నచ్చెరువును గోప మధికమై వెలయ*
విచ్చలవిడి పండు వీక్షించి చూచి 1750
ఆయెడ పొదినున్న యమ్ము లన్నియును
పోయిన బాండుభూభుజసూనుఁ డలిగి
కరవాల ముంకించి గద్దించి వేయ
బెర బెర చని యది బెళికిపోవుటయు
తరలక కరముల ధనువు సంధించి 1755

1 నూరు నిన్నూరు మున్నూరు నన్నూరు
ఘోరాశుగము లేయ గురిదాకకున్న
వేలు లక్షలు కోట్లు వెస నర్బుదములు
వాలంబు లేసిన వ్యర్థమై చనిన
నచ్చెరువును గోప మధికమై చెలఁగ. (త)

చరణంబు లూఁది భూస్థలము ఘట్టించి
కనలి మింటను గొట్టి గమకించి ప్రేయ
మునుపటిపాడవున మురియుచు నుండ
నెంతయు వెరగంది యిది చిత్ర మనుచుఁ
చింతించు నరనాథ శేఖరుఁ గాంచి 1760
యార్ణవగంభీరుఁ డాంజనేయుండు
కర్ణకఠోరంబుగాఁగ ని ట్లనియె;
నొకపండుకోసమై యూరక నీవు
ప్రకటించి పడరానిపాట్లెల్లఁ బడితి
వటదుర్ఘటంబైన హాటకాబ్జంబు 1765
లెటువలెఁ దెచ్చిరో యెఱుఁగంగరాదు !
ఆతతప్రాభ్ధి ము న్నాడినయట్టు*
చేతఁ జూపిన వీర శేఖరుఁ డంద్రు
కడప దాఁటగ లేవు కదువడి మీరి
జడధులెల్లను దాఁటి చనఁ దలంచెదవు ! 1770
తెగి కూటిలో రాయి తీయఁగా నోప

---

*1 అతీతప్రాభ్ధి ము న్నాడినమాట. (ట)
2 అతతప్రాభ్ధి ము న్నాడినయంత. (ప)

వెగయుచు సంగడా లెత్తబోయెదవు![1]
దగదొట్టి మేనెల్ల దల్లడమొందె
సొగపణంగెను మోము సొబగెల్లఁ దరిగె[2]
పొంగు నొయ్యారంబు పొంగెల్ల నుడిగె 1775
పొగడ నొప్పెడుబాణములు మాయ మాయె
మగతనం బెడలె జృంభణము వొలంగె
నగుబాటు బ్రతుకాయె నరనాథ యింక
యూకించి యూకించి యసురుసు రనఁగ
నీ కేల యీపను ల్నీచేతఁ గాదు 1780
అచ్చంపుమగలచే నగుసట్టిపనులు
పిచ్చుగుం టెక్కడ! పేరెంబు లెందు!
కూడుగూరలు పెద్దకుంభముల్ మ్రింగి
వాడియా తోడేలివలె డొక్కఁ బెంచి

---

1 (a) తెగి కూటిలోని రాయి తీయఁగా లేవు
ఎగరుచు జంగరా కెత్తబూనెదవు. (మ)
(b తెగి కూటిలోని రాయి తీయఁగా నోప
వెగయుచు జంగరా కెత్తబూనెదవు. (త)

2 సుగు లడంగెను మోము సొబగెల్లఁ దరిగె. (ట)

మేన కండలు బెంచి మించి ముదించి 1785

గ్రానిక గడిపోతు పోల్కి నుండఁగను
ఎన్ను నే నెరనమ్మి నెమ్మితో వేఁడు
కొన్నది నావల్ల కొదువ లెంత్రైన*
ఎనుపోతు గాంచి మత్తేభం బటంచు
చనుపొందఁగా భృంగమాశించినట్లు 1790

వాసికెక్కిన మగవాఁడవే యనుచు
ఆసింప నాశ నిరాశఁ జేసితివి
పంద నీ దేయూరు! పద్మ మేయూరు!
ఇందేల వచ్చితి వేఁగు వేవేగ!
అన విని కోపించి యాపాండుసుతుఁడు 1795

వనచరాధీశ్వరుఁవదనంబుఁ గాంచి
నినుఁ జూడు, ననుఁ జూడు నీ వెంతవాఁడ
వనరానిమాట లి ట్లాడ నేమిటికి?
నాపేరు చెప్పిన నను గనుంగొనిన
నేపారలోకంబు నిట్టటుగావె 1800

---

* కొన్నది నావల్ల కొదువ లెంకయును. (త)

పండన నెంత! నీపని యన నెంత!
ఖండింతు దండింతు గదగొని యిపుడె
అడరంగ నాయుపాయంబు లన్నియును
నుడిగియు, నోరేల యుడుగకపోయె?
చెలరేగి యీకోతి చేష్టలు సేయ 1805
నలుక పుట్టదె యెంత యోర్పరికైన
నవలక్షణపుకోతియై బంగి మ్రింగి
శివ మెత్తి వెంట వృశ్చికము సంధించి
పెనుబాము బంధించి పిడికిళ్లఁ జిక్కి
యనలంబు ద్రొక్కి దయ్యము లూదినపుడు 181
ఏగుణంబులచేత నెసఁగుచు నుండు
నాగుణంబులు గాననయ్యె నీయందు
వానరాధీశ! నీవంశ మిట్టిదియ;
యేనాట యెదురు ద న్నెఱుఁగక నీవు
కొసవెట్టి బలుగొంటెకూబ జంకెనలు* 1815
వసుధపై మీస్వభావంబులెగావె!
కలనైన మిమ్ములఁ గనుఁగొన్న హాని

* కొసవెట్టి పలుగొంటె గోల ఝుంకెనలు. (త)

పొలుపొంద నటువంటిపుణ్యులు మీరు
మదమత్తుఁడవు నీవు మర్కటాధముఁడ!
ఇదిగో యల్పస్నేహ మింతకు వచ్చె! 1820
పొగరుకూతల గూసి పొంగితి విపుడు!
తెగి నిన్ను మోదిన దిక్కెవ్వ రిందు?
వానరుఁడై యుంట వార్ధిక్య మౌట
నానాతరులయాకు నములి యాపసరు
తలకెక్క యుండుట తడవడి నుంచి 1825
యలసి నిరాహారివై యుంట నిన్ను
యెగ్గు లెన్నఁగ చెల్ల దిక నొక్కఁడైన
నుగ్గునూచంబుగా నులిమిపోవైతు;
నావిని పాండునందనుని వీక్షించి
యావానరాధీశుఁ డనియె నెంతయును; 1830
ఓరి మానవ! యింత యుద్దండ మేల?
యూరక యిటుపడి యున్నా నటంచుఁ
గొనకొని యిటువంటికూతలు గూయఁ
జనునేర ! నావంటి సాహసాంకునకు
ముదిమి వాటిల నెంత మోసంబువచ్చె? 1835

తుదిమొద లెఱుఁగక తూలనాడెదవు!
మునుపు నే నీప్రాయమునఁ జేసినట్టి
పను లెల్ల శ్రీరామచంద్రుఁడే యెఱుఁగు;
నలవడ నాదిత్యు లైన మ్రింగుదును
నలఘుశక్తిపయోధు లైన దాఁటుదును 1840
పెనుమహీజము లైన పెల్లగించుదును
ననువంద బలుగిరు లైన నెత్తుదును
ఈసున నిపు డైన నేమి యింకొక్క
దాసరితోపాటు తలపడగలను
అచ్చుగాముకు పచ్చలారవు బిరుదు* 1845
పిచ్చుకతో సరి బెనఁగఁ జూచెదవు
చెనకగూడనివారి చెనకి యావెనుక
తినుక నేటికి లేనిధీమసం బేల
మగఁటిమి గలిగిన మగవాఁడ వైన
తెగువతో నాపండు దెచ్చి నాకిమ్ము; 1850
గరిమ నీపని చేత గాకుండెనేని

* 1 అచ్చుగాముకు పచ్చలారవు పనులు. (ట)
2 అచ్చుకతో భేరి నదలించవచ్చు. (మ)

దొరవలె వచ్చిన ద్రోవనే జనుము;
అనిన సత్యుగ్రుఁడై యాపాండు రాజ
తనయుఁ డిట్లనిపల్కెఁ దరుచరేశ్వరుని
వనచరాధమ! ముదివాఁడవై యున్న 1855
ఘన మెఱుంగక పెక్కుగారు లాడెదవు
ముందె వానరుఁడవు, ముదిమికిఁ దోడు
కుందేటివెఱ్ఱి నెక్కొనె మేలు మేలు!
ములుచవానరపేదముండకోపంబు
తిలకింప పెదవులతీటమాత్రంబె* 1860
పాటించి నోటికి బగిసికిఁ దగిన[1]
మాటలాడెద వెంత మడియఁడ వీవు[2]
వరుసఁగూర్చుండి లేవగ లేవు గాని

---

* దీనికితర్వాత నొకప్రతిలోఁ నీపంక్తులుకలవు.
కడుబలశౌర్యముల్ గలవు నీయందు
వెడగ నీమోముఁ జూడఁగఁగానవచ్చు.

1 పాటించి నోటికి బరిపాటిదగిన (త)

2 మాటలాడవు యెంత మడియవు నీవు (ప)

పరువడి పేరము ల్బార బోయెదవు
విదిత మెఱుంగవు వెఱ్ఱిమర్కటము 1865
వదరిన పండ్లూడవై చెద నిపుడు
నీ వనఁగా నెంత! నీ పని యెంత!
దేవేంద్రముఖ్యుల తృణముగాఁ జూతు
పొలుపొందఁగా నిన్నుఁ బుట్టించినట్టి
యలికలోచనునైన నదలించగలను 1870
బిక్క పగ్గెల నింక ప్రేలితివేని
చిక్కించుకొని సిగ్గు చెరచక విడువ
తిరమొంద నన్నుఁ బ్రార్థించి వేడినను
నెరయ నాఫల మిత్తు నీయాశదీర్త
నరసురయక్ష కిన్నరసిద్ధసాధ్య 1875
వరు లడ్డమై యున్న వనజము ల్దెత్తు
ననుఁ జూడు మని సింహనాదంబు చేసి
తనరు దక్షిణభుజాదండంబునందు
మలసి మేదోమాంసము స్తిష్కరక్త
కలితమై చెలువొందు గద ధరియించి 1880
పరువడి సూటిగా పందు వీక్షించి

వరబాహుశక్తిచే వడిగ వైచుటయు;
అది మహారయమున నటు బర తెంచి
పరువడి ఫలము నిబ్బరముగ దావి
బెదరక బంగారు చెండుకై వడిని 1885
గదతోడ నెగసి యాకాశమార్గమున
నటియింపుచును యోజనం బరుదెంచి
యటుబోకనిటు రాక నంతట నిలిచి
భానువై ఖరినిస్వర్భానునిలీల
భూనుత ప్రభలచేఁ బొలుపొందుచున్న 1890
ఫలవిలాసమును నా ప్రతిభ వీక్షించి
పలుమరు చింతించి ప్రౌఢి చాలించి
మదిలోన డోలాయమానుఁడై యంత
యిది యేమి మాయయో! యీభూమితీరో ![1]
తెలియరా దని తనదెసఁ జూచుచున్న 1895
బలశాలిఁ గనుగొని పలికె వానరుఁడు
ఓహోహా! యీగద నుంచి నీచండ

---

1 యిది భూవిశేషంబో ! యీశోలిమహిమో ! (త)

బాహుబలంబు నీబగిసెల్ల దెలిసె
కూతలు బెట్టుగా గూసినవాని
చేతగా దనుమాట సిద్ధంబుగాదె 1900

జగతిలో వింతగా జలజసంభవుఁడు
మగపుట్టుఁ బుట్టించె మాయన్న! నిన్ను
పాలుమాలిన యట్టిపాపపుబుట్టు
వేల బుట్టఁగవలె నీలోకమునను
జననాథ సకలదేశములఁ గాంచితిని 1905

నినువంటిపందల నే నెందుఁ జూడ!
నీలావు నీజిగి నీయొడ్డుపొడుగు
భావింపఁ గన్నులపండు వయ్యెడిని!
ఓరి! నీ కేమాయె! నోరపైనపెద్ద
బూరుగవృక్షంబుఁ బోలి యున్నావు! 1910

నిన్నుఁజూచిన నిల్వు నీరు పండెడిని
అన్న నీసాహసం బంతయుఁ దెలిసె[1]

---

1 పలుమరు నీ భుజాబలిమి గనుగొన్న
వలునొంద నాకును నవ్వుపుట్టెడిని. (త)

పొలుపుమీరిన మేకపోతుగంభీర
ములు సాగ విక నిందు మూర్ఖ మానవుఁడ!
వెఱ్ఱిచూపులు చూచి వెస పండ్లుగొరికి 1915
వెఱ్ఱికూఁతలు గూయ వెరవ నే నింక[1]
ముదిమిచేఁ గన్నులు మూసుకయున్న
నదరక యింతలే దని చూచి నన్ను
కోతి కోతి యటంచు కొదువ లెన్నెదవు
కోఁతు లేమైనను గొంచెమా నీకు 1920
వననిధి లంఘించి వరశక్తి మెరసి[2]

---

1 బిఱ్ఱులేశము లేక బిడభావమున
వెఱ్ఱిచూపులు చూచి వెసపండ్లుగొరికి. (త)

2 వననిధి లంఘించి వరశక్తిమించి
దనుజేశుపురి గాల్చి దైత్యుల గూల్చి
రావణు జంపించి రహికీర్తి మించి
యా విభీషణుని లంకాధిపు జేసి
యినకులస్వామికి యింతినిగూర్చి
పనుపడ రాఘవు పట్టంబుగట్టి
ఘనులెన్న రామభూకాంతుడు మెచ్చ. (త)

దనుజేంద్రపురి గాల్చి దైత్యుని గూల్చి
ఘను లెన్న రామభూకాంతుఁడు మెచ్చ
గొనబుమించినవారు కోతులుగారె
యాకాలమునను నే నాంజనేయుండు 1925
ఏకశరీరమై యొలమి నుండుదుము
మడియెడ నీకేల మమువంటివారి
గొడవ లిట్లొనరిన గొట్టి చంపెదరు
తగనిమాటలఁ నన్నుఁ దడవితివేని[1]
సుగుల నొంచక మాన చూడు నాచెయ్యి[2] 1930
కొదువలువచ్చిన కూతలు మాని

---

1 చెప్పగ లట్లెల్ల చెప్పితి నింక
తప్పు నాయెడల నింతయుం లేదు లేదు
తలలేని తెరబంటు తనముఁగల్గినను
సొలువక నొకచెయ్యి చూడు నామీఁద
నదిగాద టంటివే యధమ మానవుఁడ
గడ్డమీది మోహముల్ గదలించి కదలు. (త)

2 (a) సుగు లడంచక మానఁ జూడు నాచెయ్యి. (ట)
(b) సుగు లడగించెదఁ జూడు నాచెయ్యి. (చ)

గదమీఁది మోహముల్ గదలించి కదలు
అన విని వనచరాధ్యక్షుని మోము
గనుగొని వడముడి కను లెఱ్ఱచేసి
మర్కటాధమ! యిన్ని మాయలు పన్ని 1935
మార్కొని యెంతేని మాటలాడెదవు
ముదికోతి వనియున్న మోసంబువచ్చె[1]
నిదియెల్ల నీమర్మ మిప్పుడు దెలిసె
పరుషంబు లిట్లాడి బకహిడింబాది
నరభోజనులు గూలినారు నాచేత 1940
దనుజుఁడ వేమొ! గంధర్వుఁడ వేమొ!
వనచరాధమ! చావవలదు నాచేత
అరసి నీబాము లన్నియుఁ జూచి
యీరూపుతో నిల్చి యిచ్చోటనుండి
యనువొంద మాయన్న యాంజనేయుండు 1945
వనధిలంఘించిన వైఖరిదోఁప
దాఁటిన నొకజంగ దాఁటనా నిన్ను
మీఁటిన మిన్నంట మీఁద నాప్రేల

1 ముదికోతి యనియున్న మోసంబువచ్చె. (ట)

వాలంబుతోఁబట్టి వరణముల్ద్రిప్పి[1]
నేలలోఁ గొట్టినా ని న్నీక్షణంబు 1950
నిముషంబులోపల నీతనువెల్లఁ
దుమురుగాఁ జేతును దుర్మార్గ! యనిన
తరుచరాధ్యక్షుండు ధరణీశుమోము
పరికించి యిట్లను బకపక నగుచు
పాండునందన నీప్రభావంబు బలిమి 1955
పండువల్లనె గానబడినది గాదె!
నిన్ను జూచితిగాని నీసాహసంబు
లెన్ను చుండెడివారి నెవ్వారి నెఱుఁగ
చలమున నిశ్శంక సాహసు లిట్లు
పలుకరు నినువంటి పందలుగాని 1960
తెల్లమిగలనరుల్ తిన్నగా బారు
పిల్లవంకలు మొరల్బెట్టుచు దుముకు
నను దాటఁజాలవు నను మీటలేవు
ఘనశక్తి వాలంబు గదలింపఁగలవె.
యీనీచవాక్యంబు లేల నారోము 1965

1 వాలంబుతోఁబట్టి వడిగ నిసుఁద్రిప్పి.

మైనను దెరులింప నలవియే నీకు?
దడయక వాయుహస్తమునబట్టెదను
విడిపించుకొని పారి వెళ్లఁగాఁ గలవె
బలిమి నీకెక్కడ ప్రజ్ఞ లేయారు
చేలపదం బిచ్చోట సాగదు నిలువు 1970
మనిన పాండుతనూజుఁ డాగ్రహ మొంది
ఘనగిరుల ద్రువశంఖంబు పూరించి
అట్టహాసముచేసి హస్తద్వయమున
గట్టిగా వాలంబు కబళించిపట్టి
ఉదుటున వడి ద్రిప్ప నుంకించుటయును; 1975
గదలకయున్న నాగ్రహమున గెరలి
పదము లూనఁగఁ ద్రొక్కి పవనంబుబట్టి
యదలించి యెత్తుచో నప్పు డింతైన
మెదలకుండుట గాంచి మెయి బెంచి నిగుడి
గుదికొన్నకినుకతోఁ గుదియుంచి యలమి 1980
విలయాంతకునిలీల వెస నార్చి పేర్చి
చలమున నుబికిన చలియింపకున్న
మొనసి నానామార్గములఁ జూచి-యలసి

తనమదిలోఁ గొంతతడవు చింతించి
ఘన మిది సాధ్యంబుగా దని యెంచి 1983
యనఘాత్ము డేయుపాయము లేక బెగడి
పలుమరు దశదిశల్ పరికించుచున్న
నలువెల్ల దెలిసి వానరనాథుఁ డనియె
జగదీశ! యిఁకనైన చాలింపరాదె!
దగ దొట్టి దగిలించి తడబడ నేల[1] 1990
వరబాహుబలిమి నావాలదండంబు
దరలింప లేవు పద్మములు దేఁగలవె!*
నిను నీవు తెలియవు నీచేతఁ గాని
పనులకు వత్తువే పనులకు నిటకు[2]
పొలుపొంద పవమానపుత్రుండ వనుచుఁ 1995
దలఁతురు నిన్ను భూతలమునవెల్ల
కలమాట నిజమైనఁ గరువలిపట్టి

1 (a) దగదొట్టి దగలించి తడబడనేల (ట)
(b) తగదిటు గదలింపఁ దడఁబడనేల. ప్రాతఅచ్చుప్రతి
* ఒరలింపఁగలవె యోభూనాథచంద్ర (ట)
2 పనుపున వత్తురే పనులకు నిటకు (ట)

చెలిమినైనను నిల్వ చెల్లదే యకట!
అమ్ము లన్నియుఁ బోయె! నాగద బోయె!
కమ్మదమ్ముల కెట్లు గదలెద వింక! 2000
తోచక నీచేయుదుడుకు లన్నియును
గాచి రక్షించితి గరుణతో నిపుడు
పగ్గెలబొదలక పదరక లేని[1]
సిగ్గులబడక వచ్చిన త్రోచచనుము
ప్రాణము ల్గలిగిన భార్యలు గలరు 2005
బాణముల్ గాంచిన పద్మముల్ గలవు
భూవర! యీవెఱ్ఱిబుద్ధులు మాని
పోవోయి నీవు నీపొందుపంట్లకును;
అన విని కడువిన్న నైయె తలవాంచి
మనుజ వల్లభుఁడు నెమ్మది చింత నొంది 2010
తలకక ఘోరకాంతారభూములకు
నెలత దోడ్కొని చన నీతిగా దనుచు
చీరి వేమరు బుద్ధిచెప్పిన వినక

1 ప్రెగ్గెలబొదలక బెదరకలేని (క)

వారిజాక్షుని దోడ్క వచ్చుట గొదువ;
వేడు మిచ్చెద నని వేడిన పిదప 2015
పోడిమి నీ కున్న బొందు పాపములు;
వనజము ల్గొనిపోక వనిత యున్నెడకు
జనిన నపఖ్యాతి; సకియ దుఃఖించుఁ;
బాయని యపకీర్తి భరమున కోర్చి
పోయెద ననినను బోనీయఁ డితఁడు; 2020
సకలాయుధంబులు చనుటయు మోస
మకట! యీతఁడు చేసె నాబాణహాని;
యితని జంపుదు లేక నితనిచేఁ జత్తు
నితరంబు లే దని యెంచి క్రోధించి
తలప లోకములోన ధర్మనందనుఁడు 2025
వల నొప్పగా సత్యవంతుఁ డౌ నేని
గోపాలకృష్ణుండు గోరినయపుడె
మాపాలగల్గి యేమరకుండు నేని;
యనయంబు వేడ్కతో నంజనకూర్మి
తనయుఁడు నామీఁద దయ గలఁ డేని; 2030
పసిడిబంగరుబోలు పాంచాలపుత్త్రి

వసుధలోపల పతివ్రత యగునేని;
నెగడువేదంబులు నిక్క మానేని;
జగతిలో ధర్మమే జయమగునేని;
యీవానరునితోడ సీమాయలెల్ల 2035
వావిరిదెగటార్చి వరసాధనములు
గైకొని చని హేమకంజము దెచ్చి
రాకేందువదనకు రహి నిత్తు ననుచు
బోసగ గర్జిలి భుజంబులు బెట్టు సరచి
వెసబేర్చి యొకసాలవృత్తంబు బెరికి 2040
తనమీఁద నడతెంచు ధాత్రీతలేంద్రు

ఆంజనేయుఁడు నిజరూపమును దాల్చుట

యనువెల్ల బరికించి యాంజనేయుండు
యనుపమామోఘవాక్యము దప్ప దనుచు
ఘనమైనవృద్ధమర్కటరూప ముడిగి
నెనరున నెంతయు నిజరూపు దాల్చి 2045
యనుజాని మ్రోల ప్రత్యక్షమై నిలిచె[1]

---

1 ఎన్నడు గలన నన్నెదిరి పోరాడి
యున్నవారల గాన నుర్వీతలమున

నన విని జనమేజయావనీశ్వరుఁడు
మునినాథుఁ గాంచి కేల్మోగిచి యిట్లనియె
నినతేజ మౌనీంద్ర యీచరిత్రంబు
విన విన మదిలోన వేడ్క పుట్టెడిని 2050
తరుచరాధిపుఁడు ప్రత్యక్షమైయున్నఁ
దరువాత కథలెల్లఁ దగఁజెప్పు మనిన
జనమేజయునకు వైశంపాయనుండు

---

నగచరుం డన నెంచ నగునె యీఘనుని
నగభేదనుండో పన్నగభూషణుండో
గజరాజవరదుండో గంధవాహనుఁడో
గజబిజియయ్యె మర్కటశక్తిగాదు
కలకబుట్టగ పానకములోని పుడుక
వలె నడ్డమై నిలిచె వనచరాధిపుఁడు
సౌలువక దేవతారాజసూనంబు
లిలలోన మనుజుల కేల సిద్ధించు
నన్నమాటలు మీరి యతివబోధనలు
విన్నఫలం బెల్ల వేగ ఫలించె, ...
హనుమంతు తిరువళి యనవరతంబు
ధనధార హ్మాఖ్యాధ ధయగలదేని. (త), ...

వినుపింపఁదొడఁగె తద్వృత్తాంత మెలమి
అని యనంతాశకన్యకాధీశుపాద[1] 2055
వనజాత నిరతసేవారతు పేర[2]
భావజహితచంద్ర బలదైత్యఖచర
దేవభూరుహాసుర ధేనుధనాధి
పతి మేఘనాదోధిపద్మాప్తపుత్త్రి
వితరణు పేర కోవిద నుతు పేర 2060
శతమఖపాటీర శారదాహీర
శతధృతినందన శారదాహీర*(?)
గగనకల్లోలినీ కౌముదీశిశిర
నగరాజమృగ రాజ నవ్యధావళ్య

1 (a) అని యనంతర కాళికాధీశ్వరాంఘ్రి. (చ)
(b) అని యనంతట కన్యకాధీశ్వరాంఘ్రి
(c) అనియె నంతకు కన్యకాధీశు పాద (క)
2 (a) వనజాత నిరతు సేవారతు పేర (ట)
(b) వనజాప్తనిరతసేవాధీశు పేర
*1 శతధృతినందన శంకరాహేంద్ర (ట)
2 శతధృతినందనా శారదాహేంద్ర (క)
3 శతముఖేభవటీరశర్వాణి పేర

తరకీర్తిపేర మేధానిధిపేర 2065
సరసకళాపూర్ణచంద్రునిపేర
సుకవిపోషణుపేర శుభమూర్తిపేర
సకలపురాణార్థసంగ్రహుపేర
నాదనీనదుర్గహారణునిపేర
చేదిభూవరదత్తసింహతలాట 2070
కరహాటనృపదత్తకనకపతాక
బిరుదాంకుపేర గంభీరాబ్ధిపేర
కరనొప్ప జగనొప్ప గండనిపేర
శతనృపాలకశైలశతకోటిపేర 2075
కఠినచౌరాసి దుర్గవిభాళుపేర[1]

---

1 విలసిల్లు శ్రీరాయ వేశ్యాభుజంగ
కులసంభవుండు సద్గుణపుణ్యశాలి
వలనొప్పకేళాది వైభవసాంద్ర
సలలితౌదార్యుండు సంగ్రామభీముఁ
డగు సజ్జనాధారుఁ డార్యపోషకుఁడు
అగణిత ధౌరేయుఁ డర్థిమందారు
శత నృపాలకశైల శతకోటిపేర

మానితభాషణంబామనఃపద్మ [1]
భానునిపేర వైభవజిష్ణుపేర
రావిళ్లకొండధరామరులింగ
భూవల్లభునిపేర బుధులౌ ననంగ 2030
నంకితంబుగ నుపమాది ప్రోల్లసద
లంకార బహువిధలక్షణఫణితి
తనరు వేడుకలరత్నాకరకృష్ణ
ఘనునిగోపాలసత్కవిశేఖరుండు
సరసోక్తిరచియించె సౌగంధికాప 2035
హరణకావ్యంబునం దాపాండుసుతులు
వలనొప్ప బదరికావనముఁ జేరుటయు
నలరు ద్రౌపది దోడ్క ననిలనందనుఁడు
వనభూమి కరుగుట వనజంబు గనుట[2]

---

ప్రతిభగల్గినయట్టి ప్రావీణ్యుపేర
కఠినచౌరాసిదుర్గవిభాళుపేర
చటులవిక్రమ పుణ్యశాలియుఁ బేర .(ట)

1 మానితభాస్కరాంబామనఃపద్మ

2 వనభూమియందుల వసియించి చనుట

ననబోణి యడుగుట నారదమౌని 2090
వేవేగ వచ్చుట వికచాబ్జముఖికి
కావలి యాఘటోత్కచుని దెల్పుటయు
ననిలతనూభవుం డలరుచుఁ గూర్మి
తనయుఁ దలంచుట తడయక నతఁడు
వచ్చుట పాంచాలివద్ద నాఘనుని 2095
మచ్చికతో నుంచి మసలక వేగ
నెంతయు నేఁగుట నింతి దాఁ గొంత
జింతసేయుట పట్టి చింతబాపుటయు
నలమార్గముననుండి యాంజనేయుండు
బలుమాయ గల్పించి భ్రమల చాలించి 2100
వలసి యన్యోన్యవివాదము ల్చేసి
చెలువంబుతో భీమసేనునిమ్రోల
నలవడ ప్రత్యక్ష మైనట్టి కథల
నలరుచు నిది ప్రథమాశ్వాస మయ్యె. 2104

ప్రథమాశ్వాసము సంపూర్ణము.

---

తనయుండు వచ్చుట దగుసంభ్రమమున (ట)

# ద్వితీయాశ్వాసము

అవధరింపు నృపాల యవ్వలికథలు
పవమానతనయుండు ప్రత్యక్షమగుచు
నిలిచినఁ గనుఁగొని నృపకుమారుండు
సలలితానందాశ్రుచయములు దొరుగ
కరయుగంబున నున్న ఘనసాలభూజ 5
మురువడి ధరణిపై నొగి బారవైచి
భయభక్తి వినయసంభ్రమచిత్తుఁ డగుచు
రయమునఁ బ్రణమిల్లి రహిఁ గేలు మొగిచి

( భీముఁడు హనుమంతుని విశ్వరూపమును జూడఁగోరుట. )

జయదయాపాథోధి! జయపుణ్యమూర్తి!
జయజయ దశదిశాసాంద్రసత్కీర్తి 10
జయదీనపోషణ! జయసత్కృపాంగ!
జయజయ శ్రీరామ! చరణాబ్జభృంగ!

జయజితదైతేయ! సన్మునిగేయ!
జయభక్తఫలదాయ! జయయాంజనేయ!
యపరాధి నపరాధి నమితదోషకుఁడ 1
కపటచిత్తుఁడ నన్నుఁ గాచి రక్షింపు
మని సన్నుతులు సేయ నాపాండుసుతుని
కనికరంబున గ్రుచ్చి కౌగిట చేర్చి
మోదంబుతో జెక్కు ముద్దు ఘటించి
యాందరింపుచు నున్న నగ్రజునకును 20
దోరంపువేడ్కలు దుదిఁ బొందులాడ[1]
నేరుపుతో మ్రొక్కి నిలిచి యిట్లనియె
వనచరకులచంద్ర! వరదయాసాంద్ర!
మునిదేవ నుతకీర్తి! మోహనమూర్తి!
శ్రీరామపాదరాజీవంబు లర్థిఁ 2
జేరి సేవింపుచుఁ జెలగుచు నున్న
యానాటి ఘనతావకాకారమహిమ
లేను చూడఁగఁ గోరి యేప్రొద్దు నుంచు

(a) తోరంపువేడ్కలు దుది బొమ్మలాడ (క)
(b) తోరబపువేడ్కచేఁ దుది బొమలాడ (చ)

నాచంద మాయంద మాదివ్యమూ ర్తిఁ
జూచెదఁ గరుణింపు సుజనమందార 30
యని వేడుకొన్నట్టి యాపాండురాజ
తనయుని లాలించి తరుచ రేశ్వరుఁడు
ఆకాలమున నున్న యట్టిరూపంబు
నీకాలమునఁ జూప నెట్లగు నన్న?
బెక్కుమార్గంబుల భిన్నంబు లగుచు 35
నొక్కవిధంబున నుండవు నిలిచి;
తిర మొంకఁగా గృతత్రేతాయుగములు
గరిమతో ద్వాపరకలియుగంబులును
వెలయు నసంఖ్యాలై వేర్వేర నుండు;
నలచరాచరకోటు లాప్రకారములు 40
భిన్నమార్గంబులై పృథివి వర్తిలును;
నున్నతోన్నతములై యొనరుచు నుండు
ననిన నాయుగముల నాచారవిధుల
ఘనవర్తనలు దెల్పఁగా దగు ననిన
కురుకుమారునిమీఁద గూర్మి నెక్కొల్పి 45
తరుచరాధీశుండు దగ నిట్లు పలికె

హనుమంతుఁడు చెప్పిన యుగధర్మములు

పొలుపొందు గృతయుగంబున నాల్గుపాద
ముల ధర్మ మలరుచు భూమండలమున
వర్తిల్లు వరరుక్మవర్ణుఁ డచ్యుతుఁడు
కర్తయై బ్రాహ్మణక్షత్రవిట్కులము
లట యేకవేదక్రియాయోగ్యు లగుచు
పటుపుణ్యలోకసంపదలఁ బొందుదురు
మఱియుఁ గామక్రోధమదమత్సరముల
మఱగరు రోగదుర్మరణముల్ లేవు;
ధర్మజానుజుఁడ త్రేతాయుగమ్మునను
ధర్మంబు మూఁడుపాదముల వర్తిల్లు;
పట్టుగా స్ఫుటరక్తవర్ణుఁడై విష్ణు
భట్టారకుం డుండి ప్రజల రక్షించుఁ;
బొదలుచు జనులు తపోదానసత్య
విదితయోగంబుల వెలయుదు రందు
ద్వాపరంబున ద్విపాదముల ధర్మంబు
చూపట్టుచుండ నచ్యుతుఁ డుండు పీత
వర్ణుఁడై జనుల నుర్వరఁ బ్రోచుచుండు

వర్ణాశ్రమంబుల వర్తన ల్గలిగి
సరవేదశాస్త్రచోదితములు నగుచు 65
ధరసర్వకర్మముల్ ధర్మముల్ బరగు;
వెలయు గామాదు లావేశించి యుండు;
కల సత్యనీతిమార్గంబులు దఱుఁగు
ప్రోదిగా కలియుగంబున ధర్మ మేక
పాదంబున మెలంగు పటుకృష్ణవర్ణుఁ 70
డగుచు విష్ణుండు బ్రోచు నవనీతలంబు
నొగి జను ల్బహుతమోయుక్తులై యెపుడు
కామాదిదోషసంగతులై యధర్మ
భీమకర్మముల ఱంపిల్లు చుండుదురు[1]
పొలుపొందునట్టి తపోదానమహిమ 75
లిల బహుఫలములై యొసగుచు నుండు
నని యుగభేదంబు లన్నియుఁ దెల్పి
యనువొంద దీవించి యరుగు మిం కనిన
యనుమోదమున మ్రొక్కి యభినుతు ల్చేసి
వనచరేంద్రునకు భూవరుఁ డిట్లు బలికె 80

1 భీమకర ముల మొరపెట్టుచుండుదురు (చ)

హనుమంతుఁడు విశ్వరూపమును జూపుట.

ఆనాఁటి మీరూప మారసి కాని
పో నన నంజనీపుత్త్రుఁ డవ్వేళ
నపరిమితం బైన యాకారరేఖ
నిపుణత మెఱయనానృపతికిఁ జూపె
గగనంబుఁ గబళించు కనకాద్రిపోలె
తగిన గాత్రము దిగంతములెల్లఁ గప్పి
యలమిన వాలయుతాకార మరసి
కలఁగి విస్మయమంది కనుదోయి మొగిచి[1]
చింతించి యాభీమసేనుఁ డెంతయును
మంతుకెక్కిన హనుమంతుని కనియె
అతిభీషణం బది యత్యద్భుతంబు
వితతంబు నగుచు పృథ్వీగగనంబు
లలమియున్నది నీమహాకారరేఖ
సొలయక కనువిచ్చి చూడఁగా నోప
జాలింపుఁ డనిననాసహజన్ముపల్కు

---

1 కలవియస్మయమంది కనుదోయి మూసి (1378)

లాలించి మునుపటి యాకృతి నిలచి
మనుజేంద్ర! రక్కసుల్ మార్కొన్న వేళ
నినుమడి ముమ్మడి నేజెంతు నేను
ఎప్పటి నిజరూప మిపుడు జూపితిని
తప్పక చూడుము ధరణీశ యనిన 100
విని కాంచి భీముఁడు విస్మయమంది
హనుమంతునకు మ్రొక్కి హస్తము ల్మోగిచి
కనుగొంటి దేవ మీకమనీయమూర్తి
నిటువంటిబలశౌర్యనిధి గల్గియుండ
నల రాఘవుఁడు రావణాదిరాక్షసులఁ 105
గెలుచుట చోద్యమే కేసరితనయ!
అరయక పలుమాట లాడితి మిమ్ము
కరుణించి నను బ్రోవఁగాఁదగు ననిన
మన్ననతో హనుమంతుఁ డిట్లనియె
నన్ను నీ వాడిన నయమింత లేక 110
నిన్ను నేనాడిన నేరము ల్గలవె!
అన్నదమ్ములపట్ల నరమర లేల?
జననాథ కన్నులు చల్లఁగా నిన్ను

గనుఁగొనఁగలిగె నాకాంతి లీడేర
అహికేతనునిఁగూర్చి హస్తినాపురము 111
విహితంబుగా నిత్తు వేడ్కతో మీకు
మక్కువ నీవిందు మలయుచునుండు
గ్రక్కున సౌగంధికములు నేదెత్తు
ననిన సంతోషించి యంజనీకూర్మి
తనయుని పాండునందనుఁడు వీక్షించి 120
కపినాథ మీకటాక్షంబున మేమె
యపరాధి యగు కౌరవాధీశుఁ దునిమి
ధర్మనందనుచేత ధారుణి యెల్ల
నర్మిలి యేలింతు మనఘచారిత్ర
తరలక నరునికేతనమున నిల్చి 125
సొరిది మాబలశక్తి చూతురుగాని
గరిమతోఁ గాంచనకమలము లున్న
తెలుఁగు లామార్గము ద్దెలుపవే యనిన[1]

1 a. తెలుగును మార్గము ద్దెలుపవే యనిన (క)
b. తెలుగుల మర్మము ద్దెలుపుడి యనిన (137
c. తెరగుల మర్మంబు దెలుపుడీ యనిన (చ)

## హనుమంతుఁడు సౌగంధికము లున్న నెలవు చెప్పుట

మనుజేంద్ర కనకపద్మము లున్న నెలవు
లొనరఁ దెల్పెద విను ముత్తరంబునను 130
రజతాచలప్రాంతరమ్యదేశమున
రజతకాంచననవరత్నసంఖచిత
సాలగోపురధామ సౌధజాలములు
లాలితాగణ్యకల్యాణసంపదలు
నవనిధానంబులు నవ్యభాగ్యములు 135
వివరింపఁగారాని వివిధవస్తువులు
సార్వభౌమునిసాటి సామజేంద్రములు
ఖర్వమహాఖర్వఘటసమూహములు
పరికింప పుష్పకప్రతిమానమైన
సరస నానామణిస్యందనావళులు 140
వలనొప్ప నుచ్చైశ్శ్రవము గెల్వ జాలు
కలిత శంఖాసంఖ్య కంఖాణచయము
శతధృతికైన నెంచఁగరానియట్టి
యతిశౌర్యధనులు యక్షాదినాయకులు

గలిగి సర్వంసహాకామినీమదుటఁ 145
బొలుపొందు పాపటబొట్టోయనంగ
నగభేదిపుటభేదనంబునకన్న
నగణితంబై పొల్చువలకాపురంబు
ఆపట్టణంబున కధిపతిశౌర్య
దీపితాటోపుండు దినరాజతేజుఁ 150
డమితధీరోదారుఁ డరిభయంకరుఁడు
సమర నిశ్శంకప్రచండప్రతాపుఁ
డతిబలశాలి ధనాధినాయకుఁడు
ప్రతిభచే సకలదిక్పతులలోనెల్ల
తతకీర్తి గాంచి యంతకు మంతుకెక్కి 155
శితికంధరుని చెల్మి చేయుచు నుండు;
నతని యధీనమై యఖిలమహీజ
వితతుల వనయంబు విలసిల్లుచున్న
వనమధ్యమున నొక్కవనజాకరంబు
ఘనకళాతేజోవికాసమై వెలయుఁ; 160
గొమరొందుసట్టి యాకొలనిలోపలను
కమనీయసౌగంధికమ్ములు గలవు;

పాసఁగ నాకొలనికిఁ బూర్వభాగమున
నసమానబలశౌర్యు లగునట్టి యక్ష
బలము ముక్కోటి నల్వాదివేలు గొలువ 165
చలముతోఁ గావలి జాంబీరుఁ డుండు
కనుగల్గి యారులక్షల పదివేలు
దనుజవీరులతోడ దక్షిణంబునను
గంటికి రెప్పగాఁ గాపాడినటుల
నంటి కావలియుండు హాటకాక్షుండు; 170
నెలకొని సాహసాన్వితు లై దుకోట్ల
నలుబదివేలుగంధర్వులు గొలువ
బలు హెచ్చరికలతోఁ బశ్చిమంబునను
జెలఁగి కావలియుండు చిత్రరథుండు;
నాలుగుకోట్ల కిన్నరసేనతోడ 175
కాలకంఠాభీలఘనపరాక్రముఁడు
హత్తి మాణిక్యరథాఖ్యుఁ డగుచు
నుత్తమోజ్వలు డుండు నుత్తరమునను;
సమరంబులో వారి సాధించి నీవు
కమలము ల్దెచ్చుట గానఁగా రాదు; 180

వారితోఁ గలకంఠివాంఛలు దెలిపి
చేరిక ల్గావించి చెలిమి వాటించి
వినుతులు ప్రకటించి వినయముల్సేసి.
వనజముల్గోసిరమ్ము పలదు వైరంబు;
మసలఁ జెల్లదు! నీవు మానవపతివి 185
వసుధాతలాధీశ! వారు దేవతలు;
మహి బలి హోమనమస్కారమంత్ర
మహిత భక్తి జ్ఞానమతులచే వారి
సాధింప నగుఁగాని సాహసక్రియల
సాధింపఁగూడ దాచారంబువలన 190
ధర్మంబు జనియించుఁ దనరారునట్టి
ధర్మంబువలన వేదములు వర్ధిల్లు
వారువేదముల యజ్ఞములు వర్ధిల్లు
వారక యజ్ఞంబువలన దేవతలు
పరితృప్తు లగుదురు పార్థివోత్తంస; 195
స్థిరబుద్ధిచేఁ గాలదేశంబు లెఱిగి
సాధింప నగునయ్య సామాద్యుపాయ
సాధకంబుల సాహసము సేయవలదు

సుతకీర్తి నిగ్రహానుగ్రహ ప్రతిభ
లతిభక్తియుక్తి నీయందును గలవు 200
అటు గావునను వశ్యు లందఱు నీకు
దిటమున నేతెంచి తెమ్ము పద్మములు
ధర్మమున్నట్టిచో దైవంబు గలదు
ధర్మవర్తను లన్నదమ్ములు మీరు
తలపోయ మీ కసాధ్యంబులు గలవె! 205
గెలిచి రమ్మనుచు గౌఁగిటఁ జేర్చి యతని
శరశరాసనగదాసాధన ప్రతతి
మరి గొన్ని వరదివ్యమార్గణంబులును
ధర నీడు లేనికోదండంబు నొకటి
తిర మొందఁగా నిచ్చి దీవించి పనిచె. 210
పనిచినఁ దగ మ్రొక్కి పవనవేగమున
చని చని పాండురాజతనూభవుండు
కరిఘటానీకఘీంకార రావములు
నరుదైన తురగహేషారవంబులును
ఘనతర భేరిభాంకార రావములు 215
ననుపమసైన్యవీరాలాపములును

చటుల శరాసనజ్యానినాదములు
పటుజయశంఖగుంభ ధ్వానములును
వీనుల విందుగా వినుచు నేతేర
పూనిక నరుదెంచు పుత్త్రునిచలము 220
బలము చలంబు శుంభత్ప్రభావంబు
వెలయు నుద్దండంబు వీక్షించి మెచ్చి
యనిలుండు కనకరత్నాభిషేకములు
తనివిదీరఁగ జేయఁదలఁచి వేగంబె
యాయతపడి యున్న తాంకారములుగఁ 225
బోయి కాంచనరత్నములరాసు లనఁగ
వినుతికెక్కిన బహువిధమహీజములు
తనరారు నానాలతానికుంజములు
పరిపూర్ణకోరక ప్రసవజాలములు
బరగు నవ్వనభూమి భావించి చూచి 230
గరుడగంధర్వరాక్షసయక్షబలము
పరికించి జృంభించెఁ బాండునందనుఁడు
కలహంస శుకశారికాకోలకంఠ
జలపతంగరథాంగజలయుతం బగుచు

### భీముఁడు సౌగంధిక జలజాకరము సమీపించుట

విలసితామోదముల్ వెదచల్లుదాని 235
సలలితసౌవర్ణజలజాకరంబుఁ
గనుఁగొని చాల వక్కాణించి పొగడి
వనజాకరముఁ జేరవచ్చు నవ్వేళ
యక్షరాక్షససేన లనిలనందనుని
వీక్షించి యత్యంతవిస్మయు లగుచు 240
నౌరౌర! యీతని యాకారశౌర్య
సారబలోద్దండసంరంభగరిమ!
పరువడి మనల నేపట్ల నింతైన
సరకుసేయక నిదె చనుచున్నవాఁడు!
పదపదం డని బాణబాణాసనములు 245
పదపడి దాల్చి నిబ్బరమున నేఁగి
యవ్వీరశేఖరు ననువెల్లఁ దెలిసి

### భీమ, యక్ష రాక్షస సంవాదము

యెవ్వరివాఁడ వీ వెవ్వఁడ? విచటి
కెవ్వఁడు బనిచెఁ? జే రెయ్యది నీకు?

నివ్వనభూమికి నేలవచ్చితివి? 250
తక్కులు దక్కక తత్తరపడక
నిక్కంబుఁ బలుకుమా నృపకులోత్తంస!
యనిన నావీరుల నందఱఁ జూచి
వినయుఁడై పలికె నావిజయాగ్రజుండు
వినరయ్య నే విన్నవించెద మీకు; 255
జనసుతుం డగుపాండుజనపతిసుతుఁడ;
సకలధరాధీశసందోహరత్న
మకుటప్రభాజాలమహితపాదార
విందుఁడై జగతిపై విలసిల్లు ధర్మ
నందనుతమ్ముఁడ నను భీముఁ డండ్రు; 260
వనములోఁ గాంచనవనజంబుఁ గాంచి
వనబోణి యిటువంటి నలిన మి మ్మనిన
నిచ్చెద నని పల్కి యీజాడ దెలిసి
వచ్చితి; గృపఁ జూచి వనజ మీవలయు;
అన విని పాండురాజాత్మజుఁ జూచి 265
దనుజాధినాథుఁ లెంతయు నిట్టు లనిరి
మానవు లెక్కడ! మహనీయదేవ

సూనము లెక్కడ! సులభ మె నీకు!
నీలకాంతము లిట నిచ్చువా రెవరు?
పౌలస్త్యుఁ డుస్నాఁడు ప్రభుఁ డందఱికిని; 270
నొయ్యన కావలియున్న వారలకు
నియ్య స్వతంత్రంబు లేలీలఁ గల్గు?
విచ్చేయు ధననాథు వేషము శ్రీదుఁ
డిచ్చిన గైకొను మిట నిల్వఁ జెల్ల
దనిన పాండుతనూజుఁ డావీరవరులఁ 275
గనుఁగొని యిట్లను గలకల నగుచు
గురుతైన క్షత్రియకులమునఁ బుట్టి
శరశరాసనములు చాలఁగఁ బూని
ధూర్తారికోటులఁ ద్రుంచి నల్గడల
వార్తకు నెక్కి యావైశ్రవణుండు 280
వడిదప్పి నే నర్థి వరుణచందమున
నడుగంగఁ జెల్లునా నాబలంబునకు
నుడుగక కావలి యున్నవా రగుట
నడిగితి మిము రాజు నడుగంగ రాదు; 285
ఇచ్చిన మే లగు; నియ్యకయున్న

చొచ్చి నేఁగొని పోదు సూనంబు లనినఁ;
గనుగవ విస్ఫులింగము లుప్పతిల్ల
జననాథుఁ గనుఁగొని సైనికు లనిరి
చనువరివ లెనె యిచ్చటికి నేతెంచి
మనుజకీటమ! యోరి, మము సడ్డగొనక 290
శంక లేక మదించి శౌర్యంబు మించి
పంకజాకరతీరభాగంబుఁ జేరి
కొంకక బొంకించి కొని పోఁదలంచి
చంక దుడ్డును వెండి శరణార్థి దగునె![1]
నరుఁడవు నీవు దానవులము మేము 295
వెరువవు ప్రజ్ఞలు విడువవు నిన్ను
కరవాలముల కడికండలు చేసి
పరమహర్షంబున భక్షింతు మనుచు
నడిదముల్ ఝళిపించి యత్యుగ్రు లగుచు
వడిఁ జుట్టుముట్టిన వాయునందనుఁడు 300
కనుబొమ లుడిపెట్టి కను లెఱ్ఱఁ జేసి

1. చంక దుడ్డును వెంట శరణార్థి యగునె (క)

ధను వందుకొని గుణధ్వని చేసి యార్చి
ఘనభీకరాకారకఠినమానసుల
వినుతశౌర్యుల దైత్యవీరులఁ గాంచి
చండిపోతులు గుణసాధ్యులుగారు 305
దండసాధ్యులు మహోద్దండులు మీరు
గాటంపు టమ్ములఁ గదియక మంచి
మాటల మీరు పద్మము లియ్యఁగలరె!
చేటుబుద్ధులు మాని చెడిపోక వేగ
హాటకాబ్జము లిచ్చి యనుపుట లెస్స! 310

### భీముఁడు యక్షరాక్షసవీరులతోఁ బోరుట

కాదేని నాచండకాండజాలముల
భేదింతు నని యొక్క భీషణాస్త్రంబు
నారి సారించి యానరనాథమౌళి
ధీరత చెవియాన దివియ నవ్వేళ
యక్షరాక్షససేన లరువదినాల్గు 315
లక్ష లొక్కుమ్మడి లావు రెట్టించి
అద్దిరో! యీతని హుంకారమహిమ!

కొద్దిగా దని యెంచి క్రోధించి మించి
తడబడకడిదముల్ తళతళ మనఁగఁ
గడువడిఁ దొడరి యొక్కటఁ జుట్టుముట్టి 320
పొడువుఁడు పొడువుఁడు పోనీక గదిసి
యడువుఁడు నడువుఁ డత్యంతశస్త్రముల
నేయుఁడు డాయుఁడు నింతింత దునెలు
సేయుఁడు గూయుఁడు చీకాకుపడక
పట్టుఁడు గొట్టుఁడు బలిమి పగ్గములఁ 325
గట్టుఁడు బెట్టుగా ఖండించివైవుఁ
డని యార్చిపేర్చి మహారౌద్రు లగుచు
గొనకొని యత్యంతఘోరశస్త్రముల
ముసలజాలంబుల ముద్గరంబులను
నిశితశూలంబుల నిష్ఠురభింది 330
వాలంబులను గదావలులకుంతములఁ
గోలాహలంబుగాఁ గుప్పి యుప్పొంగి
విక్రమింపుచు నున్నవిబుధారి యక్ష
చక్రంబుఁ గని పాండుజనపాలసుతుఁడు

హ్వారగగనము ల్గగ్గోలుపడఁగ[1] 335
సింహనాదము చేసి జృంభించి దనుజ
యక్షవీరులఁ గాంచి యరుణాయమాన
వీక్షణుండై ఘోరవివిధబాణములు
నిగుడించి బెగడించి నెగులు బుట్టించి
పగయెల్ల నణఁగించి పడగలు ద్రుంచి 340
యురములు బెకలించి యుదరము ల్చించి
శిరములు ఖండించి చెక్కులు చెక్కి
కరములు నురుమాడి కండలు చెండి
చరణము ల్నరికి పిచ్చలు చేసి జవన
తురగసంఘముల ధౌతుల నుగ్గు చేసి 345
కరివరాహంబుల గణములు గూర్చి
రథికుల జంపి సారథుల మర్దించి
రథరథ్యచయము చూర్ణంబు గావించి
గదఁ బూని విజయశంఖంబుఁ బూరించి

1. గంహారుల్ గగనంబు గగ్గోలుపడగ (క)
2. గగనగహ్వారములు గగ్గోలుపడగ
పగలెల్ల నుడిగించి పడిగెలు ద్రుంచి (చ)

యదరించి బెదరించి యటునిటుఁ బరపి 350
బిట్టుల్క వెన్నంటి భీకరఘోఢి
నట్టహాసము చేసె నమ్మహాబలుఁడు
అంతట దానవయక్షసైన్యములు
పంతము ల్వాలించి ప్రతిభలు డించి
యదరి పారెడువారు నరచెడివారు 355

బెదరి చూచెడువారు భీతిల్లి నేలఁ
బడి కావు మనువారు పదరికల్ చెదరి
తడఁబడువారు పొద ల్దూరువారు[1]
తరువు లెక్కెడివారు ధైర్యము ల్దూలి
శరణనువారు విచ్చలవిడి దిశల 360

పరువు లెత్తెడువారు పడినగాత్రముల
మరువు చేరెడువారు మరిగాయ వెఱచి
కన్నులు ముకుళించి కదలనివారు
అన్నన్న! యిఁకఁ బ్రోవు మనియెడువారు

---

1. పడి కావు మనువారు బడలికల్ దట్టి
తలపడి పారి పొద లూఁదువారు (చ)

అదె వచ్చె నిదె వచ్చె ననియెడువారు 365
గుదిగొన్న దిగులున గుండెడివారు
బొగులుచు మిగుల వాపోయెడివారు
నగుచు సైన్యాధీశునండకుఁ జేరి
హాహారవంబుల నడల నీక్షించి
సాహసబలశాలి జాంబీరుఁ డప్పు 370
డోహో! భయం బేల? నుడుగుడ టంచు
మోహరంబుగ బలంబుల నేర్పరించి
పేరైన రథికులఁ బెంపు చేయించి
భోరునఁ బోరికిఁ బురికొల్పి తాను
పదరుచు సేనాధిపతులతోఁగూడి 375
కదియ సన్నద్ధుఁడై గదియ నేతెంచె;
అంతటఁ జెలరేఁగి యదూదిబలము
కౌంతేయుమీఁద నగ్గలికతో నురికి
కనలుచు గర్జించి కరకరి నొరసి
తనరార సింహనాదములును జేసి 380
కరవాల ముసల ముద్గర భిందివాల
శరపరంపరలచేఁ జలమున నరికి

క్రుమ్మి రెమ్మియు జిమ్మి గ్రుచ్చి నాటించి
బిమ్మటి గొనతేనె పెరవ్రాగినటుల[1]
గదిసిన యక్షరాక్షససేనఁ జూచి 385

బెదరక నెదు రేఁగి భీముసేనుండు
దురుసుగా నెడలేక తోలుకారువాన
గురియుచందంబున ఘోరబాణములు
సడలక నేయుట సంధించుటయును;
గడు నెఱుంగకయుండఁగా నప్పళించి[1] 390

పక్కలు బిక్కలు పాదము ల్దొడలు
చెక్కలు ముక్కలు చేతులు చెవులు
నడుములు మెడలును నరములు శిరము
లుడుగని గినుక నొక్కుమ్మడి చిదిమి
భటుల నెల్లను బటాపంచ గావించి 395
చటుల భయంకరజ్యారవం బెసఁగఁ
గమకించి తురగసంఘములు నూటాడి

---

1. బెమ్మెర గొని తేనె పెరమూగినటుల (చ)

1. కదు నెఱుంగకయుండగా గట్టుమంచి (క ; చ)

సమదేభకోటులఁ జలమునఁ జంపి
వంతున నెక్కు మావంతుల జెండి
పంతంబుతో సైన్యపతుల నుగ్గాడి 400
పేరైన రథికులపీచంబు లడచి
ఘోరదానవయక్షకోటుల నెల్ల
హరిణంపుగుంపుల నదలించి గదుము
హరికిశోరము లీల నార్చి తోలుటయుఁ;
గలఁగె నేనుఁగులు చీకాకయ్యె బలము 405
బొరిసిరి దొరలు చప్పుడు మానె హరులు
నరదము లొప్పిడియయ్యె హతులైరి రథికు
లరిమురి గూలె మహాయోధకోటి;
అంతటఁ బోక రౌద్రావేశుఁ డగుచుఁ
గుంతీతనూజుండు కులిశబాణమున 410
నాహవస్థలి హాటకాక్షునిఁ ద్రుంచి
సాహసు నుత్తమోజ్జ్వలు గంధవాహు
శరమున వధియించి జలధరాస్త్రమున
ధరచిత్రరథుఁ గూల్చి దర్పంబు మెరసి
కనలి జాంబీరుపైఁ గవిసి కేతనము 415

ఘనశిలీముఖమున ఖండించుటయును
మలసి జాంబీరుఁడు మార్గణత్రయము
విలయాంతకునిలీల వింట సంధించి
యోరి నరాధమ! యోరి దుర్మార్గ
యీరీతి పొంగెద వేల నాచేతఁ
జావక పోవోరి చచ్చెద వేని
బోవక నిల్వు నీ పొంగెల్ల నణఁతు
ననుజూఁడు నినుజూఁడు నాసేనఁ జూఁడు
పనుపడ నాదివ్యబాణము లూఁడు
మనుచు నాకర్ణాంత మగునట్లు దిగిచి 42
గొనకొని నేయనాఘోరబాణములు
పెలుచ నే తెంచి యాభీమువక్షంబు
గలయించి విలునారి ఖండించి గళము
భేదించుటయుఁ గాంచి బెట్టుగా నార్చి
పాదము ల్దట్టించి బాహువు ల్సరచి 430
గదఁ బూని నడచి యుగ్రత మోదుటయును;
జదియ ధారుణి గూలె జాంబీరుఁ డంత
ఘనతరం బైన సంగరభూమి నెల్లఁ

నుఁగొని భీముఁ డాగ్రహము చాలించి
రజాకరము సొచ్చి వనజము ల్దెచ్చి 435
మొనసి వేఱొక్క యమ్ములపొది నించి
న వచ్చురాక యాధనపతి వినక
వనఁజెల్ల దనుచు నచ్చట నిల్చి యుండె
అంతట హతశేషు లరిగి కుబేరు
నెంతయుఁ గనుఁగొని యిటునటుఁ దొట్రు 440

హతశేషులు కుబేరునికి భీమునివృత్తాంతమును దెలుపుట

పడి మ్రొక్కి దత్తరపాటున లేచి
గడగడ వడఁకుచుఁ గలఁగి యిట్లనిరి
ఓదేవ వినవయ్య యొకవింత నేఁడు
మోదంబుతో నృపమూర్ధన్యుఁ డొకఁడు
చనుదెంచి బలములఁ జంపి జాంబీరుఁ 445
దనిమి యోధులఁగూల్చి తోయజప్రతతిఁ
గొనిపోవుచున్నాఁడు గురుశక్తి మెరసి

యని సారె సారెకు నదలుచుఁ దెలుప
విని ధనాధీశుండు విస్మయమొంది
కనుఁగవ మిణుగుర్లు గ్రమ్మ నిట్లనియెఁ.
వింటిరే! యిటువంటివింత లెందైన!
కంటిరే! యెవరైన గణకతో మున్ను
విన్నకన్నదిగాదు వివరించిచూడ!
కిన్నరగంధర్వగీర్వాణసిద్ధ
పన్నగదైత్యపాలకులైన 4
నన్నుఁ జెన్కఁగ లేరు నరుఁ డొక్కఁడంట!
దేవతాభూమి కేతెంచినాఁడంట!
కావరంబున యోధగణములఁ గూల్చి
గొనకొని కమలము ల్గొని చనె నంట;
కనఁగ నీవార్త నిక్కం బనఁదగునె! 46
యని బిట్టుగా నట్టహాసంబుచేసి
ఘనయక్షనాథులఁ గనుఁగొన నపుడు
నలు వగ్గలించి యానలకూబరుండు

లిగె నా కిది కన్నె కయ్యం బటంచు[1]
ొలువుచావడినుండి గుప్పున దుమికి 465
లనొప్పఁ దండ్రికి వలగొని మ్రొక్కి
యింతటి పనికి యక్షేశ్వర నీవు
చింతిల్ల నేటికి సెల విమ్ము నాకు
చని దేవర యనుజ్ఞ జనపతిఁ బట్టి
గొనివత్తు నిపుడె నీకొల్వులోపలికి 470
మలసి నాతోఁ గొంత మార్కొనె నేని
చలమునఁ గలనిలోఁ జక్కఁగావింతు
నన విని ధననాథుఁ డగుగాక యనుచు
వినుతధైర్యౌదార్యవిక్రమాన్వితుని
జాంగలు రావించి సకలసైన్యముల 475

### నలకూబరుఁడు యుద్ధమునకు వెడలుట

బొంగుచుఁ బిలిపించి భూషాదు లొసఁగి

---

1. a కలిగె నా కిది వేగ కయ్యం బటంచు
కొలువుచావిడినుంచి గుప్పున దుమికి; (చ)
b కలిగె నా కిది... న్నెకయ్యం బటంచు
కొలువుచావడినుంచి గుప్పున దుమికి (క)

నలకూబరునిఁ జూపి నయవాక్యసరణి
చెలఁగి వేమరు జెప్పి సెల విచ్చుటయును;
నెంతయుఁ గెరలి యక్షేశనందనుఁడు
వింతఁగా రణభేరి వేయించి వేడ్క
నరుణవస్త్రంబులు నరుణభూషణము
లరుణమాల్యంబులు నరుణగంధములు
ధరియించి చండమార్తాండసంకాశ
నిరుపమమాణిక్యనికరసంఖచిత
ధగధగద్ధగిత నిస్తంద్రప్రదీప్తి
నగణితంబై మించు నరదంబు నెక్కి
తన చెలికాండ్రెల్లఁ దగ నలుగడల
ఘనరథారూఢులై ఖర్వము ల్నడుప
నెలమితో గిన్నరు లిరువది గోట్లు
చలమునఁ గెరలి విచ్చలవిడిఁ జనఁగ
యక్షులు పదికోటు లరువదిలక్ష
లక్షీణసాహసులై యేగుదేర
గంధర్వవరులైదు ఖర్వము లొప్పెదలి
బంధురస్ఫూర్తి వెంబడిఁ జనుదేర

రువడి గరుడులు పదియారుకోట్లు 495
రణి గంపింప నుద్దండత నడువ
నుజు లిర్వదికోట్లు దర్పము ల్మెరసి
రిసి కయ్యమునకు గేరుచు నడువ
వరచతుర్దంతు లిర్వది రెండు లక్ష
లురుమదారూఢి మహోద్వృత్తి గదలి 500
కాటుకకొండల కరణి శోభిల్ల
మేటి కరు లెక్కమీరి యేతేర
జవనసైంధవముల సంఖ్యలు మించి
భువి తల్లడిల్ల నద్భుతముగా నేగ
విలసిల్లు కయ్యంపు వేడ్క బెక్కండ్రు 505
మలయుచు యక్షకుమారకు ల్నడువ
పదరుచు మొనల నేర్పరచుచు లక్ష
పదివేలు సేనాధిపతులువే జనఁగ
గొడుగులు పడగలు కోటులు మించి
కడువడి వెనువెంట గ్రమ్ముకురాఁగ 510
గంభీర భేరికా కాహళధ్వనులు
కుంభినీగగనము ఘూర్ణిల్లి నిండ

కరదీపమణిదీపకాంతులు దిశల
పరువడి గడుపట్టపగలుగావింప
చెలఁగి ముత్తైదువ శ్సేసలు జల్లి
యలవడ గెలిచి రమ్మనుచు దీవింప
వలనొప్ప తనదు లావణ్యవైఖరులు
నలువొంద యక్షకన్యాసమూహంబు
గని సౌధవీథులఁగదలనియట్టి
కనకపుఁబొమ్మల గతి నిల్చి చూడ
ఘనబలోద్దండవిక్రమవైభవములఁ
జనుదెంచుచున్న యాసమయంబునందు

## తూర్పు తెల్లవారుట

తనవచ్చురాక మార్తాండుండు వేగఁ
దనబాంధవులకెల్లఁ దగఁదెల్పు మనుచు
ననిచిన రయమున నరుదెంచు దూత
యనఁగ శుక్రుఁడు దోఁచె నతికళాస్ఫూర్తి
పనుపడ పద్మినీపరిణయంబునకు
దినరాజు వేడ్కనే తెంచు నవ్వేళ

మీఱ నుదయాచలంబనుభవ్య
లసితకల్యాణవేదికయందు 530
నపురి నడుదు నిం పెసఁగంగ నిల్వ
రమొంద వెలివల్వ తెరయో యనంగ
లవడ సకలజనానంద మగుచుఁ
లుపు మీఱంగ తూర్పున తెల్లవారె

## సూర్యోదయము

అలరుచు నాసమయమున భాస్కరుఁడు 535
మలయక నేతెంచు మార్గంబునందు
ధీరత నెదిరి మందేహాదిదైత్య
వీరులఁబోరిలో విశిఖజాలముల
నలుకచే ఖండింప నప్పుడు దుముకు
గళగళద్రక్తసంఘాతం బనంగ 540
సరభసప్రతిభల జను దెంచి పంచ
శరుఁడు ముల్లోకము ల్సాధించివచ్చి
వేవేగ శుకపికవీరసైన్యముల
రావించి తగుననురాగంబుతోడ

నందంద్ధ రావించి యలరు వేడుకల
విందులు గావించి వెస మది(గోరి
బలుబింబముల నవపల్లవప్రతతి
నెలమితో రాశి బోయించెనో యన(గ
పసుపడ నరుణప్రభావైభవముల(
గనుపించె నుదయరాగంబు తూర్పునను 555
ఏపున( జెలరేగి యింద్రజాలికు(డు
రూపించి సమయ గారుడవిద్యవా(డు
సురలెల్ల భావించి చూచి మెచ్చ(గను
హరిహాయ! బహుపరాకని హెచ్చరించి
రంగు మీరంగ నెత్తిగ( గాగినట్టి
బంగరుగుండ్లను బరువడి మ్రింగి
నడుము వే సులిబెట్టి నాలుక సాచి
మెడ గొంత నిక్కించి మిక్కిలి గొంతు
సరసుచు జేతుల( జప్పట లిడుచు
మరల( దెప్పించి విస్మయముగా నగుచు, 560
చెల(గుచు మునిపండ్లచే( గొంత నిల్పి
యొలమితో నింగికి యెగనూపె నన(గ

సముదగ్రకరసహస్రప్రభాజాల
మమరఁగా నుదయించె నబ్జబాంధవుఁడు

### ఘటోత్కచుఁడు ద్రౌపదీసహితుఁడై ధర్మరాజుకడ కేగుట.

అనఘాత్మ వినవయ్య యంతలి సత్కథను 565
ననుఁబొంద తొలినాఁడె యాఘటోత్కచుఁడు
బొదలుచు పాంచాలపుత్త్రిఁ దోడ్కొనుచు
బదరికావనము నిబ్బరమునఁ జేరి
యమసుతాదులకు సాష్టాంగంబు లెరఁగి
క్రమమొప్పఁ గాంచనకమల మిచ్చుటయుఁ 570
బరమహర్షంబున బాండవాగ్రజుఁడు
పరికించి సంతోషభరితుఁడై యుండె
ప్రేమ నందరి జూచి భీము నేనుండు
లేమికి బెగడి నల్దిక్కులుఁ జూచి

### ధర్మజుఁడు భీమసేనుఁ డేడయని యడుగుట

కాంచనాబ్జముఁ జూచి కలఁగుచున్న 575
పాంచాలిమోము తప్పక చూచి పలికె

చెలువరో మే మెంతఁ జెప్పిన వినక
చలపోరి కాననసంచారమునకుఁ
దొలగక భీముని దోడ నేఁగితివి
తెలిసె మీరంద ఱే తెంచితి రిటకు 58(

కరుణాంబునిధి రాని కారణ మేమి?
పరువడి నతని నే పనికిఁ బంచితివి?
అదె నాభుజాదండ మదరుచున్నదియు;
తుద లేక కన్నీరు దుముకుచున్నదియు;
ఇనుఁడు తేజము దక్కి యినుపబిల్లవలె 585

గనుపించుచున్నాఁడు కడలనుత్పాత
ములు దోఁచుచున్నవి పొలతి నిక్కంబు
బలుకుమటన్న నాపాంచాలతనయ
కలఁగుచుఁ దెలికన్నుఁగవ నశ్రు లొలుకఁ
దల వాంచి ధర్మనందనున కిట్లనియె. 59)

ద్రౌపది భీమునివృత్తాంతము ధర్మజుతోఁ జెప్పుట

జననాథ మీయాజ్ఞ జను దెంచి ఘోర
వనమధ్యమున వాయువశమున వచ్చి

యీకమలము వ్రాలె నిది చూచి నేను
నీమూర్తి తమ్ముని నీరజమ్ములకుఁ
బనిచితి చనియె నాబలశౌర్యధనుఁడు; 595
అనఘ న న్నిటకుఁ బొ మ్మనిన వచ్చితిని!
అనిన చింతించి యాయమతనూభవుఁడు

## ధర్మతనయ ఘటోత్కచుల సంభాషణలు

ఘనశౌర్యనిధి ఘటోత్కచుఁ జూచి పలికె.
దనుజాధినాథ మీతండ్రి దానొంటిఁ
జనుచుండ యక్షరాక్షససిద్ధసాధ్య 600
గరుడగంధర్వశేఖరు లెల్లరయుడల
జరియింతు రివ్వని సౌవర్ణజలజ
ములు దెచ్చు టేరీతి! మోస మే మగునొ!
ఎలమి నచ్చుటఁ గావ లెవ్వ రున్నారొ!
తలఁకెద మీయయ్య తడ వాలసించె 605
కలహంబు బహుళంబుగాఁ గల్గె నేమొ!
అచ్చటి కరిగి నీ వామేలువార్తఁ
దెచ్చిన నామది దిగులు దీరెడిని

అని యానతిచ్చిన యమసూతిమోము
గనుఁగొని యాఘటోత్కచుఁ డిట్లు పలికె 61
పరమపావనమూర్తి బంధురకీర్తి
గురుకటాక్షనిరీక్ష కురుకులాధ్యక్ష
చెలువొంద మీపాదసేవఁ జేయుచును
గొలిచి నే నుండఁగాఁ గొంకు మీకేల?
కందర్పుఁ గన్నయ్య కమలలోచనుఁడు 615
ఇందిరారమణుఁ డహీశతల్పకుఁడు
భవరోగవైద్యుఁ డాపద్బాంధవుండు
రవికోటితేజుఁ డార్తశరణ్యమూర్తి
మదనగోపాలుండు మనపాలఁ గలుగఁ
బెదరి పల్కఁగ నేమి పృథ్వీతలేంద్ర! 620
అరయంగ యుష్మదయావీక్షణములు
నెరవజ్రకవచంబు నీతమ్ములకును;
నొనర నీసన్నిధి నున్నవారలను
జెనకఁగా శక్తుఁడె శితికంఠుఁడైన?
అవనీశ నీమ్రోది ననుమానమైన 625
పవనజు చెంతకుఁ బనుపు పోయెదను

ఎదిరి ముల్లోకంబు లేతెంచెనేని
అదలింతు నేనె మాయయ్యకుఁ జూప
నను గారవించుచు నాతల్లి మెచ్చ
కనకాంబుజములందు గలవింత లెల్ల 630
సిరులొందఁ గొని భీమసేనునిఁగూడి
పరతెంతు నని వేగఁ బయన మౌ నపుడు

## నారదాగమనము

పొలుపొంద నిద్దంపుభూతి మైఁ బూసి
కలితమౌ జప మాలికయుఁ గేలఁ దాల్చి
తళుకైన బెళుకు బెత్తము చేతఁ బూని 635
విలసిల్లు పెన్జడ లీవ్రపున వ్రాల
సరిగమపదనిస స్వరములఁ బెంచి
వెరవొప్ప ఘనదండవీణె మీటుచును
హరి నమో నారాయణాయ యన్మంత్ర
మురవడి సారెకు నుగ్గడింపుచును 640
శారద నీహార పాటీరహార
తారకామందార తారాచలేంద్ర

శారదాశారద శర సుధాసార
సారవర్ణుఁడు దేవసంయమీంద్రుండు
చనుదెంచుటయుఁ గాంచి శమననందనుఁడు 645
వినయంబుతో మ్రొక్కి వేడ్కఁ బూజించి
నలువంద నుచితాసనంబున నునుప
నలరి ధర్మజుఁ జూచి యమ్మౌని పలికె
వసుధాతలాధీశ! వాయునందనుఁడు
మసలక కుసుమకోమలికోర్కెఁదీర్పఁ 650

సారదుఁడు ధర్మజునకు భీమనలకూబర యుద్ధము
సంగతిని దెల్పి సహాయముసేయఁ బొమ్మనిచెప్పుట

గమలంబులకు నేగి కాననభూమి
నమితమోదంబున నంజనీతనయుఁ
గనుఁగొని యతనిచేఁ గమలంబు లున్న
యునికి నెల్ల నెఱింగి యొగి నేఁగుదెంచి
వనజాకరం బున్న వనవీథియందు 655
దనుజగంధర్వులఁ దార్కొని పోరి
యుక్కుమీరిన నెఱ యోధులఁ గూల్చి

తక్కినబలములఁ దర్పంబు లణఁచి
కయ్యంబునకుఁ జాల కాలుద్రువ్వుచును
నయ్యెడ నున్న హాఁ డనిలనందనుఁడు; 660
ఎలమి చారులవల్ల నిది యొల్లఁ దెలిసి
నలకూబరుండు సైన్యంబులతోడ
నడచె నాతనిమీఁద నలు వగ్గలించి
తడయక నీవు నీ తనుజాలతోడ
ననుజాలతోడ నీయబ్జాక్షితోడ 665
మునులతో విప్రసమూహంబుతోడఁ
జనఁదగు; మీర లిచ్చట నిల్వఁ జెల్ల
దని పల్కి త్రిదశమహాముని జనియె
శమననందనుఁ డంత సంతాపమంది
యమరారి కులనాథు నానసాబ్జంబుఁ 670
గనుఁగొని యిట్లను గటకటఁ బడుచు
దనుజేంద్ర వేగమే తరలఁగావలయు
నలకూబరుఁడు వాయునందనుమీఁద
మలసి పోరక మున్నె మన మేఁగఁ దగును.
అనిపల్కి నంత నా యసురనాయకుఁడు 675

### ఘటోత్కచుఁడు తండ్రిసహాయార్థ మరుగుట

జనకుల నల్వుర జలజాతముఖిని
ధారుణీసురల రథంబున నునిచి
వీరాగ్రగణ్యుల వేర్వేఱఁ బిలిచి
బలములతోఁ గూడ బారులు దీర్చి
నలుదిక్కుల నమర్చి నరపతి మెచ్చ 680
తనసరి చెలికాండ్ర దైతేయపతుల
మొనచేసి బలిమిగా ముందఱ నిల్పి
రణభయంకరు లగురథికులతోడ
ప్రణుతి కెక్కిన మూలబలములతోడ
ననుపమ హేమరథారూఢుఁ డగుచు 685
వెనుక దా నిలిచి పృథ్వీమండలంబు
గ్రక్కతిలంగ దిగ్గజములు మ్రొగ్గ
గ్రక్కునఁ గదలె రాక్షసకులేశ్వరుఁడు
చనుమార్గమున రథచక్రఘాతముల
ఘనదైత్యబలపాదఘట్టనంబులను 690
హరిఖురాహతుల వేదండప్రచండ
చరణోద్ధతంబుల శైలముల్ ఘోర

కాంతారములు నేలఁ గలసి మాయంగ
నంత మహోద్వృత్తి నరుగుచుండఁగను;

నారదుఁడు కరిపురమునకుఁ బోవుట

అలరు వేడుకల కయ్యెడిండితపసి 695
పొలుపొందు హస్తినాపురి కరుదెంచి
గురుకృప గాంగేయ గురుసుతకర్ణ
గురుబలాఢ్యులుతోడ గొలువున్నయట్టి
కురుపతియెదుట గ్రక్కున నిల్చుటయును
ధరణీశుఁ డప్పుడు తమ్ములు దాను 700
నెదురేఁగి పూజించి హితభక్తి మ్రొక్కి
ముదమున మణిపీఠమునఁ దగ నుంచి
మునినాథ యేపని పూని వచ్చితిరి
నను దయఁ బ్రోఁచి యానతి యియ్యవలయు
నన విని కౌరవాధ్యక్షుని మోము 705
గనుఁగొని యిట్లను గలహాభోజనుఁడు;

నారదుఁడు భీమునివృత్తాంతము, ధర్మరాజాదులు సాయము వెడలుటయు, నాదిగాఁగలసంగతులు దెల్పుట.

అలకాధిపతి సేన కనిలసూనునకు

గలనైన నెఱుఁగని కయ్యంబు గలిగె
నావార్త విని భూసురావళితోడ
పావనశీలయౌ పాంచాలితోడ 710
తక్కక కవలును ధర్మనందనుఁడు
పొక్కుచు నిదె యిదె పోవుచున్నారు
సమరభీకరుఁడు నిశ్శంకుఁ డర్జునుఁడు
అమరేంద్రుపురి కేఁగె నతఁడు రాఁడాయె;
మింతుకెక్కిన యోధమండలిచేత 715
నింతకు పవనుజుం డేమెయి నగునొ!
రొట్టిపీరునకైన నిద్దరి కోకఁడు
కట్టిన గోరియయుఁ గాదె భూపాల;
యనిలజు నిడిపించి యఖిలదిక్కులను
వినుతకీర్తుల నించు వీరాగ్రగణ్యు 720
లన్నదమ్ములలో నలుక లెన్నైన
నున్నను బరసేనను దరింపఁదగవు;
ధర నీడులేని భూతలపతి నీవు
నెరయోధు లున్నారు నీసమ్ముఖమునను
దెలిపితి నున్నంతఁ దేటగా నీకు; 725

దలఁపఁ దల్లికి లేని దయ దాది కేల ?
ననుచు దిగ్గున లేచి యమరేంద్ర పురికిఁ
జనుదెంచె దేవతాసంయమీశ్వరుఁడు
కురురాజు తనమదిఁ గొంత యుప్పొంగి
పరగ యోధులకెల్ల పయనము ల్సెప్పి 730
కొలువు చాలించి దిగ్గున లేచి నగుచు
జలజాప్తసుతుని హస్తంబుఁ జేపట్టి
రయమున నొకయంతరంగస్థలమునఁ
బ్రియముతోఁ గూర్చుండి భీమఫల్గునుల
సమధిక సాహస సత్వము ల్దలఁచి 735
కమలాప్తనందనుఁ గనుఁగొని పలికె
నోవీరశేఖర! యోధాధిరాధేయ!
యీవేళ మనకోర్కెలెల్ల నీడేరె!

## దుర్యోధనాదుల దుర్మంత్రము

నెలకొన్న కంటిలో నెరసులువోలె
విలసిల్లు నిశ్శంక విక్రమాన్వితుల 740
భీమార్జునులఁ గన్న భీతి వాటిల్లు

మా మదిలో ననుమానంబు దీర
ధరణిపై భీముండు ధననాథు నెదిరి
దుర మొనరించినఁ ద్రుంగుట నిజము;
కొలఁదిర్చవలె నని గోరుచుండఁగను 745
లలిమీర కాకతాళీన్యాయమయ్యె;
నర్జునుం డొకఁ డున్న నావావస్థలిని
నిర్జింపఁగా వచ్చు నిజసేనఁ గూడి
తడయక మన మేఁగి ధర్మజుఁ గవలఁ
బడనేసి పాంచాలిఁ బట్టి తేవలయు 750
నని పల్క విని క్రోధుఁడై నరనాథుఁ
గనుఁగొని గద్దించి కర్ణుఁ డి ట్లనియె.
మేలయ్య కురురాజ! మెచ్చితి నిన్ను!
స్థూల సూక్ష్మంబుల సుళు వెఱుంగుదువు
బలమరి బ్రాహ్మణపల్లియఁ జేరి 755
తలచెడి యిండిండ్లు తప్పక తిరిగి
తిరిపమెత్తుక తిని ధీరత్వ ముడిగి,
పరదేశులై గుళ్ళపంచల మొఱఁగి[1]

1. పరదేశులై గుళ్ళపంచల మ్రుడిగి (క. చ)

బాములపడి పేదబాపలై యున్న
భీమార్జునుల నొకపెద్దఁ జేసెదవు 760
సరకుసేయక నాదుసాహస ప్రతిభ
గుఱిమేరగలవాఁడు గొలువఁడు నిన్ను
గళవికల్గా నిండ్లు గాల్చు నవ్వేళ
నొక పేదవాఁడైన నొడిగి తా నున్నె!
పోనాడి యాయుధముల దోచునపుడు 765
శూరత్వ మున్నను జూపకుండుదురె!
కొలువులో నిల్లాలి కోక లూడ్చినను
దలపడరె బంటుతనము గల్గినను!
నుల్లముల్ భేదిల్ల నుదిరించి పురము
వెళ్లగా ద్రొబ్బించు వేళల నయిన 770
నొక్కింత జెనకక యుందురే యకట!
మక్కువ చెడి దొడ్డమలలోనఁ జేరి
గతిమాలి యున్న యా కష్టమానవుల
ప్రతిభ లెన్నెదవు నాబాహాబలంబు
దెలిసియు నొక్కింత దెలియవు నీవు; 775
కలఁగెడివాఁడ విక్కడ నిల్వు మీవు;

సెల విమ్ము నరనాథ శేఖర నాకు
కలికి వీనులవిందుగా విందు వధిప
నరభీము లేల పద్మాక్షులు లోకంబు
లరుదెంచెనేని చక్కాడివై చెదను; 780
దలపడి గవలను ధర్మజుం డనిమి
బలువేగ పాంచాలి బట్టి తెచ్చెదను;
నావిని రారాజు నగుచు నేతెంచి
వేవేగ రాధేయు వెస గౌఁగిలించి
నర భీము లన నెంత నాయన్న నీకు!, 785
హరిహర బ్రహ్మాదు లైన సమంబె!,
తిరమొంద నీమది తెలియంగవలసె.
వెరువక నే నంటి వీరాగ్రగణ్య!,
మలయ కినేరము ల్మన్నించు! మనుచు,
వెలయంగ నొకకొన్ని వినయము ల్సేసి, 790
భూషించి, నవరత్నభూషాదు లొసఁగి,
భీషణంబుగ రణభేరి వేయించె.

## దుర్యోధనుఁడు సైన్యములతో బదరికా వనమున కరుగుట

సకలసన్నాహము ల్సవరించి దిశలు
గకవిక ల్గాఁగ శంఖములు పూరించి,
హితులు బంధులు భ్రాతలేంద్రు లేతేర, 795
నతులిత ద్రోణభీష్మాదులు నడువ,
తతశక్తి నూర్గురు తమ్ములు నడువ,
నతులితాటోపులై యాత్మజు ల్నడువ,
వితతనానావాద్యవిభవవైఖరులఁ
జతురంగవాహినీ సహితుఁడై గదలె. 800
ఇంద్రునిఁ బోలె నాగేంద్రకేతనుఁడు
సాంద్రవైభవ మహోత్సాహియై వెడలి
వడి నేగి బదరికావనమున కరిగి

## పాండవు లందు లేకుండుట

తడయక పాండునందనుల శోధించి
యెవ్వరు లేమి వా రేఁగినజాడ 805
దవ్వుగాఁ గదలి మార్తాండనందనుని

తనయుల హితుల బాంధవుల సోదరుల
గనుఁగొని చేఁజూపి కడిమి యిట్లనియె
ఇదె యిదె పోయెద రిపుడు పాండవులు
కొదకక వెన్నంటి కూడ నేతెంచి 810
శమనతనూజునిఁ జక్కుఁ గావించి
క్రమమున నకులుని ఖండించివైచి
సమరాంగణంబున సహదేవుఁ దునిమి
రమణీయగుణధామ, రామాభిరామ
అలికులవేణి రక్తాంభోజపాణి 815
సలలితమృదుపాణి సైకతశ్రోణి
కాంచనసుమనాస, కౌముదీహాస
పాంచాలపుత్త్రిని బట్టి తెమ్మనిన
కౌరవాధిపుమోము గనుఁగొని కనలి
భోరున నరదంబు బోనిచ్చి యతనిఁ 820
గూడ నేతెంచి సక్రోధుఁడై మండి
కేడించి చూచి గాంగేయుఁ డిట్లనియె

### భీష్ముఁడు దుర్యోధనునకు హితము చెప్పుట

గురుతైన యీమహా ఘోరపాపములు [1]
కురురాజ! నిను గట్టి కుడుపకపోవు!
మంచివాఁడవువోలె మలసి యేతెంచి [2] 825
వంచక యిటువంటి కుటిలముల్ మేలె?
పమ్మి శత్రుఁడవై పగఁ దీర్పవచ్చు
నమ్మిన జెరచుట న్యాయమ్ముగాదు [3]
ఈరేడుజగములు నీచేటుబుద్ధి
వారక దలచినవారికే హాని 830
పరికించి చూచిన పాండుతనూజు
లరుదైనసాహసుల్ హరి కృప గలదు
వారితోఁ బోర నెవ్వారికి శక్యంబు!
నేరని యీపను ల్నీతి గాదన్న
యిందరిలోఁ బెద్ద లెవరు లేరైరె 835

1. గురుతైన యీమహాఘోరపాపాలు. (క)
2. మంచివాడవువోలె మలసి యేతెంచి. (ట)
3. నమ్మించి చెరచుట న్యాయంబుగాదు (1378)

యందురు జనులు మాయపకీర్తిఁ బాపు
కడిమిచే మాబుద్ధి గాదంటివేని
యడరు దుష్టచతుష్టయంబును గూడి[1]
పొలియుసేన లటంచుఁ బుల్ల డా విరిచి[2]
యొలమితో[8] జేతికి నిచ్చు నవ్వేళ[3] 84

## కర్ణగాంగేయ సంవాదము

కెరలి కర్ణుండు గాంగేయుని దిక్కు
మరలి పావకు లీల మండి యి ట్లనియె
గంగాతనూభవ కటకటా యిట్టి
వెంగలిపలుకులు వెస పల్కఁదగునె!
అందఱికిని దాతవై యున్న యట్టి 84
మందె మేళంబున మము సద్దఁగొనక
ప్రల్లదంబులు పల్కి ప్రభువుసన్నిధిని
జెల్లించుకొంటివి చేగాచినాఁడ

1. యడరి దుష్ట చతుష్టయంబునుగూడి (4491)
2. పొలియుంసేన లటంచు పుడక డా విరచి (చ)
3. ధొలమి మీరఁగఁ జేతి కిచ్చె నావేళ (4491)

మితిలేనియట్టి స్వామి ద్రోహు లగుట
హితశత్రు లగుట మి మ్మెఱుఁగమే యన్న 850

పాండవు లన నెంత! పద్మాక్షుఁ డెంత!
దండింతు నాహవస్థలి నిల్చి రేని
చేరి మీ శోకబుద్ధి చెప్పెద వినుఁడు
ధారుణీధవుని చెంతల రంతు మాని
మేరతో నుండిన మీసిగ్గు దక్కు 855

క్రూరులై నేరని కూఁతలు గూసి
యదరు గల్పించియు హాస్యముల్ నెరపి
కొదువ లెన్నుచుఁ గేరి గ్రుడ్డెఱ్ఱఁజేసి
వీక్షించి యాపాండవేయులఁ బొగడి
పక్షపాతంబులు పలికితి రేని 860

గురుఁడును గృపుఁడును గురుపుత్త్రుఁ డీవు
నరిది దుష్టచతుష్టయంబు నాచేత
జెడుట నిక్కువ మని చేచాచి చాటి
కడిమి మీరఁగ బల్కి గద్దించుటయును
కురురాజు వీక్షించి గురుసూనుఁ డనియె 865

కురురాజ గురుసూనుల సంభాషణము

ధరణీశ నీయెడ తప్పేమి లేదు
నలువంద కమలాప్తనందనుం డనెడి
పలుకొంటె చేరిన పాప మొక్కటియె?
ఇన్నరాధము పల్కు లిచ్చగించుటకు
నిన్నుంచి యిది యొక్క నేరంబు గలిగ 870
మెలఁగుచు నీపాలిమృత్యువై చేరి
సొలవక నాసలఁ జూపి నమ్మించి[1]
శంకింప కిటు నిన్నుఁ జంపింతు ననుచు
గ్రంకణం బిదె చేతఁ గట్టి యున్నాఁడు
అదిగాక రాధేయు ననువెల్ల వినుము; 875
కదలని నెరబంటుకై వడి వదలి
కదనంబునకు నిన్నుఁ గదియించి మీఁద
పదపడి కార్యంబు పైకొననేని
యనిలోన నిను డించి యరుగు వేగంబె;
మన మెఱుంగమె! కర్ణు మగతనంబెల్ల 880

1. తొలఁగక యుండినఁ దోర్బలంబునను (1378)

వరుస నీసామ్రాజ్యవైభవంబునకుఁ
గెరలితోఁచిన ధూమకేతు వర్కజుఁడు
నలువంద దుర్యోచనలు మాని వారి[1]
గలసి సహాయంబు గమ్ము వేవేగ
జననాథ మీబుద్ధి సరిపోవ దేని 885
యినతనూజునిఁగూడి యీసేన లడఁగు
నసఁ దోఁక ద్రొక్కిన యహిరాజులీల
ఘనరోషచిత్తుఁడై కర్ణుఁ డిట్లనియె

కర్ణ గురుసూనుల సంవాదము

ముది ముది దప్పిన ముదుకఁ డటంచు
వదరినఁ గాచితి వాహినీసుతుని 890
బాపఁడ వీవు నీపని యన నెంత;
భూపతి వినుచుండఁ బొంగెద విప్రుడు[2]
కోపించి నిన్నంటి గూల్పక యున్న
నాపంత మేటికి ననుఁ జూడు మనుచుఁ

---

1. నలువంద యీపుచ్చనలు మాని వారి
గలసి సహాయంబు గమ్ము వేవేగ (క)
2. భూపతి వినుచుండఁ బొక్కెద విప్రుడు (2421)

గరమున బెడిదంపు ఖడ్గ మంకించి 895
గురుతనూభవునిపై గురుశక్తి నడచె
కనలి యశ్వత్థామ కర్ణునిమీఁద
ఘనకరవాలంబు గైకొని కెరలి
యరదంబు దుమికి చయ్యన నేగుదేర
గురుఁడుఁ గౌరవరాజు గొబ్బున నరిగి 900
కర మర్థి నెడసొచ్చి ఘనుల నిర్వురను
నరికట్టి వారించి ననునయింపుచును

ద్రోణుఁడు దుర్యోధనుఁడు వారి నిద్దఱిని వారించుట

బరువడి నలుగడల్ భావించి చూచి
గురుఁ డిటులను నృపకుంజరుఁ గాంచి
నరవర కంటివే నాచేతిదిక్కు 905

ద్రోణుఁడు దుర్యోధనునితోఁ బ్రసంగించుట, అతఁడు చెప్పినహితము

వరధూమకేతువువలె మిన్నుముట్టి
గాఢవిస్ఫూర్తులు గనుపట్టెనదిగో
రూఢిగా గండభేరుండ ధ్వజంబు

వాఁడెపో భీముని వరనందనుండు
వాఁడి మించిన మహా వరబలాధికుఁడు 910
అరిది ఘటోత్కచుం డరుదెంచె నింక
హరిహర బ్రహ్మాల కైన శక్యంబె!
యీకర్ణుసాహసం బెంతైనఁ గలదు!
చేకొని యొకబుద్ధి చెప్పెద వినుము
ఎవరైనఁ దనబల్మి యెదుటి బల్మియును 915
వివరించి చూడక వేగిరపడిన
మనుజేంద్ర మోసమౌ మానుము కినుక
చెనకిరో ని న్నేమి చేసిరో వారు
వారితో నీ కింత వైర మేమిటికి ?
ఘోరరాక్షసులతోఁ గూడి యున్నారు 920
గరిమెతో బంధువర్గములు వీరారు
వరుసతోఁ బురిఁ జేరవలసితి రేని
పడుచుబుద్ధులు మాని పాండవేయులకుఁ
గడిమి సహాయంబు గండు వేవేగ;
అది సరిపోదేని యవనీతలేంద్ర! 925
కదలు శీఘ్రింబునఁ గరిపురంబునకు

మనము వచ్చినయట్టి మర్మము ల్విని
నిను సాగనీయఁడు నిర్జరాహితుఁడు;
అన విని కోపించి యాచార్యమోముఁ
గనుఁగొని యిట్లను గమలాప్తసుతుఁడు. 93(

పరమాన్న మొబ్బట్లు పప్పు బూరెలును

కర్ణుఁడు ద్రోణుని దూషించుట

బరువంపుశిఖరులు పచ్చళ్లు తేనె
లొరపైనకూరలు నూరగాయలును
బరకాళిపెరుఁగుతోఁ బరిపూర్ణములుగ
బారణ ల్గావింపఁ బ్రౌఢులు గాని 93

మీరిన పనులకు మీ కెంత దవ్వు!
అధికు నల్పునిఁజేయ నల్పమానవుని
అధికునిగాఁజేయ నటునిటుఁ బొరల
విరిపోటుఁ గల్పింప వికలము ల్సేయ
బిరుదువాక్యము లాడ బెక్కులు ప్రేల 94(

వేలారువిధముల వివతులఁ బొగడ
నేలిన పతికార్య మెంతయుఁ జెరుప

హా రె సమర్థులు! మిము నెర నమ్మి
ధారుణీపతి వచ్చెఁ దా వెఱ్ఱిగాఁడె!
కొంటుసుద్దులు చేరి గూయనేగాని 945
బంటుపంతము లేల బాపనయ్యలకు!
అదె ఘటోత్కచుఁ డని యడరు గల్పింప
బెదరునే కర్ణుఁడు! ప్రేల నేమిటికి!
మొనమాట లనిన భీష్ముని గుండె లవియ
విను నీతనూజుండు వికలంబు నొంద 950
నీవు సిగ్గువహింపఁ గృపుఁడు భేదిల్ల
గోవిందుఁ డెందము గొందల మంద
కరుణ పాండవులపైఁ గలవారి కెల్లఁ
దిరవిర హృదయముల్ ప్రీలి బెగ్గిల్లఁ
గలపడి శకునినందనుని ఖండించి 955
మలసిన మాద్రికుమారులఁ జంపి
తెగువ ఘటోత్కచుఁ దెగటార్చుచున్న
నగరె! మీ రందఱు నను జూచి నపుడె
మన విని కృపుఁడు మార్తాండనందనుని

కర్ణకృపాచార్య సంవాదము

గనుఁగొని డగ్గరి గద్దించి పలికె. 9

మేలు! మేలురా! కర్ణ! మేదినీరమణుఁ
డాలించి వినుచుండ నాడినఁ జెల్లె
వదరెదు ద్రౌపదీపతులకు నీకు
మది నెంచఁగా హస్తిమశకాంతరంబు;
వారి యేవురిలోన వాసవతనయుఁ 96
డీరేడుజగముల నెనలేని మేటి;
అరయంగ నీకు దైత్యాధీశునకును
మరి తృణ మేరుసమానంబు లగుట;
నిరవొంద భీముని నెంచ నేమిటికి?
నరయ హిడింబ బకాసురు ల్మొదలు 9
హరిపుత్త్రుబలిమికి యంత్రమత్స్యంబు
నరుదైన చిత్రసేనాదులు సాక్షి
పాండునందనులతోఁ బగఁ గొనుటెల్ల
గొండతోఁ దగరు డీకొనునట్లు గాదె;
ఎందైన ఘనులచొప్పెఱుఁగంగరాదు
పందలకే పెద్ద బారెడునోరు

మాయురే! నినువంటిమగఁటిమి బంటు
ఈయోధవరులలో నెవ్వారు లేరు!
మీ దెఱుంగవు పద్ధమీరినపనులు
గాదన్నవారలఁ గరువఁ బోయెదవు! 980
కలఁగవు సి గ్గెఱుంగవు మొక్కఁ దెచ్చి
వలసి పైఁబెట్టిన వైఖరి నీవు
తలపెట్టి పరువెత్తఁ దలఁచుకొన్నాఁడ
విల నీకు వగచు వా రెవ్వారు లేరు
నీపల్కు నెరనమ్మి నిక్కువ మనెడి 985
భూపతి కొకయింత బొక్కెద విపుడు?
నెలవైన మాబుద్ధి నీ వేల వినెదు
చెలఁగి దైత్యుఁడె బుద్ధిఁ జెప్పెడు నీకు
కలఁకపుట్టెడిని నిక్కంబుఁ బల్కినను
నిలుకడగా నీత నేరనివారి 990
గంగమ్మ కొనిపోవుగాని మాకేల!
అంగరాజ్యాధిప యరుగు పొ మ్మనిన

కర్ణుఁడు కృపునిపై కురుకుట

నొదిరి కోపించి మహోగ్రుఁడై కర్ణుఁ

దుదుటునఁ గృపునిపై గురికి ఖడ్గంబు
ఝుళిపించి వేయ నశ్వత్థామ గినిసి 99
తళతళ మనుగదాదండంబు బూని

## అశ్వత్థామ కర్ణుని శిరము మోదుట

వాలు చూర్ణముచేసి వనజాప్తసుతుని
ఫాలంబు ప్రయ్యలై పగుల మోదుటయు
బెడిదంపుమూర్ఛల బెట్టుగా ధాత్రిఁ
బడి లేచి యినజుండు ప్రళయమార్తాండ 1000
సదృశుఁడై పేర్చి యాచార్యనందనుని
గొద్దుకక నడిరొమ్ము గుప్పునఁ బొడువ
నది దాకి గురుసూనుఁ డర్కనందనుని
గుదికిలఁ బడద్రోచి గుండియ ల్పగులఁ
బిడికిటఁ బొడిచిన భేదిల్ల కతఁడు 10

## కర్ణ అశ్వత్థామల యుద్ధము

తడయక చంగున దాటి వేరొక్క
కరవాలు కేడెంబు గైకొని నడచె
కురువీరు లద్రువ గగ్గోలుగా నార్చి

మడిదంపు పలక రయంబునఁ బూని
నడతెంచె యాచార్యనందనుం డపుడు; 1010
తడఁబడి శౌర్యంబు దప్పె నటంచుఁ
దొడిబడి నరదంబు దుమికి యేతెంచి
నరపతి యిరువురనడుమ డాఁ నిలిచి
గురునందనునకు మ్రొక్కుచు మ స్తరించి[1]
గరిమతోఁ గర్ణుని గౌఁగిటఁ జేర్చి 1015

దుర్యోధనుఁడు వారిని వారించుట

సరసోక్తులను వారి సమ్మతిపఱచి
పలుమరు గర్ణుని భావించి చూచి
పలికె నెయ్యంబుతో ఫణికేతనుండు
ఇదియేమి రాధేయ యేల పోరెదవు
పదుగురు గా దన్నపని సేయఁదగదు 1020
విహితం బెఱుంగవు వినుము నాబుద్ధి
బహుజనద్వేషంబు భావ్యంబు గాదు

1. గురునందనునకు...క్కుచు కు స్తరించి (క)
2. గురుసుతునకు మ్రొక్కి కోపంబు మాన్చి (చ)

తనర నీ వేఁగి శాత్రవులఁ గెల్చినను
మనపెద్ద లెల్లను మనలోని వారె
అటుగాక వే రొక్కతైన నీపుణ్య 102
లటువలె గావలె ననియెడివారె
ఈమహాత్ములమాట లెన్నైనఁ గలవు
నామాట మీఱకు నాయన్న నీవు;
అని బుద్ధిచెప్పిన యటువలె కర్ణు
ననుజులసుతులసేనాధినాయకులఁ 10[illegible]
గనుగీటుటయు మహీకాంతునిబుద్ధి
విననికైవడిఁ గురువిభు ధిక్కరించి
ధనువులు మ్రోయించి తమకము ల్మించి
ఘనవాహినులతోడఁ గదలి రెంతయును;
మచ్చరంబున మదోన్మత్తులై కెరలి 103

### ఘటోత్కచుఁడు ధర్మజునితోఁ గౌరవులరాక నెఱింగించుట

విచ్చలవిడి కురువీరపుంగవులు
వచ్చు నగ్గలిక భూవరుల మోహరము

లచ్చెరుగొని చూచి యనురాగ మొంది
శౌర్యవిస్ఫూర్తి రాక్షసచక్రవర్తి
తూర్యము లుప్పొంగించి దోశ్శక్తి మించి 1040
భేరులు మ్రోయించి పృథివి గంపింప
దారుణసింహనాదములు చేయించి
దండిబారుల నెల్లఁ దగ నేర్పరించి
పాండవేయులచెంత భద్రము ల్చేసి
బలువడి దక్కిన బలముల నెల్ల 1045
నెలగోలుగావించి హెచ్చి క్రోధించి
తనరార ధర్మనందనునకు మ్రొక్కి
జననాథ కురువీరసైన్యంబు గెరలి
ప్రాకటంబుగ సప్తపాథోధు లెలమి
యేకార్ణవంబుగ నేతెంచులీల 1050
కొలదీర జగడంబుఁ గోరి వచ్చెదరు
తలకక మీఁకూర్మితనయుని కిపుడె
సెలవిమ్ము కరిపురి చేర్చి వచ్చెదను
తొలఁగక నిల్చినఁ దునిమి వైచెదను
నావిని ధర్మనందనుఁడు చింతించి 1055

భావించి కౌరవబలము వీక్షించి
దిటము దొలంగించి తెగువ చాలించి

## ధర్మజుని భయసంతాపములు

కటకట పడి ఘటోత్కచున కిట్లనియె
దనుజాధినాథ యెంతంటికార్య మొదవె
ధనపతిచే వాయుతనయుండు చిక్కె 10
మనము దుర్యోధన మండలేంద్రునకు
ననిలోనఁ జిక్కితి మయ్య కుమార
అక్కటా నిల్చి పోరాడఁగా నోప
మెక్కడఁ జనఁగల మెవ్వఁడు దిక్కు
చండబలోద్దండసాహసాంకుండు 10
గాండీవి వచ్చినఁ గాచుగా మనల
కవ్వడిదక్క యీ కౌరవావళుల
నెవ్వరు గెల్వలే రిధరాస్థలిని
కూరిమి చెక్కిలి గొట్టితే పాలు
గారెడుబాలవు గదవన్న నీవు 107
గురు భీష్మ కృప కర్ణ గురుతనూభవులు

సురలతోఁ బోరి మెచ్చులు గన్నవారు
ధార్తరాష్ట్రులు సోమదత్త బాహ్లికులు
వార్త కెక్కిన శౌర్యవరబలాధికులు
శకుని భూరిశ్రవ సైంధవాదులును 1075
మకరాంకవైరితో మార్కొనఁ గలరు
పరువడి నిటువంటి బలియురతోడ
నరుదైన సకలయోధావళితోడ
నేరీతిఁ బోరెద వెట్లు గెల్చెదవు
వీరాగ్రగణ్య యేవిధ మింక ననిన? 1080

— { ఘటోత్కచుఁడు ధర్మరాజునకు ధైర్యముఁ జెప్పుట } —

మేనెల్ల నిక్కించి మీసము ల్దిద్ది
పూని పెల్లుగ నార్చి భుజములు సరచి
ధారుణీపతిమోముఁ దప్పక చూచి
ఈరీతి చింతింప నేలయ్య మీకు
అక్షీణబలశాలి యావాసుసుతుఁడు 108౨
యతుల ఖండించి యరుదెంచు నిపుడె

దుర్జను లగువీరిఁ దునుము పోఁదరుమ
నర్జనుం డేల? యోధరాధీశచంద్ర
కురుబలంబుల నెల్లఁ గూల్చి నే నిపుడె
మెరువడి నీచేత మెచ్చు లందెదను 109
వలనొప్ప నే చిన్నవాఁడను మీకు
కలనిలో రిపులకు గాలమృత్యువను
ఈకురుబల మెంత! యెల్లలోకంబు
లేకమై వచ్చిన నేగెల్తు నిపుడె!
కలనిలోఁ జంపక గౌరవాధిపుల 109
బలిమిచే పట్టుగ బట్టుకవచ్చి
కడిమి మీపాదపంకజములచెంత
బడవైవకున్న మీపట్టిని గాను;
ననుఁ జూడుమని సింహనాదముచేసి
జననాథు ననుమతిఁ జయ్యనఁ గదలి 11
తనసైన్యములకెల్లఁ దగఁజేయి చూపి
కనలుచుఁ గలనికిఁ గదియించుటయును
ఆయెడ దనుజసైన్యము లేపుమీరి
కో యని దిశలు గగ్గోలుగా నార్చి

గుములైన హరిణంపుగుంపులమీఁద 1105
గమకించి దుముకు సింగములచందమునఁ
గురుబలంబుల నెల్ల గుంపులు చెరచి
వరుసతోఁ జిందరవందర ల్చేసి
పదియు నిర్వదియు నేఁబది నూరు వేయు
పదివేలమందిని బట్టి యొక్కరుని 1110
గిటగిట కోరలు గీటించి తలలు
పటుకు పటుక్కన పగులంగ గొరికి
తుటుములౌ హయములఁ ద్రొక్కి వేదండ
ఘటలశిరంబులు కబళించి నమలి
వీరసేనలమీఁద వెగదండ నురికి 1115
పేరెము ల్బారించి ప్రేవులు దూరి
గళములు గరచి రక్తము లూర్పువిడక
గళగళఁ ద్రావి బెగ్గడిలంగఁ ద్రేల్చి
జుట్టున మెదడులు జుఱ్ఱి మదించి
గుట్టుగుట్టున రొప్పి గుండెలు నమలి 1120
కనుబొమ్మ ల్ముడివెట్టి గద్దించి గదిమి
ధనువులు విరిచి సాధనములు పెట్టు

చేసి ఛత్రంబులు చించి ధ్వజంబు
లాసించకుండ బోకార్చి శంఖములు
పూరించి బెట్టుగా బొబ్బలువెట్టి 1125
భేరులు మ్రోయించి భీతి పుట్టించి
పగటున చతురంగబలములఁ దరమి
పొగరెక్కి యటు బోకు పోకుఁ డటంచు
వెన్నంటి యరికట్టి వికలము ల్సేసి
మిన్ను పిట్టలుపార మెరిసి యార్చినను 1130
కావు కావు మటంచు గర్ణుఁ డున్నెడకు
వేవేగ గౌరవవీరసైన్యములు
పరతెంచుటయుఁ గాంచి, పావనిపట్టి
శరశరాసనములు సంధించి నిగుడి

కురుపాండవుల యుద్ధము

తక్కక కర్ణునిఁ దా విజృంభించి 1135
పెక్కుబాణంబుల భేదించి పలికె
మాయయ్యలకు నీకు మాయనిపగలు
పాయని క్రోధముల్ బలసి యుండఁగను

గనుపడు వేళల గౌరవకోట్ల
దునుమాడి ధర్మపుత్త్రునిచేత ధరణి 1140
నేలింతు నని మది నేఁగోరుచుండ
నేల వచ్చితి రిఁక నెందుఁ జొచ్చెదరు
రవిసుత నినుఁ జంపి రారాజుఁ ద్రుంచి
కవిసి దుశ్శాసను ఖండించి శకుని
దునుమాడి తక్కిన దొరల మర్దించి 1145
ఘనవైభవంబులఁ గరిపురి కరిగి
గట్టిగా పాండవాగ్రణికి నే నిపుడె
పట్టంబు గట్టుదుఁ బటుశక్తి మెరసి
అనితనయరదంబు నంటగాఁదోలి
ఘనశిలీముఖములు కర్ణునిమీఁదఁ 1150
గురిపించి పడగలు గొడుగులు సించి
వరధనుర్బాణముల్ వ్రయ్యలుచేసి
యరదంబు సారథి హరులఁ జెండాడి
కరవాలమును పల్క కవచంబు దునిమి[1]

1 కరవాలమును పల్క కవ్వంబు దునిమి (ట)

పరువడి శకుని వెంపరలాడి గదిమి 1155
వరయోధవర్యుల వరుస ఖండించి
యెగి దుస్ససేనుని యొడలెల్ల నడచి
తెగి విజృంభించుధైర్యుని గాంచి
వేఱొకరథ మెక్కి విల్లొండు దాల్చి
ధీరత నెదిరి రాధేయుఁ డిట్లనియె 1160
ఓరి నిశాచర యుబ్బంగ నేల
శూరతచే నెందు చొచ్చిన నిన్ను
మడియించి ధర్మజు మర్దించి కవలఁ
బడనేసి పాంచాలిఁ బట్టుకపోదు
నని నారసంబుల నతనివి ల్దునిమి 1165
ఘనతరధ్వజము చీకాకు గావించి
గోనకొని యరదంబు గూల్చి దైతేయు
తనువెల్ల జర్ఝరితంబు గావించి
బలముల శరపరంపరల జక్కాడి
తలపడి రథికులతలలు ఖండించి 1170
కవల నారింట నాగ్రహమున నొంచి
కవిసి ధర్మజుమీఁద గమకించుటయును;

అలుకరెట్టించి యాయవనీశ్వరుండు
ప్రళయకాలాంతక ప్రతిమానుఁ డగుచు
పృథివి భేదిల నార్చి పేర్చి మాణిక్య 1175
రథమొప్ప నెక్కి బల్ రథికులఁ జంపి
రవిసుతుఁ దాకి నారాచజాలముల
కవచంబు విలు తురంగముల సారథిని
చెలరేఁగి యింతింత చిద్రుపలు చేసి
మలసి యొక్కమ్మున మకుటంబుఁ గూల్చి 1180
యెక్కెడునరదంబు లెత్తెడువిండ్లు
చెక్కలు గావించి శిరములు నఱికి
సాయకప్రతతిచే జళుకు పుట్టించి
కాయంబు జల్లెడగండ్లు సేయుటయు;
కలగి రాధేయుఁడు కౌరవాధిపుని 1185
బలమున్నయెడకు నిబ్బరమున బెగడి
తలవీడ బార నత్తఱి దైత్యవిభుఁడు
నిలునిలు మని యార్చి నిగుడి వెన్నంటి
యినసుత వాఁడె ని న్నేలినవాఁడు
గొనకొని నినుఁ గాచుకొనుగాని పిలువు 1190

తలఁప నేవేళ మంత్రములు బోధించు
చెలి వీవు గాపాడఁ జెల్లదె నిన్ను
మీరాజు బెగడ మా మేదినీశ్వరుఁడు
గారవింపఁగ నిన్ను ఖండింతు ననుచు
భాసిల్లు నొకదివ్యబాణంబు దొడిగి 1195
యేసిన మూర్ఛిల్లి యిలఁ ద్రెళ్లె నతఁడు
ప్రకటించి కర్ణుని పాటెల్లఁ జూచి
శకుని దుశ్శాసనుల్ సైన్యంబుతోడ
రథిపేరుగల మహారథికులతోడ
వహికెక్కు నెరయోధవర్యులతోడ 1200
దనుజాధినాథు నెంతయుఁ జుట్టుముట్టి
సునిశితాస్త్రంబుల సోన ముంచుటయుఁ
గనుఁగొని యాఘటోత్కచుఁ డుక్కుమీరి
ఘనతరదివ్యమార్గణజాలవృష్టి
గురియించి బలము గగ్గోలుగా సతికి 1205
కరిహరిరథయోధగణములఁ ద్రుంచి
చేరి యొక్కట దుస్ససేను మర్దించి
ధారుణి నతిరథోత్తములఁ జక్కాడి

వీరాధివీరహాంవీరులఁ జంపి
కౌరవాధిపునిపై గమకించుటయును; 1210
అవనీశుసోదరు లరువదిమువ్వు
రవిరళధృతి నడ్డమై నిల్చుటయును;
వారినందఱఁ గూల్చి వడి నేఁగుదేర
ధారుణీనాథునందనులు పెక్కండ్రు
గ్రక్కున నెడసొచ్చి గదిసి పోరుటయు; 1215
నక్కుమారులనెల్ల నవలీలఁ దునిమి
సమరాంగణమున మూర్ఛలఁ బడియున్న
ద్యుమణితనూభవ దుశ్శాసనులను
కడువడి శిరములు కబళించిపట్టి
బెడిదంపుఖడ్గంబుఁ బెరికి బెట్టార్చి 1220
కడిమితో గంఠముల్ ఖండింపఁబూని
తడయక మదిలోన దండ్రుల బ్రతిన
దలఁచి యంతట వారితలలు మన్నించి
నలువొంద నొకయోజనప్రమాణంబు
భోరున ద్రిప్పి నంభోవీథి వైచి 1225
కౌరవాధిపుమోముఁ గనుఁగొని పలికె

క్రూరాత్మ! దుర్మార్గ! కుటిలమానసుఁడ!
వీరె నీతమ్ములు వీరె నీసుతులు
వాఁడె నీయనుజుఁడు వాఁడె కర్ణుండు
పోఁడిమి జముఁజేరఁ బోవుచున్నారు; 1230
గొనకొని విడిపించుకొని పోదు రమ్ము;
జననాథ నీసాహసంబుఁ జూచెదను
అలిగి వీరలఁ జంపునప్పుడుగాక
ఎలమితో నీశౌర్య మెపుడు చూపెదవు
చెలరేఁగి నీవు వచ్చిన పని యేమి? 1235
యులుకుపట్టక నూరకుండుట యేమి?
యీఁకలుపాత్మకు లీల్గినఁ జేరి
నీకు దుర్మంత్రముల్ నేర్పువా రెవరు?
ఇటువంటిచెలికాని నెడఁబాసి రాజ్య
మెటువలె నేలెద వీబ్రదు కేల? 1240
మావారి మును బలుమాయలఁ గెలుచు
క్రీవసంగరమున గెలుపుమీ నన్ను
మున్ను నీ దుర్గుణంబులు చాల విందు
నన్నించి యెంత శాంతగుణంబు గలిగె!

దురమున నను డాసి తొడరలేవేని 1245
కరిపురిపై యాస గదలించి చనుము;
అనుచు నుల్లాసంబు లారాజు నాడి
వనజాప్తసుతుని భూవరుసహోదరుని
ఇలఖీదఁబడిరేని యిల్లుదు రనుచు
నులుకుచుఁ బట్టి వేఱొకచోట నునిచి 1250
శకునిపై దూరి నిశాతబాణముల
వికలంబుచేసిన వెన్నిచ్చుటయును
ఘాతచే నదలించి గర్జించి గోర్చు
నీతిగా దిది నీకు నృపతి చూడంగ
పోదువా? వెన్నిచ్చి పోరిలో నిటుల! 1255
నేదిక్కు నేఁగిన నేల పోనిత్తు
ఆనాఁడు బలుసహాయంబు చేసితివి
యీనాఁడు నినుఁ జావ నిచ్చునె రాజు!
అదిగాక నీకు మేనల్లుఁడు విభుఁడు
కదనంబులో నిన్నుఁ గావఁగా లేఁడె! 1260
పిలువుము యోధుల పిలువు రారాజు
దలపుము నీకులదైవంబు నిపుడె

ఖ్యాతికి నెక్కు సంగరభూమిగాని
తాతయ్య మాయజూదంబులు గావు;
వలనొప్ప ఘోరాహవస్థలి గాని 1269
చలపట్టి పోర నీచావడి గాదు;
పొలుపొందు ఘవశరంబులుగాని నీవు
పలికిన ట్లనె బడ బాచిక ల్గావు
నలువంద దానవనాయకు ల్గాని
బలుమాయలను బన్న పాండవు ల్గారు; 1270
పోకు పో కిట రొందుఁ బోయిన నిన్ను
చీకాకుపరచక చేగాచి విడువ;
నని పల్కి ఘోరదివ్యాస్త్రంబుఁ దొడిగి
గొనకొని రథముపై గూల నేయుటయు
గనుఁగొని గురుఁడు గంగానందనుండు 1271
కనలి మిక్కిలి ఘటోత్కచునిపై దాకి
విలు ద్రుంచి యరదంబు వికలము ల్చేసి
చలమున హయముల సారథిఁ దునిమి
ఘనతరదివ్యమార్గణములు చొనిపి
దనుజేంద్రు దేహ మంతటను నించుటయును

పవనతనూజునిపట్టి పదునాల్గు
భువనము ల్గలఁగ నద్భుతముగ నార్చి
కాలాంతకుని లీల గద యొక్కచేత
శూలంబు నొకచేత సూటిగాఁ బట్టి
గురుభీష్మకులమీఁదఁ గ్రోధించి గదిమి 1285
వరమంత్రయుతముగా వైచె; వైచుటయు
నవి రెండుచండమార్తాండ తేజముల
వివిధాగ్నిలీలలు విస్ఫులింగములు
గ్రక్కుచు దశదిశల్ గ్రమ్మి యేతేర
మక్కువఁ గాంచి భీష్మద్రోణు లపుడు 1290
గరుడపావకరౌద్రకమలాస్త్రకులిశ
వరుణపన్నగమేఘవాయుబాణములు
నిగుడింప నవి రెల్ల నీఱు గావించి
తెగువ నేతెంచిన దివ్యాయుధములు
గనుఁగొని గురుఁడు గంగానందనుండు 1295
జననాథునోదరు ల్జగతీశ్వరుండు
గురుతనూభవకృపుల్ కుంభినీధవులు
పరువడి భగదత్తబాహ్లీకముఖ్య

లవిరళ దివ్యశస్త్రాస్త్రము ల్గొనుప
నవిరొల్లఁ బొడిసేసి యరుదెంచుటయును; 1300
అదిరొల్లఁ బరికించి యాచార్యుఁ డుదిరి
యిదె మహాప్రళయంబు లేతెంచె నింక
వడి నాయుధంబులు వాహనంబులును
విడిచి కరంబులు వెస ముకుళించి
యెదురుగా నిలిచిన యీసేన లన్ని 1305
బ్రదుకుట నిజము శౌర్యముఁ జూపఁ జెల్ల
దని యెలుగెత్తి సైన్యంబులఁ జాటి
జననాథురథముపైఁ జంగున దాటి
కౌరవాధీశుని కర మప్పళించి
ధారుణి లంఘించి తగ నిల్చుటయును; 1310
చిటిముడివడి యోధశేఖరు లెల్ల
దుటుకున నరదముల్ దుమికిరి సేన
లటువలె గరితురంగాయుధావళులు
పటుగతి విడిచి చొప్పడ నిల్చుటయును
నతిరయంబున సమ్మహాయుధద్వయము 1315
ప్రతిభ నేతెంచి శుంభద్దీప్తి మించి

జ్వాలాతపములీల బలములమీఁద
కీలలు బర్వించి కేడించి మఱలె
దనుజాధినాథుఁ డంతటఁ బోక గెరలి
ఘనరథ మెక్కి సత్కాండాసనంబు 1320
కరమున సంధించి కాండజాలముల
కురురాజుమకుటంబు గూలంగ నేసి
గంగాతనూజు నొక్కట స్రుక్కఁజేసి
సంగరంబున రెంట సైంధవు నొంచి
గురుని మూడింట గగ్గోలు గావించి 1325
గురుసుతు నాల్గింట గుదియఁగా నేసి
దారుణంబుగ భగదత్తు నేనింట
నారింట బాహ్లికు నని దూలనేసి
కృపు నెన్మిదింట భూరిశ్రవు పదింట
నృపుసహోదరుల పూనికల నేనూట 1330
నలుకమై నేసి సైన్యము నుగ్గుచేసి
మలసి యాశకునిపై మరలి క్రోధించి
చలపట్టి రథముపైఁ జంగున దూకి
తలద్రెంప గమనించు తమకంబు గాంచి

యరదంబు నూకి డాయంగ నేతెంచి 1335
కురురాజుఁ గనుఁగొని గురుఁ డిట్లు పలికె;
మనుజేంద్ర యీమేనమామ యవస్థ
దనుజాధినాథు నుద్దండంబు జూఁడు
సాగవు మనసాహసంబు లిచ్చోట
నేగతి నిది మాన్ప నెవ్వరివశము 1340
కోపంబు చాలించి గురుబంధుజనులఁ
గాపాడి నిను నీవ గాచుకొ మ్మింక
చేరి రక్కసునితోఁ జెలిమి వాటించు
పోరాటములు మాని పురి చేరవలయు
పదుచు పాపఁ డటంచుఁ బాటించవలదు 1345
పిడుగు కొంచెంబైన బెడిదంబె గాదె
ఈ నరభోజనాధీశ్వరు నెంచ
నానాటి రావణు నంతటి మేటి
యనిన నంతయు నిశ్చయం బని బెగడి
తనమది చింతించి ధరణీశ్వరుండు 1350
తనయులు హితులు బాంధవులు సోదరులు
ఘనమానవర్యులు గలనఁ గూలుటయు

దనుజనాథుని గెల్వఁ దరముగా దనుచు
మనుజవల్లభుఁడు వేమరు దలంపుచును
మదమున లంఘించి మగటిమి డించి 1355
యుదుటు దొలంగించి యుబ్బు దగ్గించి
యరదంబు దుమికి చయ్యన తలవాంచి
పరువడి నెడ సొచ్చి భళి యని మెచ్చి
కరము కరంబున గబళించిపట్టి
సురవైరి వదనంబు జూచి యి ట్లనిరొ 1360

దుర్యోధనుఁడు ఘటోత్కచునితో సంధి యొనర్చి పాండవులకుసహాయుఁడై పోవుట

అనఘాత్మ మీకు సహాయంబుగాఁగ
జనుదెరచువారితో సాహసం బేల
కాదుగా పాండవకౌరవు లనెడు
భేద మే మున్నది! ప్రేమ నూహింప
వొగి వారు మేము నీ కొక్కట గాదె! 1365
పగవానివలె నెంత పనులు జేసెదవు
కలసి యుద్ధముచేయ కూ మీఁదఁగాక

బోలుపొంద దూరము పోయివచ్చెదవె
చను నింటగెల్చి రచ్చల గెల్వవలయు
ననెడిసాటువ నిజ మాయె మాయన్న 1370
ధనపతిమీఁద యుద్ధమునకు మనము
చనుటకు నీదివ్యశరకౌశలంబు
నీసాహసస్ఫూర్తి నేఁజూడవలసి
మాసైన్యముల నెల్ల మరలింపనైతి
నిన్ను నీశౌర్యంబు నీకౌశలంబుఁ 1375
గన్నులపండువగాఁ జూచినాఁడ
మాయయ్య వాదువు మాయురే! మేలు
నీయంత ఘను లవనీస్థలిఁ గలరె!
యని ఘటోత్కచుఁ దన యక్కునఁ జేర్చి
తనరంగశకునిపైఁ దమకంబు మాన్పి 1380
దనుజవీరునితోడఁ దనసేనతోడఁ
జని ధర్మతనయునిచరణాబ్జములకు
గరిమతో మ్రొక్కిన గని ధర్మసుతుఁడు
వరుసతో దీవించి వారి కందఱికి
సరసలీలల నుపచారము ల్చేసి 1385

ధర ప్రీల శంఖనాదంబు పూరించె
తత్‌శక్తి ధర్మనందను నాజ్ఞఁ బూని
యతివేగ నుభయసైన్యంబులు గదలె
శరజాప్తతనయదుశ్శాసను ల్మార్భ
లరయంగ దెలిసి విహ్వాలచిత్తు లగుచు 1390

మొలకసిగ్గులు మొగంబుల నావహింపఁ
దలలు వంచుకయున్నఁ దగ నిరీక్షించి
గురుసూనుఁ డంత నర్కుని సుతుఁ గాంచి
విరుగుట దిరుగుట వీరుల కెల్లఁ
గలదు నీతరమునఁ గలుగునే కర్ణ[1] 1395

అల ఘటోత్కచుని సాహసముఁ జూచితివి
నెలవుగా మాబుద్ధి నిజమాయె నింక
ములును దాకఁగఁగాని మొగ్గ రెవ్వారు[2]
హాటకంబుగ మించి నాడరా దనెడి

---

1. విరుగడ తిరుగడ వీరులకెల్ల
 గలదు నీతెరగున గల్గెనే కర్ణ (త)
2. ములును దాకినఁగాని ముగ్గ రెవ్వారు (చ)

మాట యొక్కటి గాక మఱియొండు గలదె 1400
పొలుపొందఁగా మించిపోయిన సిగ్గు
తలపోసు కొన్న నెంతయు రాదు వినుము
పెక్కుమాటలు నేర్చి ప్రేలెడువాని
కెక్కడిసిగ్గు నీ కేల చింతింప
పొగరు నుద్దండంబుఁ బుట్టక యుండ 1405
సుగు లడంగించె రతిప్రాణవల్లభుండు
నిలుపుము శాంతంబు నీతిధర్మంబుఁ
దలఁపుమీ యిఁకనైనఁ దలదాకె నంత
అనుచుఁ జిల్లులు వోవ నాడినమాట
లెనయంగ చిలుకులై హృదయంబు గాడి[1] 1410
వెనకముందఱఁ జూచి వికలంబు నొంది
వినియును విననట్లు వెస నేగుటయును

నలకూబరుఁడుయుద్ధమునకు సన్నద్ధుఁడగుట

అక్కడ సకల సైన్యసమేతుఁ డగుచు
జక్కులరాపట్టి చను దెంచుటయును

1. లెనయంగ ములుకులై హృదయంబుగాడి (క. చ

దుర్వార శౌర్యసందోహ ప్రచండ 1415
గర్వితారి మదేభకంఠీరవుండు
భీమబలాఢ్యుండు భీమసేనుండు
భూమి తల్లడమంద భుజగేంద్రుఁ డదర
శారలు ద్రుళ్ల దిక్తటము లల్లాడ
ఘోరున శంఖంబుఁ బూరించుటయును; 1420
తనమది నుప్పొంగి తమకించి ధర్మ
తనయుండు నాగకేతను నిరీక్షించి
అదె విను భీమశంఖారావమహిమ
కదనంబు చాల నగ్గల మయ్యెనే మొ
పదపదం డని చెట్టు పలికిన వేగ 1425

ధర్మరాజు భీమునొద్దకువచ్చుట

గదలి యాభీముని గదియఁగా నేఁగి
తనకు మ్రొక్కిన వాయుతనయుని గ్రుచ్చి
యొనరఁ గౌఁగిటఁ జేర్చి యుప్పొంగె రాజు
పావని యప్పుడా పాంచాలిపుత్త్రి
భావించి సంతోషభరితుఁడై చూచి 1430

యరదంబు డించి నెయ్యమున లాలించి
తరుణికి గమలముల్ దండలు గూర్చి
గురుతుగా నొకకొన్ని కొప్పున నునిచి
మరికొన్ని చిత్రదామములు గూర్చి
కరుణతో నిఖిలాంగకముల సమర్చి 1435

అరవిందముఖినుతు లంగీకరించి
కవల ఘటోత్కచుఁ గౌఁగిట నలమి
కువలయాధిపుఁ డెంతఁ గొలిచియున్నంత

అమరావతిలో నర్జునునకు నారదుఁడు భీమునకును గుబే
రునకును సంభవించిన యుద్ధముసంగతిని దెల్పుట.

తిలకింప నమరావతీపురంబునను
బలుదెఱఁగుల దిశాపతులు గొల్వఁగను 1440
తొలుగక రంభాది తోయజాననలు
నలువున చెలరేఁగి నాట్యము ల్సలుప
నాక గంధర్వ కిన్నర యక్ష గరుడ
రాకేందుముఖులు పరాకులు దెలుప
హాళి మీఱంగ జయంతుఁ డర్జునుఁడు 1445

మ్రొలఁ గూర్చుండి యామోదింపుచుండ
వలనొప్ప బలువైభవంబులతోడఁ
గొలువున్న సురరాజు కొలువులోపలను
నరుని వీక్షించి యానారదమౌని
వెరవొప్ప నందఱు వినఁగ నిట్లనియె 1450
నరనాథ పవమాననందన యక్ష
గరుడ దానవులకుఁ గదనంబు గలిగె
నది విని మీయన్న యనుజులతోడ
మదవతితోడ భీమతనూజుతోడఁ
జనుచున్నఁ గురుపతి చయ్యనఁ గదలి 1455
యనిచేసి పిదప సహాయుఁడై యేఁగె
నలకూబరుండు సేనలఁగూడి వచ్చి
కలహంబుఁ గావింపఁ గదిసి యున్నాఁడు
బలుకయ్య మగుఁగాని పరిపాటి గాదు
అలకాపురము చెంత కరుగు పొమ్మనిన 1460

### అర్జునుఁడు ధర్మరాజాదులకడ కేతెంచుట

నమరేంద్రునకు మ్రొక్కి యాపాండుతనయుఁ

డమితవేగమున రథారూఢుఁ డగుచుఁ
జనుదెంచి సాష్టాంగవిధు లాచరించి
భీమసేనాచార్య భీష్మాదులకును 1465
సామోదమున వందనాదు లమర్చి
తివిరి పెద్దలచేత దీవన లంది
కవలు మ్రొక్కిన వేడుకల గారవించి
యంచితం బగు తనయరదంబుమీఁద
పాంచాలపుత్త్రినిఁ బటుగతి నునిచి 1470
సురపతి యొసఁగిన సుమదామకములు
చిరమణిహారముల్ చిత్రాంబరములు
కరుణతో నొసఁగి వేడ్కల నాదరించి
ధరణీశుచెంతఁ బంతము మీర నిలిచె
ఆసమయంబున యమతనూభవుఁడు 1475
భాసిల్లు కిన్నరపతిసేనఁ జూచి
తమబల మున్నచందము విలోకించి
యమరనదీసూను సాననాబ్జంబుఁ
గనుఁగొని మ్రొక్కి యాశరణాపయోధి
ఘనయక్షరాక్షస గరుడగంధర్వ 1480

బలముల రథికుల బరికింపు మయ్యా
కిల కొట్టుచును దమకించుచున్నారు
మోసము రానీక మున్నె కన్గలిగి
యీసైన్యముల నెల్ల నేర్పాటుసేయు
బలువిడి సేనాధిపతివి నీ వగుచు 1485
నిలిచినకార్యంబు నెరవేలు దేవ;
అన విని గాంగేయుఁ డౌఁగాక యనుచుఁ
దనరారునట్టి పదాతివర్గములఁ
గనుఁగొని మొన నలగోలు గావించి
ఘనయోధవరులఁ జెంగట భద్రపఱచి 1490
హారులను నిరుకోపులందు నమర్చి
కరులను బార్శ్వభాగంబులఁజేర్చి
కరిసైంధవపదాతిగణముల చెంత
సురవైరి గురుసుతార్జునుల నేమించి
వారిచెంగట ద్రోణ వనజాప్తతనయ 1495
భూరిశ్రవుల నద్భుతముగా నునిచి
వారికిఁ బ్రాపుగా వలనొప్పఁ గవల
మూరితి బాహ్లిక మగధుల నునిచి

ధారుణీధవుల మధ్యమ్మున నునిచి
వారక నేగ యోధవరుల నెల్ల 1500
మోప్పైన కాపుల మొన తీర్పరించి
యాపాండవాగ్రణి యావిధం బంత
గనిపించి విజయశంఖంబుఁ బూరించి
ధనువు సారించి సాధనములఁ బూని
పనుపడ సేనాధిపతి తానె యగుచు 1505
మొన నిల్చియుండె తంపురు పెంపు మిగుల
నలకూబరుండు సూనవనాథుబలము
చలరేఁగి యాశ్చర్యదిక్కుఁడై చూచి
చెంగటఁ జేరి మచ్చిక గొల్చియున్న
జాంగలు వదనాంబుజము గాంచి పలికె 1510
అన్న కంటివె దానవాధీశుబలము
లున్నచందంబు నాయోధులతెఱఁగు
గమనించుచున్నారు కదనంబునకును
కములంబునకును నొక్కండు వచ్చి యెంత
పని చేసె నటువంటిబహుయోధవరులు 1515
మొనచేసినారు సముద్రంబువోలె

ఆవీరయోధుల నలఘు తేజంబు
భావింపఁ గన్నులపండు వయ్యెడిని;
మానవులే యని మసలఁగా వలదు
నీ నేర్పుఁ జూచెద నెరయోధవరుల 1520
బలముల సేనాధిపతుల నేర్పఱచి
కలనికి యరిమొనగా నిల్పు మనినఁ
జని సర్వసేనల సమకట్టి నిలిపి
ఘనభేరికాహాళఘంటికారావ
ముల బెట్టుగా మిన్నుముట్ట మ్రోయించి 1525
కలఁగి పద్నాల్గు లోకములు భేదిల్ల
తరుచుగా సింహనాదములు సేయించి
నిరుపమాటోపుఁడై నిఖిలసైన్యముల
పేరైన యోధుల పేరులు వాడి[1]
భోరున కలనికిఁ బురికొల్పుటయును 1530
భీష్మప్రతాపజృంభితశౌర్యధనుఁడు

1 a. పేరైనయోధుల పేరులు చాటి (క)
b. పేరైనయోధుల పేరులఁ జీరి (చ)

భీష్ముఁ డుద్ధతి రణభేరి వేయించి
ఘనసైనికుల నెల్ల కదనంబునకును
గనలుచు వేవేగ గవయించుటయును
నురువడి నీరీతి నుభయబలంబు 1535
లరుదార మార్కొను నాసమయమున
భేరులు దశదిశల్ భేదిల్ల మొరసె
దారుణసింహనాదములు సెలంగె
కరిబృంహితములు వెక్కసముగాఁ గూడె;
హరిహేష లద్భుతంబై నింగి నిండె; 1540
వరరథనేమిరావము లుర్వీఁ బర్వె;
గురుతరకోదండగుణగుణధ్వనులు
వెలసె పరాగంబు వినువీథిఁ గప్పె:
నిల తల్లడం బంది నెలగోలు గవిసె
వీరు వా రని యింత వివరింపరాని 1545
పోరు ఘోరం బయ్యె భూతలాధీశ!
భల్లంబులను మించి పట్టిసంబులను
కెల్లుబ్బ నురికి మిక్కిలి దానిపెద్ద
బల్లెములను గ్రుమ్మి బాకులఁ జిమ్మి

పెల్లుగా గదలచే భేదించి భిండి 1550
వాలమ్ములను గూల్చి వడినేగి ముసల
జాలమ్ములను మోది చక్రసంఘముల
నడుములు ఖండించి నరములు ద్రెంచి
తొడలు భేదించి కుత్తుకలు నుగ్గించి
కరములు ద్రుంచి వక్షములు నూటాడి 1555
సరభసప్రతిభలచలమునఁ గినిసి
పొదలి ఖడ్గాఖడ్గి పోరెడివారు
యెదిరి ముష్టాముష్టి నేసెడివారు;
బాకులచే గ్రుద్ది బరులు ప్రేవులును
చీకాకుఁ గావించి చెండెడివారు; 1560
చూరీలచేకరాచూరీలచేతఁ
జెరిచి చిందరలుగా జేసెడివారు;
కడుమెరుంగుల చివ్వగడలచే బొడిచి
తడయక చెంగున దాటెడివారు;
జిగి పెద్దయీటెలచే గుదుల్గుచ్చి 1565
పగటున దూరము పడఁజిమ్మువారు;
తెగువతో సురియల తగనేసి డాసి

లగువుల దవ్వుగా లంఘించువారు;
చేరి పెద్దకటార్ల చే కొద్ది గ్రుచ్చి
కేరి చివ్వన గుప్పళించెడువారు* 1570
ప్రేలుచు క్రొవ్వాడి పిడెముల నూని
లీలమీఱఁగ చాకళించెడువారు;
భోరున బొడిచినపోటు గండ్లబడి
దూరి యావలదాటి దూసెడువారు;
గుంపులు నొంటిగా గోరించువారు; 1575
గుంపుగా నొక్కని గ్రుమ్మెడువారు;
నివల కవ్వల నుంచి యేతెంచువారు;
నవల కివ్వల నుంచి యరుదెంచువారు;
నాథ పరాకయ్య ననుఁజూడు మనుచు
యోధావళుల మీఁద నురికెడువారు; 1580
తలలు ఖండించి వింతగ నెగవైచి
సెలగో యనుచు నార్చి చేయెత్తువారు
అరుదొంద కల్లిల్లి కార్భటుల్చేసి

* కేరి చివ్వన గుప్పగించెడువారు. (క)

విరిగి పోదువుం దని వెన్నంటువారు
నలకూబరుం డేడి నరపతి యేడి 1585
పొలియింతు మని చొచ్చి పోయెడివారు
నలకూబరుఁడ నేనె నరపతి నేనె
మలసి నిల్వు డటంచు మాఱ్కొనువారు
తేజీల తేజీల ధే యని నూకి
నేజెలచే గ్రుమ్మి నిగుడి వెన్నంటి * 1590
పాటించి రౌతును బల్లంబు హాయము
వేటారుదునెలు గావించి భేదించి
కో యని యార్చి కగ్గోలుగా నరికి
హాయి! బాబు! శబాసు! రని వ్రేలు గరచి
అఱె సివేముస్త్రైదు లరి మురి ద్రుంచి 1595
తుటుములపైఁ జొరఁ దోలు రాహుతులు
గజముల గజముల గజిబిజి గొనఁగ
నిజభుజాబలశక్తి నిగుడి కవ్వించి

---

* *a.* నేజీలచే గ్రుమ్మి నిగుడివెన్నంటి (క)
*b.* నేజలచే గ్రుమ్మి నిగుడివెన్నంటి (చ)

కొమ్ముకత్తుల మొనకొమ్ము లాడించి
యిమ్ముల కురికించి యేపు గల్పించి 1600
హేరాళి జయకాంక్ష లిచ్చలఁ బొదల
వారక పోరు మావంత వర్గములు
పదరుచు హయముల భటులపై నురికి
తుది చాపకట్టుగాఁ ద్రొక్కించువారు;
మొగముల నరుకుల ముదియుచుఁ జొచ్చి ;1605
మొగి హల్లకల్లోలముగ నార్చువారు;
కెల్లుబ్బి హయముల కేడించి తగ్గి
చిల్లాడముల కొద్ది చిమ్మెడువారు;
నూకించి గజముల నొదికల బడఁగఁ
జేకొద్ది జముదాళ్లఁ జెండెడివారు; 1610
తెగువ సామంతులఁ దెగటార్చువార
లగుచు జెన్నొందె మహారణభూమి
అప్పుడు గాంగేయుఁ డమరేంద్రసుతుఁడు
తప్పక చూచి యుద్దండకోపముల
భోరున నరదముల్ బోనిచ్చుటయును 1615
మారుతి ద్రోణుండు మార్తాండసుతుఁడు

శకుని బాహ్లికులు సైంధవకృపులు
నకులుఁడు నాచార్యనందన సోము
దత్తిలు రథము లుద్ధతి బోవ నిచ్చి
మత్తిల్లి బహుఘోరమార్గణంబులను 1620
దురుసుగా నెడలేని తొలుకారువాన
గిరులపై వర్షించుక్రియను బర్వించి
తరమిడి తురగవేదండసంఘముల
గరుడుల యక్షుల గంధర్వవిభుల
నరభోజనులను గిన్నరకులాధిపులు 1625
పురుడింపరాని కింపురుషశేఖరుల
రథికుల దొరల సారథుల మావతుల
రథకేతనచ్ఛత్రరథ్యసంతతుల
ఖండించి దండించి గనెలు గావించి
చెండాడి భేదించి చిద్రుపలు చేసి 1630
సమయించి తెగటార్చి చంపి మర్దించి
తుమురులు గావించి త్రుంచు నవ్వేళ
ఇవి కరు లివి హరు లివి రథావళులు
ఇవి ఛత్రసంఘము లివి కేతనంబు

లివి ముక్కు లివి చెవు లివి మస్తకంబు 1635
లివి పక్క లివి పిక్క లివి భుజాలతిక
లివి హస్తపద్మంబు లివి కాళ్లటంచు
నవయవ భేదంబు లరయంగ రాని
సంగరం బొనరించు జనపాలవరుల
బొంగుచు ధననాథపుత్త్రుండు గాంచి 1640
పారె పారెదు మార్వి సారించి దివ్య
నారాచ మంకించి నయనాంబుజముల
మిన్నుకైన మినుగుర్లు మెండుగా రాల
తన యోధవరులతోఁ దద్దయుఁ బలికె
మాయన్నలార యామానవాధిపులు 1645
సేయుకయ్యములు వీక్షించితి రిపుడు
ఆరూఢి మీరు యక్షాధీశుతోడ
పారె పల్కినప్రతిజ్ఞలు చెల్లవలయు
మసల సామ్రాజ్యపు మానవు ల్గారు
కసిదీర యుద్ధంబు గల దిం దరికిని 1650
ధవళవాహనుఁ డల్లతాళకేతనుఁడు
దివురుచుఁ గెరలి నాదిక్కు చూచెదరు

వారితో నేఁబోరవలయు వేగంబె
ఘోరాజిఁ జేరికి గొనరెంతవారి
రణభూమి తక్కినరథికులతోడ 1655
గణుతింప నని గెల్వఁగాఁదగు మీరు;
అని తనసారథి నదలించుటయును
గనుఁగొని యాచిత్రగాత్రుఁ డిట్లనియె
అనఘాత్మ మానవు లన నెంత నీకు
పసుపులుచేత దిక్పతుల గెల్చితివి 1660
తెలిసి పిచ్చుకలపై దివ్యనారాచ
ములఁ బూనఁ దగవౌనె! మోహనాకార
కనలి కోపింప లోకప్రభుల్గారు
నిను మ్రొచ్చ పనిగల్గెనే నేను గలుగ
మనుజుల దనుజుల మర్దించి వత్తు 1665
ననుఁ జూడు మానవనాథులఁ జూడు
మని పల్కి గంధర్వు లర్వది కోట్లు
కినుకతో నడువ గాంగేయుని డాకె
కరకరకదనభీకరులైన గరుడు
లిరువదికోట్లు వెంపెక్కి యేతేర 1670

చెలఁగి కవ్వడిదాఁకె చిత్రసేనుండు
నలువదికోట్లు పద్మాలుగువేలు
కిన్నరబలముతోఁ గేయూరభుజుఁడు
చె న్నొందఁగా భీమసేనుని దాఁకె
దిశలు ఛేదిల నార్చి తెగి విజృంభించి 1675
దశకోటియతు లుద్దండత నడువ
మణికేతనుఁడు దాఁకె మార్తాండసుతుని
రణభయంకరపరాక్రమ బలాన్వితులు
ఘోరసాహసు లారుకోట్లదై తేయ
వీరులతో పృథ్వి జలింపఁ గదలి 1680
ఘోటకాసురుఁడు దార్కొనియె నాచార్యు
ఘాటిగా బహుచతుర్దంతులతోడ
ననుపమ జయసాహసాంకుఁడై మీరు
కొనియె జయంతుండు గురుతనూభవుని;
ముప్పదికోట్ల కింపురుషులతోడ 1685
నిప్పులు గ్రక్కుచు నిరుపమశూల
ధారియై నిగుడి మార్తాండకేతనుఁడు
ఈరసంబునను బాహ్లికునిఁ దాఁకె;

తక్కిన యట్టియోధులు యోధవరులు
తక్కక దాఁకి యుద్ధము సేయుచుండ 1690
నాసమయంబున నంబుధు ల్గలఁగ
భాసురదశదిశాభాగము ల్వ్రీల
మహితశౌర్యుఁడు హిడింబానందనుండు
బహుభేరి తమ్మటపటహానిస్సాణ
ధాంధణ దంధణ ధణధణంధాన 1695
బంధురారావముల్ పరఁగ మ్రోయించి
అతిబలోద్దండదైత్యాదినాయకులు
హితులు నెచ్చెలికాండ్రనేకులు గొలువ
కరకరి నోరసి సంఖ్యల కెక్కుడైన
కరిసైంధవపదాతిగణములు నడువ 1700
జని మహోద్ధతి యక్షసైన్యంబు దాకి
గనలి దానవకోటి గవియించుటయును;
మేటిరక్కసు లుక్కుమీఱి యయ్యక్ష
కోటుల ఘోరరక్షోబలంబులను
గరుడసైన్యముల జీకాకుగాఁ జంపి 1705
వరుసతో గంధర్వవరులఁ జెండాడి

కిన్నరసేనల గీటణగించి
పన్నుగా వారణప్రతతులఁ దునిమి
పొలుపొందునట్టి కింపురుషులఁగూల్చి
నలకూబరునిమీఁద నడతెంచుటయును 1710

జాంగళుఁ డొనర్చిన యుద్ధము

ఆవేళ జాంగళుం డధికరోషమున
వేవేగఁ జని దైత్యవీరులఁ జూచి
రణదక్షు లగు నతిరథమహారథుల
గణనకుమీఱిన కరితురంగముల
దానవమానవదళములమీఁద 1715
పూనికఁ గదియించి భోరునఁ గదలి
ఘనతూర్యభేరిశంఖములు మ్రోయించి
వనదముల్ గిరులపై వర్షించులీల
చండకాండములచే సకలసైన్యములఁ
జెండాడి చట్టలు చీల్చి గర్జించి 1720
కాండలు దునిమి పక్కలు చక్కుచేసి
గుండెలు నలిచి ముక్కులు చెక్కువైచి

తొడలు పాదంబులు తునియలుచేసి
నడుములు మెడలు భిన్నములు గావించి
మెండైన రథికుల మేదినిఁ గూల్చి 1725
మండలాధీశుల మదము లణంచి
సురవైరిపై నంపసోనలు నించి
ధర ప్రీల సింహనాదములు సేయుటయు,
పరభయభ్రాంతి నిల్వఁగ లేక బెగడి
పరువెత్తెనర దైత్యబలము నల్గడల 1730
కడువేగ తురగసంఘంబులు జరిగె
నెర యోధవర్యులు నీల్గిరి ధరణి;
అలిగి యంతట బోక నాజాంగలుండు
బలువేగ ధారుణీపతులపై నడిచె
కనుఁగొని యాఘటోత్కచుఁ డేపుమీరి 1735
మొనఁజేసి నిజసైన్యములఁ బురికొల్పి
రాకురాకుఁ డటంచు రహి నార్చి పేర్చి
దీకొని నిల్చి గద్దించి పల్కుటయు;
తమకించి మదగజేంద్రములపైఁ బొదలి
గమకించి దుముకు సింగముల చందమున 1740

మొనసి రాక్షససైన్యముల బొట్టుముట్టి
ధనువులు దివ్యసాధనములు గూల్చి
పరువడి గొడుగులు పడగలు డుల్చి
యరదము సారథి హయములు నల్చి
రథచక్రవితతి ధరాస్థలిఁ గూల్చి 1745
రథికశేఖరుల బీరము లణఁగించి
యరిమురి సురవైరి కడ్డమై వచ్చు
నరదైత్యపతుల పద్మాల్గుపద్మముల
బెట్టుగా పీనుంగు పెంటలు చేసి
కట్టల్కతో ఘటోత్కచుమకుటంబు 1750
పొట్టు గావించి నేర్పున విల్లు ద్రుంచి
దిట్టఁడై కవచ మింతంతలు చేసి
హయసారథులతోడ నరదంబుఁ గూల్చి
రయమున జనుదేర రాక్షసేశ్వరుఁడు
వేరొక్కరథ మెక్కి విల్లొండు దాల్చి 1755
నారాచ మొక్కటి నారి సంధించి
సారవైశ్వానరసదృశుఁడై వండి
ధీరుఁడై జాంగలు దిక్కు వీక్షించి

ఓరి యక్షాధమ యొగి నిన్నుఁబట్టి
ఘోరబాణంబులఁ గూల్పక విడువ 1760
నని యార్చి యేసిన నమ్మహాశరము
ఘనరత్నమకుటంబు ఖండించుటయును ;
సురవైరి మఱికొన్ని సునిశితాస్త్రముల
హరులను నరదంబు నవనిపైఁ గూల్చి
సారథి మడియించి చక్రము ల్దుంచి 1765
ఘోరాస్త్రముల మేను గుదిగొన నేసి
యూనిన యరదంబు నొగి నుగ్గుచేసి
పూనిన విం డ్రెల్ల పొట్టు గావించి
కడకతో ఖండించి కాండజాలమును
నడిమికి రెండేసి నఱికి చెండాడి 1770
యతనికి నడ్డమై యరుదెంచునట్టి
శతకోటియక్షుల చక్కు గావించి
పన్నుగా నెడసొచ్చు పదియారుకోట్లు
కిన్నరశ్రేష్ఠుల గీటణఁగించి
మొనసొచ్చి పరతెంచు ముప్పదికోట్లు 1775
ఘనసిద్ధసాధ్యుల గనెలు గావించి

గరుడుల పదికోట్లఁ గరకరి జంపె
పరగగంధర్వులఁ బదికోట్ల దునిమి
వేయుట తొడుగుట లెఱుఁగ రాకుండ
సాయక వృష్టిచే సకలసైన్యముల 1780
గదిమిపారఁగ దోలి గద్దించి యార్చి
యెదు రెవ్వరును లేమి యేచి జాంగలుని
గదిసి మించులు గుల్కు కాండరాజమున
నెద దూర నాటించి యిలఁ గూలనేసి
కనలుచు మొల నున్న ఖడ్గ మంకించి 1785
యొనర కంఠము ద్రెంచ నుంకించుటయును;

### నలకూబరుని యుద్ధము

నలకూబరుండు దానవనాథుఁ గాంచి
యులుకుచు నొకవీతిహోత్రబాణంబు
నారి సంధించి దానవనాథుమీఁద
ప్రారూఢిమంత్రపూర్వకముగా నేయ 1790
ఘనతరవిస్ఫులింగప్రకాండములు
ఘనుపడ దశదిశాభాగము ల్నిండ

రవిసహస్రప్రభాభాసితం బగుచు
పవనజాతనయుపైఁ బరతెంచుటయును
నరుఁ డది గాంచి తా నారాచ మొక్క 1795
వరుణాస్త్రమున ద్రుంచి వైచినఁ గెరలి
నలకూబరుం డింద్రనందనుమీఁద
నలుక రెట్టించి బ్రహ్మాస్త్రంబు సొనిపి
నలువంద వాయుబాణంబు సంధించి
బలుక్రోధమున దైత్యపతి నేయుటయును 1800
సురరాజసూనుండు సురనదీసుతుఁడు
సరగున నాదిత్యశరము వీక్షించి
యవలీల బ్రహ్మనాగాస్త్రజాలముల
నవి రెండు వారింప యక్షేశసుతుఁడు
గంగాతనూజుపై గరుడాంబకంబు 1805
బొంగుచు నరునిపై భూధరాస్త్రంబు
పవననందనుపట్టిపై మేఘశరము
తివిరి పెల్లార్చి గద్దించి యేయుటయుఁ
అరసి భీష్ముండు రౌద్రాస్త్రంబుచేత
గరుడసాయకమును ఖండించి వైచ 1810

కులిశమార్గణముచే గురుతనూభవుఁడు
పొలియించె నప్పు డాభూధరాస్త్రంబు
గంధవాహాశరంబు గాండీవి పూని
కంధరాశుగము వ్రక్కలు సేయుటయును
రూఢిగా బ్రహ్మశిరోనామకంబు 1815
గాఢవిస్ఫూర్తుల గాండీవిమీఁద
ప్రాకట దివ్యనారాయణాస్త్రంబు
భీకరప్రతిభచే భీష్మునిమీఁద
కలితోగ్రచండాంధకారబాణంబు
సొలవక నాచార్యసుతునిపైఁ జొనిపి 1820

### ఘటోత్కచుఁడు గూలుట

చలమున నలిరేగి శక్తి సంధించి,
యలఘుటోత్కచునిపై నలయించి యేసె
వంచింపక కిరీటి వైష్ణవాస్త్రమునఁ
ద్రుంచె నా బ్రహ్మశిరోనామకంబు
నగణితం బైన నారాయణాస్త్రంబు 1825
నిగిడి తచ్ఛరమున నిలిపె భీష్ముండు

హారిదశ్వశరమున నంధకారాస్త్ర
మరుదుగా దునుమాడె నాచార్యసుతుఁడు
గురుఁడు మహాదివ్య ఘోరబాణములు
బరిపిన నవియెల్ల భగ్నము ల్చేసి 1830
కమలభవాండము ల్గలఁగ మార్తాండ
రమణమై చని శక్తి రాక్షసేశ్వరుని
ఫాలంబు దాఁకిన పక్షముల్ విరిగి
శైలంబు గూలిన చందంబు దోఁప
బాలదిండి మూకలు భూతలాధిపులు 1835
గలగి బెగ్గిల ఘటోత్కచుఁ డిలఁద్రెళ్ళె
తనతనూభవుపాటు ధననాథుతనయు
ఘనతరోద్దండవిక్రమశక్తి గాంచి

భీముని యుద్ధము

యనిలతనూభవుం డశ్రుసంఘములు
కనదుగ్రవిస్ఫులింగముల కాండములు 1840
పెనఁగొని కన్నుల బెట్టుగా రాల
ధనువస్త్రచయము రథంబుపై వైచి
నిట్టూర్పు వేడుముల్ నిగిడి యుప్పొంగ

ఘట్టించి యలదండధరుఁడో యనంగ
గిరినుండి యిలకు లంఘించి యేతెంచు 1845
హరికిశోరములీల నరదంబు డుమికి
యదలించి బొదలి కో యని యార్చి పేర్చి
గద కరద్వయమున కబళించి నడచి
చని మహోద్ధతి యక్షసైన్యంబు దాఁకి
మునుమున నెదిరిన మొనల ముట్టాడి 1850
రథికసారథుల ధరాస్థలిఁగూల్చి
యధికవేగంబున నరుదేరఁగాంచి
నలకూబరుఁడు ఘోరనారాచతతుల
చలమున ములుదూర్ప సందు లేకుండ
కాయ మంతయు నించఁగా నవి సడ్డ 1855
సేయక గని భీమసేనుఁ డాఘనుని
రవికోటి సంకాశరమణీయరథము
నవలీల రేణువులై రాల మోదె
అట మున్న రాజరాజాత్మజుం డుదిరి
దుటుకున నరదంబు డుమికి పోనురికి 1860
వేరొక్కరథ మెక్కి వెస జన నదియు

ఘోరగదాహతి గూల్చి మోదుటయుఁ
ధననాథుసూనుఁ డంతకుమున్నె దునికి
చని యొక్కరథ మెక్కి చయ్యన నడువ
ధీరుఁడై భీముఁ డాతేరుపై నురికి 1865
భోరున నొగలంట బొసఁగ సంధించి
గిరగిరఁ ద్రిప్పి మిక్కిలి పైకి నెత్తి
కరకరి భగ్నంబుగా ధాత్రి మోదె
అట మున్నె దాటి యక్షాధీశుపట్టి
పటువేగమున నేగ పవమానసుతుఁడు 1870
ఆర్చుచు నాతని యరదంబుమీఁద
గూర్చుండనీయక గోరించుటయును
యక్షరాక్షసయోధవరు లరువదికోట్ల
యక్షతనయున కడ్డ మేతేర
తమకించి తనగదా దండఘాతమున 1875
నిమిషమాత్రంబున నీరు గావించి
నలకూబరుని మీఁద నడువ నా ఘనుని
జెలికాండ్రదర పది కోట్లు శితసాయకముల
భరపి మార్కొనిన నాబలియుర నెల్ల

ధరఁగూల్చి నడుమ గంధర్వులు వాల్గు 1880
కోటులు గ్రమ్మిన గోరించి మోది
ఘోటకంబులఁ గూల్చి కుంజరఘటలఁ
గరకరి వధియించి గద ద్రిప్పుకొనుచు
వరబలోద్దండుడై వచ్చుచుండఁగను
దనుజుల యక్షగంధర్వులఁ గూల్చి 1885
వనజముల్ గైకొన్నవాఁడితఁ డనుచు
దెప్పరంబైన భీతిని దల్లడిల్లి
చప్పుడుల్ చాలించి చలములు డించి
చతురంగబలము లచ్చట నిల్వ వెరచి
పతి నొప్పగించి నిబ్బరమున నరిగె 1890
అంతట నాకుబేరాత్మజుం డలిగి
పంతంబుతో సార్వభౌముపై నెక్కి
పవనతనూభవుపై గవియింప
గవిసిన నామత్తకరిమీఁద దూరి
పటుగదాహతిని కుంభస్థలం బవియ 1895
వ్రేటువేయఁగ చండవేదండంబు బెగడి*

* నటువ్రేయ చండవేదండంబు బెగడి.

కళవళమంది ఘీంకారము చేసి
తలకి యొక్కించుక దవ్వరుదెంచి
అత్తరి తెలివొంది యాదిగ్గజంబు
మత్తిల్లి భీముపై మరలి యేతెంచి 1900
కరమున గట్టిగాఁ గబళించిపట్టి
చరణముల్ గదియించి చలము రెట్టించి
కొమ్ముల గేడించి కుమ్మిన నతఁడు
పమ్మి తుండంబులోపల నింత వెళికి
జిలిబిలి రావావుచేఁ జిక్కి వెడలి 1905
యలరారు చండమార్తాండుని లీల
దప్పించి మర్లించి ధైర్యంబు మించి
గుప్పున గదకొద్ది గుమ్మి పోనీక
వాల మంకించి యావరణముల్ ద్రిప్పి
వేలారువిధముల వేధలు పెట్టి 1910
పాదముల్ తుండంబు బంధించి ధాత్రి
మీఁద నెంతయు పిల్ల మెరముగా నూకి
దీనత్వ మొందించి దిటము దూలించి
పోనీక సర్వాంగములు గుద్దివైచె

నలకూబరుండు నంతకు మున్నె కలఁగి 1915
తొలగి వేదండంబు దుమికిపో నురికి
గురుదివ్య రథ మెక్కి కోదండ మొకటి
ధరియించి ఘనగుణధ్వని చేసి కదిసి
పరశరాసారముల్ వర్షించుటయును
కరిహరిరథయోధగణములు గ్రమ్మి 1920
అంతట జాంగలుం డతిమూర్ఛఁ దెలిసి
యంతకు గతి నట్టహాసంబు చేసి
పరువడి యేతెంచి పవనజు దాఁకి
సురుచిరాంబకముల సోనలు ముంచె
అడరి నియంతుఁ డత్యంత వేగమున 1925
కడుసార్వభౌముఁ డగ్గరఁ జేర నేఁగి
మస్తకంబు కరంబు మహితాంగకములు
మస్తరించుచు దువ్వి మదము గల్పించి
ధైర్యంబు తమకంబు దర్పం బవార్య
శౌర్యంబు చలము రోషంబు దెప్పించి 1930
పదరుచు గజరాజుపై నెక్కి నిక్కి
కదిసి భీముని మీఁద గవియించుటయును

అంతట నక్షేటి యందఱివిూఁద
వింత కయ్యముచేసి వెస విజృంభించి
మొనలు భేదించి తెంపున పెంపు మించి 1935
ఘనసైనికులఁ గూల్చి గజములఁ బేల్చి
యరదముల్ చెండాడి హరుల నుగ్గాడి
పోరిబోరి కాల్బలంబుల జక్కుచేసి
యోధుల జంపి మహోద్దండశక్తి
సాధనావళుల విచ్చలవిడి ద్రుంచి 1940
కరవాలములఁబట్టి కరులతోఁ గరుల
హరులతో హరుల రయంబున మోఁది
కట్టల్కతో నార్చి కవియవచ్చుటయు
బెట్టుగా నుండి కుబేరనందనుఁడు

## నలకూబరభీమసేనుల సంవాదము

బ్రహ్మాండభాండముల్ పటపట పగుల 1945
బ్రహ్మాస్త్ర మరిపోసి పావని కనియె
ధరణీశ యక్షగంధర్వాదై తేయ
వరుల జూతుముగాని పరబాహుశక్తి

నినువంటి బలశౌర్య నిధిని మే మెందు
గనలేదు వినలేదు ఘనుఁడవు నీవు 1950
నీ సాహసస్ఫూర్తి నీబాహుబలిమి
నీ సముద్దండత నీగదాప్రతిభ
నీ మహాటోపంబు నేఁ జూచినాఁడ
భీమసేనుఁడ నీకు భీముఁడే సాటి
కాక యన్యులయందు గలదె యీ మహిమ 1955
మాకు నిన్ జూచిన మది సంతసిల్లె
గట్టివాఁడవు తల్లిగర్భంబునందు
పుట్టిన నీవలెఁ బుట్టఁగా వలయు
మలసి నిన్ను వధింప మదిఁ దోఁచదయ్యె
కలుగఁడు నినువంటి ఘనుఁడు లోకముల 1960
నరదంబు బాణబాణాసనంబులను
నెరశక్తి జూడంగ నీయందు లేదు
హరిహర బ్రహ్మాదు లటు నిల్వఁజాల
రరుదుగాఁ జూడు బ్రహ్మాస్త్ర మీ శరము
ఇన్నారసంబున నీల్గఁగా వలవ 1965
దన్న నీ వెందైన నరుగుము వేగ

అన విని యిట్లను ననిలనందనుఁడు
ధననాథతనయ యెంతటి బల్మి నాది
నీసాహసం బెంత నే నెంతవాఁడ!
దోసంబు నన్నెంచె ద్రోణుఁ డుండఁగను 1970
గురు కృప కృత వర్మ గురుసుతు లుండ
నరఘటోత్కచ సింధునాథు లుండఁగను
తగిన బాహ్లీక సోమదత్తు లుండఁగను
బాగడొందు భూరిశ్రవుం డుండఁగాను
జగదేకవీరుండు శకుని యుండఁగను 1975
నగణితం బైన మాయన్న యుండఁగను
పరశురాముని గెల్చి ప్రఖ్యాతి గనిన
బిరుదాంకమూర్తి యాభీష్ము డుండఁగను
వన్నె కెక్కిన యోధవర్యు లుండఁగను
న న్నెన్నఁదగునె కిన్నరనాథతనయ 1980
వీరుండ వనుచు నీవే నన్నుఁ బొగడి
పోరిలో వెన్నిచ్చి పొమ్మన్న దగునె!
మొనసినవేళల మొన నిల్వ లేక
వెనుకఁ దీసిన మీరె విక విక నగరె

వల నొప్పఁగా రాచవారము మేము 1985
కలనైన విరుగడ గాన మోయయ్య
తొలఁగక నీసేనతోఁగూడ నిన్ను
కళవళపఱిచి చీకాకుగాఁ దరిమి
పూనిక మీఱ మీపురము గన్గొనక
నే నెందుబోయెద నిటు చూడు మనుచు 1990
కోదకక కాలాంతకునిలీల నార్చి
గద ద్రిప్పుచును మహోగ్రతవచ్చుచుండ
నలకూబరుఁడు వాయునందనుమీఁద
నలుకమై కమలభవాంశుగం బేసె
నేసిన నది పటుహేరాళభాను 1995
భాసురపావక ప్రతిభాసమాన
మగుచు పంకేజభవాండముల్ నిండి
తెగువతోఁగూడి గ్నేతెంచు నవ్వేళ
కని యర్జునుఁడు పంకజభవాస్త్రంబు
ధనువునఁ బూని మంత్రయుతంబుగాఁగ 2000
కడకతో నేసిన ఘనసాయకములు
తడవు బోరాడి యంతట శాంతి బొందె

కూరుతి యప్పుడా మహనీయశరము
ఎరువోవుట నార్చి బెట్టుగా నేసె
నలకూబరునిమీఁద నలు వగ్గలించి 2005
బలమున గవియ నాజాంగలుం డపుడు
ఎడ సొచ్చి యరికట్టి యిషుపరంపరలు
జడివాన గురిసినచందంబు దోఁప
పటుశక్తి నిగుడించె బహుయోధవరుల
భటు లశ్వములు గజపంక్తులు గవిసె 2010
ఆసమయంబున ననిలనందనుఁడు
ఆసైన్యముల నెల్ల నవనిపైఁ గూల్చి
జాంగలునరదంబు జక్కుగా మోది
పొంగుచు ధననాథుపుత్త్రుపైఁ గవిసె
అగ్గలికనువచ్చు నాభీముఁ గాంచి 2015
బెగ్గిల్లె సేనలు భీతిల్లెఁ గరులు
వీరపుంగవులెల్ల వెన్నిచ్చి చనిరి
పారిరి యోధులు పరచె నశ్వములు
పేరైనరథికులు పెంపైనదొరలు
తీరైనచెలికాండ్రు దిక్కుదిక్కులను 2020

చెదరిపోవుట గాంచి చెలఁగి భీముండు
బొదలుచు యక్షేశపుత్త్రుపైఁ గవిసి
గదహస్తయుగమున గట్టిగాఁ బూని
పదరుచు నమ్మహాబలియునిరథము
తొలగిపోనీయక తుమురుసేయుటయు 2025
తలకి యక్షేశనందనుఁ డటమున్న
వెన్నిచ్చి పారిన వెసనంట దరిమి
యన్నరాగ్రజుఁడు మహారౌద్రుఁ డగుచు
గదియ నేతెంచి వెక్కసముగా నార్చి
గదగొని మోదిన కళవళమంది 2030
దంభోళిధారచే ధారుణీధరము
కుంభినిఁ గూలిన కొమరు దీపింపఁ
బెట్టు మూర్ఛిలి లేచి బేర్చి కుబేరు
పట్టి యొక్కరథంబు పైకి లంఘించి
ధనువు సంధించి సాధనములు పూని 2035
యనిలాత్మజునిమీఁద నరుదెంచుటయును
అంతని యంతుఁ డత్యంత వేగమున
నెంతయు నాదిగ్గజేంద్రము నెక్కి

వెస మస్తరించి కవించి నూఁకుటయు
వసుధాతలాధీశు వడువున నేఁగి 2040
తలవాంచి తుండంబు తగసాచి పొడువ
తలకక మారుతి ధైర్యంబు మెరసి
పెలుచ నొక్కింతయు బెళికి యొరైన
తొలఁగనీక గజంబు దుమికి గ్రుమ్ముటయు
అది దప్పి మత్త వేదండకుంభములు 2045
గద కొద్ది జడిపిన గకవిక నొంది
యాలోన తెలివొంది యాదిగ్గజంబు
కీలున మేలున గేడించి మించి
చిమ్మి క్రుమ్మినను ఖచిక్కున నాల్గు
కొమ్ము కత్తులు గాడికొనలు దెల్వొడలి 2050

## భీముఁడు మూర్ఛిలుట

మొనలు చూపిన బెట్టు మూర్ఛిల్లి పవన
తనయుండు రోఁజుచు ధరణిపై వ్రాలె
పవనతనూజుని పాటెల్లఁ జూచి
భువనైకవీరుండు పురుహూతసుతుఁడు

యతని నెచ్చెలికాండ్ర నరువదికోట్ల
శతసాయకంబుల జీకాకుపఱచి
గరుడ కిన్నర యక్ష ఖచరుల నూట
యరువదికోట్ల యోధావళిఁ దునిమి
మునుమున్న మున్నూట ముప్పదికోట్ల 2075
దనుజగంధర్వయోధుల చిక్కుపఱచి
బెడిదంపు పీనుఁగు పెంటలుచేసి
తడయక దేవదత్తంబు పూరించి
యరదంబు రాజరాజాత్మజుమీఁద
పరపుచు పడియున్న పావనిఁ గాంచి 2080
యమరేంద్రనందనుం డడరి శోకించి
క్రమమున గొంత ధైర్యస్వాంతుఁ డగుచు
నరదంబు డిగి యెత్తి యక్కునఁ జేర్చి
తొరగు నెత్తురులు పోదుడిచి హా యనుచు
మోముమోమునఁ జేర్చి మూర్ఛిల్లి తెలిసి 2085
ధీమసంబున నలుదిక్కులు జూచి
యల శ్రీదనందను నదలించి గదిమి
యలవడ కన్నులు నశ్రులు ద్రుముక

పలుమరు వీక్షించి. పాంచాలిచెంత
వలనొప్పఁగా నుంచె వాయునందనుని 2091

## ద్రౌపదిశోకము

పాంచాలపుత్త్రియుఁ బవమానసుతుని
గాంచి శోకించి కన్గవ నీరు నించి
విలపించి విలపించి విధిఁ దలపోసి
తలయూఁచి తలయూఁచి తడఁబడి వగచి
ముప్పిరిగొను పెనుమూర్ఛలఁబొదలి 2099
తెప్పిరి యడలుచు దీనత్వ మొంది
పవననందనుమీఁదఁబడి మోదుకొనుచు
కవగూడి యుసిరికెకాయ లంతేసి
కలితాశ్రుకణములు కన్నులదుముక
నలబింబముల బోలు నధరము ల్వణక 2100
హావీరశేఖర! హాప్రాణనాథ!
హావిక్రమాటోప! హావంశదీప!
హాపాండునందన! హాపుణ్యమూర్తి;
హాపావనచరిత్ర! హాదయాజలధి!

గాని కౌఁగిటఁజేర్చి పొసగ లాలించి 2105
నానావిధముల నయములు పలికి
నయము ల్సేసిన వినక నేనిన్ను
రించితి నెంత పాపము గట్టుకొంటి
ర మొంద నెందైన స్త్రీలకు బుద్ధు
గారపుగా పెడతల నుండుట నిజము 2110
మీఁద నామీఁద నీరజాక్షుండు
నమనచిత్తుఁడై దయదప్పె నేమొ
కొని నాకు నీజీవ మిచ్చితివి
సు నా ప్రాణము నిజముగా నిత్తు
ప్రాణనాథ నే చలపోరినందులకు 2115
ప్రాణహానియు నపఖ్యాతియుఁ గలిగె
వలయాధిపుబుద్ధి కొంత కొంతైనఁ
విఁ జేర్ప కనుభవించితి నింత ఫలము;
తుల దీకొని మారుబలుకుచు మెలఁగు
తులకు బెక్కు మోసములు రాకున్నె! 2120
గనుచు దుఃఖించు నయ్యంభోజముఖిని

### ద్రౌపదిని అర్జునుఁడు ఊఱడించుట

గనుఁగొని లాలించి గాండీవి పలికె
మానినీమణి యనుమానంబు వలదు;
ప్రాణంబు లున్నవి పవనజుమేన
పూనిన బలుమూర్ఛ పొంది యున్నాఁడు; 21
కాని విచారంబు కలనైన లేదు
మీనాక్షి వెరవకు మిక్కిలి యతని
ప్రాణంబునకు నాదు ప్రాణ మిచ్చెదను;
అనుచు దుఃఖము మాన్పి యక్కునఁ జేర్చి
నను జూడు మని సింహనాదము చేసి 21

### నలకూబరార్జునుల సమరము

నలకూబరుని గాంచి నారి మ్రోయించి
తలకొని దేవదత్తంబు పూరించి
యరదంబు దోలించు నాసమయమునను
సురవైరి పడియున్నఁ జూచి యర్జునుఁడు
అక్షుల మిణుగురు లశ్రుసంఘములు 21
నక్షయంబుగ ధాత్రి నవఘళింపఁగను

ధననాథసుతుని క్రోధమున నీక్షించి
తనయుని దనయురస్థలమున నలమి
యరదంబుపై నిడి యలి వేణి తాను
వరుసతో పలవించి వగపు చాలించి 2140
కరకరి నాగనాగల్ గదిసి తార్కొనిన
నరదంబు బోనిచ్చి యర్థేశసుతుని
వివిధాస్త్రతతుల బల్విడి ముంచుటయును;
అవియెల్ల దునిమి యర్థాధీశుపట్టి
యమితసాయకముల యర్జునుమీఁద 2145
గమకించి వేయ నాగాండీవధన్వి
యలఘు బాణంబుల నవి దునుమాడి
నలకూబరుని నూట నాటనేయుటయు;
నలకూబరుఁడు దొడ్డ నారసంబునను
నలిరేగి నరుని కంఠము దూరనేసె 2150
అదియెల్లఁ బరికించి యమతనూభవుఁడు
బెదరి యశ్రువులొలుక భీష్మునిఁ జూచి
కనుగొంటివే దేవ గాండీవి తెఱఁగు
మన భీమసేనుండు మారుతిసుతుఁడు

పడినచందము మన బలములు తోట్రు 2155
పడెడిమార్గము, యక్షపతిపుత్త్రు చెలువు
నించుక దడసిన నింద్రజుం డొరగు
పాంచాలనందన పనియేమి యగునొ!
అని పల్కి వగనొంది యందరి జూచి
తనరథం బురవడి దరిమిన యపుడు 2160
శమనుజు వెనువెంట శతవర్మ శకుని
యమరనదీసూనుఁ డర్కనందనుఁడు
గురుఁడును గృపుఁడును గురుతనూభవుఁడు
కురురాజు నకులుండు కురుకుమారులును
పొగడొందు భగదత్తభూరిశ్రవులును 2165
తగ దుస్ససేన సైంధవబాహ్లికులును
కడు సహదేవమాగధసోమదత్తు
లెడపక తమమీఁద నెదిరించి పోరు
నెరయోధవర్యుల నిమిషమాత్రమున
బరువడి ఖండించి బలములఁ గొల్చి 2170
రాజశేఖరశౌర్య రజితాద్రిధైర్య
రాజరాజతనూజ రమణీయతేజ

దానవ మానవదళము లవ్వేళ
నానాదిశల సింహనాదము ల్నించి
యనువొంద కిల్లిల్లి శార్భటుల్చేసి
చని గరుడ యక్ష రాక్షసబలంబులను
గొరవి ద్రిప్పినమాడ్కి గోరించుటయును 219
తిరుగలేనట్టి భీతిని దల్లడిల్లి
దెసచెడి దగదొట్టి దీనులై బెగడి
కుసిదప్పి బలుస్రుక్కి కూఁతలు మాని
యలకాపురము త్రోవ నరుగు సైన్యముల
నలకూబరుఁడు గాంచి నగుచు నిట్లనియె 220
ఏలపోయెద రన్న యిపుడు నాలావు
పాలించి కనుఁగొని పోదురుగాని
నిలు నిలుఁడని చాల నిగుడి వెన్దగిలి
బలముల మరలించి భయముల మాన్పి
నలువొంద నూతననవరత్నఖచిత 221
సలలిత కాంచనస్యందనం బెక్కి
మహానీయ తరచండ మార్తాండకోటి
విహిత తేజోవార్య వీర్యుఁడై కెరలి

ధననాథసూనుఁ డుద్దండవేగమున
ఘనరోషచిత్తుఁడై గదియ నవ్వేళ; 2210
కనుఁగొని చెలరేగి గాండీవధన్వి
ఘనదివ్యశరవృష్టిఁ గప్పిన నతఁడు
నవియెల్ల ఖాడిఖాడిగా రాలనేసె;
నవశిలీముఖముల నరుని గప్పుటయు
విలయాంతకునిలీల విజయుఁ డవ్వేళ 2215
నలకూబరుని దొడ్డనారసంబులను
పరువడి గరిదూరి పారనేయుటయు
వెరగొంది మూర్ఛిల్లి వేవేగఁ దెలిసి
యమరేంద్రసుతునిపై యలుక రెట్టించి
రమణీయ దివ్యనారాచజాలములఁ 2220
గడిమి పింజాపింజ గదియ నేయుటయు
నడరి భీష్మద్రోణు లాదిగాఁగల్గు
రథికోత్తములు రాజరాజ తనూజు
నధిక రౌద్రాకారులై చుట్టుముట్టి
మునుకొని నవమేఘములు నేక పగుచు 2225
ఘనపర్వతంబుపై గప్పినలీల

విరివిగా బలుశరవృష్టి ముంచుటయు
గురుబలాఢ్యుఁడు నలకూబరుం డలిగి
వివిధమహాఘోరవిశిఖజాలముల
నవియెల్ల నవలీల నవనిపైఁ గూల్చి 2230
పాండవేయాగ్రణి పదిట నొప్పించి
గాండీవి నారింట గళవళపరచి
గురుని మూఁడమ్ములఁ గుదియంగ నేసి
గురుసుతు నాల్గింట గోరించివేసి 2235
పరువడి కృపుని డెబ్బదిముల్కు లేసి
గాంగేయు నేడుమార్గణముల నొంచి
యంగాధిపుని దొమ్మి దమ్ములఁ గలఁచి
శకుని పదేనింట చట్టులు సేల్చి
నకులుని పదిరెంట నకనకజేసి 2240
శతవర్మ నైదింట జక్కుగావించి
ప్రతిభచే సహదేవు ఘదమూట నొంచి
చెలగి మూటను దుస్సనేసునిఁ గూల్చి
నలుబదేనింట సైంధవుని జెండాడి
భగదత్తు ఖండించి బాహ్లికుఁ జంపి 2245

తెగి సోమదత్తుని తెగటార్చి యార్చి
భూరిశ్రవుని ధాత్రి బొరలంగ నేసి
వీరసైన్యముల పృథ్వీస్థలిఁగూల్చి
శరనిధు ల్గలఁగ నక్షత్రములు రాల
ధరప్రీల విలుగుణధ్వని సేయుటయును; 2250
అమరేంద్రసుతుఁడు గంగాత్మజుఁ జూచి
సమహితచారిత్ర చూచితే యతని
శౌర్యమాటోపంబు శరకౌశలంబు
ధైర్యంబు వీర్య ముద్దండంబు చలము
నలికలోచనునిదీ టనవచ్చు నతని 2255
నలముక ద్రోమ్మి కయ్యంబుచేసినను
మనల మెచ్చరు మేటిమగలు చూచినను
వినుమయ్య సాహసవిహితంబు గాదు
ఇవ్వీరు నందఱు నేకమై గొలువ
నెవ్వరిప్రాభవం బెఱుగంగరాదు 2260
ఇత డందఱిని గెల్చె నేని దేశాధి
పతు లంకెకును రారు ప్రతిభలు తొలఁగు
తగవుగా దిదిరాయె పాతకహేతు వంద్రు

నగుబాటుసేయక నన్ను మన్నింపు
నలకూబరునిమేలు నావిలు నేర్పు 2265
సొలవక కనువిచ్చి చూడుఁడు మీరు;
చెన్నొంద నన్నుఁ బెంచిన నీవు మెచ్చ
మన్ననఁ బెంచిన మాయన్న మెచ్చ
విలువిద్య నేర్పిన వీరపుంగవుఁడు
సలలితతేజుఁ డాచార్యుఁడు మెచ్చ 2270
నతని నే గెలిచెద నాయక్షసుతుఁడు
చతురత్వమున నన్ను సాధించెనేని
యప్పు డాతనిమీఁద ననిసేసి గెలువు
మిప్పుడే పనిసేయ నెన్నిక గాదు
నిలుఁ డని యందఱ నిలిపి గాండీవి 2275
నలకూబరునిఁ జూచి నగుచు ని ట్లనియె
నీచక్క దనమును నీరాజసంబు
చూచి మాప్రద్యుమ్నుఁ జూచిన యట్ల
నుండఁగా నిందాక నోర్చుక యుంటి
నిందు సాహసశక్తి నీవు చూపితివి 2280
నీపెంపు నీతెంపు నీవిక్రమంబు

చూపుము నామీఁదఁ జూచెద నిపుడు
మీవారు నినుఁజూచి మేలుమే లనఁగ
మావారు ననుఁ జూచి మాయురే యనఁగ
పోరాడవలె నని పురుహూతసుతుఁడు 2285
నారసంబుల నూట నాటనేయుటయు
నవశిలీముఖముల నలకూబరుండు
కవిసి యర్జునుమేను గాడ నేయుటయు
కళవళ మందఁగా గాండీవధన్వి
బలునారసంబులు బరపినఁ గెరలి 2290
నలుఁవొంద వేయుబాణములు సంధింప
యిల నవి గూల్చి యక్షేశనందనుఁడు
పదివేలశరములు పరపిన క్రీడి
పదరక నవియెల్ల భగ్నముల్ సేసి
లక్షసాయకముల లక్షించి యేసె 2295
యక్షవల్లభపుత్త్రుఁ డవి దునుమాడి
కోటిబాణములు మిక్కుటముగా నేసె
పాటించి కనుగొని భళి యని మెచ్చి
శతమన్యుసుతుఁ డవి చక్కుగావించి

శతకోటిశరములు చలమున నేసె 2300
దోర్బలంబున నవి ద్రుంచి నిగుడ్చె
నర్బుదాంబకములు యక్షేశసుతుఁడు
పర్వసేయక నవి భంజించి వైచె
ఖర్వసాయకములు గాండీవి సొనిపె
యన్నింటి పొట్టు పొట్టయి రాలనేసె 2305
కిన్నరాధిపుపట్టి గేరి యుప్పొంగి
పద్మసాయకములు పావకాశుగము
పద్మారికులజుని పై నేయుటయును
దోలఁగ నన్నింటిని దునిమి కిరీటి
జ్వలనబాణప్రభాజాలంబు జూచి 2310
వరుణాంబకమున వారించి కినిసి
యిర్మనైన సమ్మోహనాస్త్ర మేయుటయు
దురుసైనమూర్ఛలు దొట్రుకొనంగ
నరదంబుపై వ్రాలె యక్షేశసుతుఁడు
అంతట నిలువక యమరేంద్రసుతుఁడు 2315
కుంతంబు శౌర్యంబు బాహుబలంబు
మిగులునం తంతకు మిక్కుటం బగుచు

నిగనిగఁ గులికెడి నిశితాంబకముల
గరికరి మెరయంగ గడు నిగుడించి
గరుడుర్వాదికోట్లు గదిసిన దునిమి 2320
సింధురంబుల కోటి చించి చెండాడి
గంధర్వులను నాల్గుఖర్వంబు లైదు
లక్షలపదివేల లవములు చేసి
రాక్షసాధిపుల నిర్వాదికోటు లైదు
లక్షల ధరణీతలంబునఁ గూల్చి 2325
యక్షాధిపుల పదియారుఖర్వముల
నిరువదికోటుల నిలఁ గూల నేసి
యగయు సంఖ్యకు నెక్కుడై నకిన్నరుల
భువిఁ గూల్చి పెక్కుకింపురుషులఁ జంపి
దివిజేంద్రతనయుండు తేజంబు మెరసి 2330
నారసం బందుట నారి పూనుటయు
ధీరత నేయుట దెలియరాకుండ
నెడలేక గాండీవ మెప్పుడు గన్గొనిన
గుడిబడి యుండంగ గ్రోధించి కవిసి
మిక్కిలి కరు కెక్కి మించి యేసినను 2335

ఎక్కడఁ గనుఁగొన్న నెందుఁ జూచినను
ఎచ్చోటఁ బరికింప నెచట వీక్షింప
హెచ్చు గాయంబుల నీల్గెడిభటులు
సమయు నేనుంగులు చచ్చుగుఱ్ఱములు
తుమురు లౌనరదము ల్తునియు సారథులు 2340
మ్రగ్గెడి యోధులు మడియు దానవులు
మ్రొగ్గు మావంతులు మురియు కిన్నరులు
నరుదుగా బలు డొల్లియాడెడుతలలు
పరువు లెత్తుచు మిట్టిపడెడిగాత్రములు
పచ్చడల్ దరిగి గుప్పలు బోసినటుల 2345
నచ్చు టచ్చట రాసులైన మాంసములు
గాటంపు పెనురొంపిగా దండి నిండి
మేటులై దగుక్రొవ్వు మెదడునెత్తములు
మూల్గెడువారును మొరలిడువారు
నీల్గెడువారును నెరిదూలువారు 2350
పొరలెడివారు వాపోయెడివారు
గొరలెడివారు డగ్గుత్తిక నురికి
యరచెడువారు పెల్లార్చెడువారు

ఘోర ప్రాణముల బండ్లు గొరికెడువారు
కలువరించెడివారు కనులార్చువారు 2355
పలువరించెడివారు భ్రమసెడివారు
బెబ్బరించెడివారు ఛేదిల్లువారు
తబ్బిబ్బులై నేల తడవెడివారు
కలగి ఘూకాదిక కలకలంబగుచు
నలఘు భయంకరం బయ్యె న్నావేళ 2360
వరకేశచయము శైవాలమ్ముగాఁగ
కరమొప్ప గొడుగులు కమలముల్గాఁగ
రమణ నానారత్నరథనికాయములు
కమనీయకర్కాటకంబులుగాఁగ
నెరిదేలు క్రొవ్వుడిండీరంబుగాఁగ 2365
కరిగాత్రములు జలగ్రహములుగాఁగ
కలితరథాంగముల్ కమఠముల్గాఁగ
మెలుపొందుఖడ్గముల్ మీనముల్గాఁగ
నునుపొంద బాణబాణాసనప్రతతి
ఘనతరజలపన్నగంబులుగాఁగ 2370
పొరిపొరిఁ దేలెడు పురియలపిండు

సిరిగుల్కు ముత్యంపు చిప్పలుగాఁగ
సరసంపుశల్యముల్ శంఖముల్గాఁగ
మరికొన్ని సాధనమండలావలులు
గురుతరజలచరకులములుగాఁగ 237
తరుచైనతరువులు ధ్వజములుగాఁగ
నడరి మెండైన గాయముల బెల్లుబ్బి
గడుజాలుకొని సాగి కాల్వలై వంక
లై వాగులై యేరులై నదు లగుచు
రయమున గడుబారె రక్తవాహినులు 238
అత్తరిఁ జెలరేగి యతిసూత్నరత్న
మత్తిమన్నవమాంసమత్తవిస్ఫూర్తి
కేలాకెళ్లంబులై కేక లేయుచును
ఏలలు బాడుచు నెగిరి యాడుచును
మేలైన పరువుళ్లు మెరువుళ్లు మెరయ 23
సోలుచు వ్రాలుచు సొక్కుచుఁ గెరలి
యోల యోల యటంచు నొనర నార్చుచును
నాలోలగతి నీదులాడె భూతములు
తాళముల్ గైకొని తగువీణెఁ బూని

తాళము దరువులు దప్పక యుండ 2390
పాళిపదక్రమవంతుమార్గముల
లాలితస్వరకాలలయకాలగతుల
వేలారువిధముల వీణమీటుచును
మేలని తనుదానె మెచ్చుచుఁ గెరలి
యోలలు వెట్టుచు నుదరంబు గదల 2395
హాలల్ల యని నాట్య మాడె నారదుఁడు
బెడిదంపుమూర్ఛ దెప్పిరిలి వేగ
చిడిముడిపడి లేచి శ్రీదునందనుఁడు
తనసేన భూతలాధ్యక్షుని బలము
కనువిచ్చి చూచి వేక్కసమైనరోష 2400
మున లేచి శంఖంబు పూరించి కనలి
ధనవంది దివ్యసాధనములు బూని
చెలికాండ్ర రథికుల సేనల నెల్ల
నలరుచు లాలించి యనికి నిల్పుటయు
చెలరేగి యాసునాసీరనందనుని 2405
బలము నుద్దండంబు బాణలాఘవము
తెగువయుఁ జొరవయుఁ దేజంబుఁ జూచి

తగధర్మతనయుఁ డెంతయుఁ గౌఁగిలించె;
గురుఁడు మూర్కొనియెఁ; నక్కున జేర్చె భీష్ముఁ
డిరవొందగా జంక నిడుకొనెఁ గృపుడు; 2410
కూర్మితో ముద్దాడె గురుతనూభవుఁడు;
నర్మితో మ్రొక్కి రలరుచుఁ గవలు;
మెచ్చెఁ గౌరవరాజు మేలనె గర్ణుఁ
డచ్చెరుపడి యెంచి రతిరథోత్తములు;
కన్నులపండువు ల్గాఁగ వీక్షించి 2415
మున్నుగా నెంచె జీమూతవాహనుఁడు

## కుబేరుఁడు యక్షవీరులఁ బొగడుట

అంతకుమున్నె యక్షాధినాయకుఁడు
వింతకయ్యం బౌట విని రౌద్రుఁ డగుచు
మలసి మణిగ్రీవమణిమంతులాది
గలమహారథికులు ఖర్వముల్ నడువ 2420
బహుసంఖ్యలో మూలబలములు గొలువ
కహకహార్భటుల నాకాశంబు బగుల
పదఘట్టనలకు భూభాగంబు వ్రీల

నదనకాహళభేరికారిగంభీర
రావంబు లరికులగ్రావముల్ గ్రుంగ 2425
శీవిచే శౌర్యపాండిత్యుఁడై వేగఁ
జనుదెంచి ఘనరణస్థలము వీక్షించి
వినుతించి యత్యంత విస్మయుం డగుచు
నందను నాలింగనంబు గావించి
యందలిరథికుల నందంద బొగడి 2430
సమధికవాహినీసహితంబుగాఁగ
సమరసన్నద్ధుఁడై చయ్యన నిలచె
అనిలతనూభవుం డాతని ముద్దు
తనయుండు తెలివొంది తడయక లేచి,
యన్నకు మ్రొక్కి భీష్మాచార్యులకును 2435
జె న్నొంద ప్రణమిల్లి, చేరి పాంచాల
తనయును గవల నెంతయు నాదరించి
ఘనరథారూఢుడై గగనంబు ప్రీల
దరములు బూరించి, దారుణాకృతిన
శరశరాసనములు సంధించి, నిలిచి 2440
రణిన నాజన మేజయావనీశ్వరుఁడు

మునినాథునకు గేలు మొగిచి యి ట్లనియె
అనఘాత్మ యాహిడింబాత్మజు ప్రతిభ
అనిలనందనుని మహాటోపమహిమ
ధననాథసుతుని యుద్దండశౌర్యంబు 2445
జనసుతుం డగుధనంజయుని సాహసము
కురుయోధ వర్యుల గురుపరాక్రమము
గరుడగంధర్వరాక్షసయక్షయోధ
వరుల విక్రమకళావైఖరు లెల్ల
నరుఁడుగా వింటి యక్షాధినాయకుఁడు 2450
చనుదెంచి సంగరస్థలమున నిలిచె
నని పల్కఁ దిరి మీర లవ్వలికథయు
వినుపింపవలె నన్న వేడ్కఁ నిట్లనియె
జనమేజయునకు వైశంపాయనుఁడు
అని శ్రీమహానందనాథేశ్వరాంఘ్రి 2455
వనరుహానిరతసేవానందుపేర
భామినీజనపంచబాణునిపేర
అమలకారుణ్యగుణానిధిపేర
కేరళీసాపీరకేకయద్రవిళ

సౌరాష్ట్ర జననాథసన్నుతు పేర 2460
పరగు శ్రీరంగ మాంబాగర్భజలధి
సరసకళాపూర్ణచంద్రుని పేర
ననుపమ రాయమన్నె కుమారు పేర
ఘనదాననిర్జితకర్ణుని పేర
భూరినానాకళాభోజభూవిభుని 2465
పేర దీనశరణ్యు పేర దేవేంద్ర
విభవుని పేర రావిళ్ల శ్రీకొండ
విభుచంద్రు లింగపృథ్వీభర్త పేర
దినరాజసంకాశ తేజుని పేర
అనఘవర్తను పేర నంకితంబుగను 2470
జనసుతసత్కీర్తి శౌర్య చాతుర్య
ధనుడగణ్యుండు రత్నాకరకొండ

---

భల్లాణరాయ శుంభత్స్వప్తపాండ్య
వల్లభ ఘూర్జర వసుధేశ హృదయ
భల్లాగ్ర బిరుద ప్రభావుని పేర
సల్లలితాచార సంపన్ను ని పేర (క)

ఘనుని కృష్ణకురాజకవిసుతుఁ డార్య
వినుతుఁడు గోపాలవిద్వత్కవీంద్రుఁ
డెనయ వేడ్కల రచియించినట్టి 2475
ఘనతరసౌగంధికప్రసవాప
హారణకావ్యమునందు నాంజనేయుండు
పరువడి దీవించి పాండునందనుని
చెలగి తమ్ముల కెంకి జెప్పిపుచ్చుటయు
తలగక నతఁ డేగి దనుజుల యత్తు 2480
వరుల ఖండించి యవ్వాని నిల్చుటయును
తరుచుగా నది విని ధననాథసుతుఁడు
పవనసందునిమీఁద బర తెంచుటయును
దివిజారిపాంచాలి ధృతి నేగి ధర్మ
తనయుని యెదుట పద్మము నిల్చుటయును, 2485
అనిలజు లేమికి నన్న గుందుటయు,
సురముని పవమానసూనుకార్యంబు
లెరిగించి చనుట మహీవల్లభుండు
తడవు చింతించి ఘటోత్కచునితోఁ గూడ

తడయక నచటి కందఱు నేగుటయు 2490
కురురాజు బలముల గూడి యేతెంచి
సురవైరితో బోరి సుగులెల్ల నడగి
సమరంబు చాలించి సంధి యొనర్చి
శమనునందను నాజ్ఞ సమ్మతి బూని
సకలసేనలుగూడి సామీరి కడకు 2495
ప్రకటించి చేరుట ఫల్గుణుం డపుడె
పరతెంచుటయు ధనపతినందనుండు
గరిమెతో గ్రక్కునఁ గదలివచ్చుటయు
శారులు దీర్చుట బలుదెఱంగులను
పోరాసరించుట బోరిలోపలను 2500
అనిలజుం డసురేశు డర్థేశసుతుఁడు
మొనసిన మూర్ఛల మునిగి వేగంబె
తెలివొంది యనిసేయ దివురుచుండుటయు
నలకాపురాధీశుఁ డావహం బగుట
విని సైన్యములతోడ వెస నేగుదెంచి 2505
మొనసిన రిపుసైన్యముల నెల్లఁ జూచి

తనబలంబులఁ జూచి ధరణీతలమునఁ
బెనగొన్న పీనుఁగు పెంటలు జూచి
యధికవిస్మయ మంది యివ్వాలి యవలి
రథికుల సుతుని భూరమణుని బొగడి
కలన నిల్చుటాదిగాఁగల కథల
నలరుచు నిది ద్వితీయాశ్వాస మయ్యె. 2512

---

# తృతీయాశ్వాసము

అవధరింపుము వసుధాధీశచంద్ర
యవలి కథాక్రమం బది వివరింతు
ధనపతి వచ్చునుద్దండంబుఁ గాంచి
మనమున నులికి ధర్మతనూభవుండు
మొన నిల్చి యున్నతమ్ముని ముఖాంబుజంబుఁ 5
గనుఁగొని నియమొందఁగా నిట్లు బలికె

ధర్మరాజుసంధిసేయఁ బూనుట.

బాలునితోఁ జేయు బవరంబునకు
చాలు చాలై యుండె సమసె సైన్యములు
పడిరి యోధులు తగ్గె బలము గుఱ్ఱములు
బెడిదంపుబలములు బెంచి యేతెంచె 10
శ్రీదుఁ డాతని సాజిఁ జెనకి జయింపఁ
గాఁ దీర దెంతటి ఘనులకు నైన
పరికింపుము ధనాధిపతిసేనలోన

బిరుదధ్వజంబులు బెక్కెంటి నవియు
వారెల్ల నెరయోధవర్యులు గారె! 15
పో రేలసంధియై పొసఁగుట లెస్స
నావిని శమననందనుని వీక్షించి

గాండీవి దానికొడఁబడకుండుట.

దేవేంద్రపుత్త్రుండు ధృతిమీరఁ బలికె
ముందుగా కయ్యంబు మొనసేయకున్నఁ
బొందు సంధి యొనర్పఁ బొసఁగుఁ గా కిపుడు 20
అది యేల దీరు మీయాత్మలో నింత
బెదరేల ననుఁజూడు పృథ్వీతలేంద్ర!
అరమర లోకయింత యైనను లేక
కురుపాండవులు జతగూడయుండగను
నోరసి కయ్య మొనర్ప నుగ్రునికైనఁ 25
దరమె నాభుజశక్తి ధననాథుకడిమి
కను మని శత్త్రులు గడగడవణక
తన రెడి దేవదత్తంబుఁ బూరించి
వల కేల విలు గుణధ్వని జేసి యార్చి
కలనికి బలములు గవియించుటయును 30

కుబేరుఁడు పాండవులతో యుద్ధము సేయుంట కిష్టపడ కుండుట.

అంతయు వీక్షించి యక్షవల్లభుఁడు
మంతు కెక్కిన మణిమంతుని గాంచి
అన్న! కంటివె మానవాధీశుసేన
లున్న మోహారము మహోద్దండవృత్తి
మున్ను చేసినకయ్యముల తెంపుబెంపు 35
గన్నను నిటువంటికయ్యంబుఁ జూడ
నందుకు బడియున్న యక్షులు సాక్షి
కుందెడి గంధర్వకోటులు సాక్షి
నలినలి యైనకిన్నరసేన సాక్షి
బొలిసిన బెక్కుకింపురుషులు సాక్షి 40
ధరణిపైఁ బడియున్న దానవుల్ సాక్షి
యొరలుచుఁ బొరలెడి యోధులు సాక్షి
కమలంబు లిచ్చి వేగమె బంపకున్న
సమరంబు సంధిల్లు సమయు సైన్యములు
నరు లని యెంతయు నెంచఁగాఁ దగదు 45
నరు లేకదా; మున్ను కదనంబునందు

రావణకుంభకర్ణాదిప్రముఖులను
తీవి నెదిర్చి ఖండించినవారు
అంతటి బలసాహసాంకు లీధరణి
కాంతులు వీరితో కలహించి రొదిరి 50
చెలరేగి యనిసేయఁ జెల్ల దటన్న
నలకూబరుఁడు యతినాథున కనియె
అయ్య! యీపని యెంత! యీబల మెంత!
వెయ్యారువిధముల విమతులఁ బోగడఁ

మణిమంతుఁ డొప్పకుండుట.

దగవానె! కాంచనోదరు డుండగాను 55
మగటిమిఁ గలమణిమంతుఁ డుండఁగను
వార్త కెక్కిన హరిధ్వజుఁ డుండఁగను
గీర్తిఁ గాంచిన మణిగ్రీవుఁ డుండఁగను
వీరల కెనయైనవీరులు లెక్క
మీరి యుద్ధము సేయ మీచెంతనుండ 60
జెరలు గొట్టుచు సర్వసేన లుండఁగను
ధరలక నసువంటితనయుఁ డుండఁగను

ఆవలివారు కయ్యమె కోరుచుండ
నీవేళ కములంబు లిచ్చుట కొదువ
దీనత్వ మొంది ప్రార్థించివేడినను 65
బూనికౌఁగిటఁజేర్చి పొం దొనరించి
నలువొందకములముల్ నవనిధానములు
నలకాపురంబైన నర్పింపవచ్చు
నేపున గర్వించి యెదిరించినపుడు
నీపాదములయాన నేత్రృణ మియ్య 70
ననిన నందఱు యోధు లటువలె బలికి
కనలుచుఁ గదలి శంఖములు పూరించి
దారుణసింహనాదములు బర్వించి
పోరికి సేనలఁ బురికొల్పుటయును
వారి వీరికి నింత వర్ణింపరాని 75
హోరాహావం బయ్యెఁ గురుకులాధీశ!

ఉభయపక్షములకును సంకులసమరమగుట.

మదకరుల్మదకరుల్మార్కొనుకరణి
పొదలి పులుల్ పులు లోర్బుచందమునఁ

గలఁగక తొలఁగక గండభేరుండ
ములు గండభేరుండములు దూరులీల 80
శరభముల్ శరభముల్ సమరంబు సల్పు
సరణి హరుల్ హరుల్ సరిబోరుమాడ్కి
ధరణీధరంబులు ధరణీధరములు
తలకక నెదురేగి తార్కొనుసటుల
పొడుచుట నరుకుట పొదలి మోదుటయుఁ 85
దొడఁబడి నాటుట తునియుట బెట్టు
దాకుటల్ దెలియక దర్పంబు మెరసి
యాకాంక్షలనుబోరె నఖిలసైన్యములు.
ఆసమయంబున నె నలుక రెట్టించి
వాసవి విలుగుణధ్వనిచేసి నిగుడి 90
యరుదైన కిన్నరయక్షదైతేయ
గరుడగంధర్వుల ఘనయోధవరుల
కలిమి వీక్షించి యేకడలఁ జూచినను
వెలయు మోపులుగట్టి వేయుచందమున
నంచితదివ్యాశరావళి ముంచి 95
ఖించి యేసినఁగూలె ఘోటియేనుఁగులు

రథములు బొడియయ్యె రథికులు మడిసి
రథికులు సమసిరి హయములు మ్రగ్గె
కొద్దిమీరిన గొడుగులు కేతనములు
గద్దలాడిన లీల గగనంబు నిండె 100
మెండైన యెలగోలు మేదిని యణఁగ
దండిబారులు గ్రుంగె దర్పముల్ దొలఁగె
బలియురపై దూరి ఫల్గుణుం డపుడు
వలనొప్ప శరలాఘవస్ఫూర్తి మెరసి
కరములు నొకప్రోవు కాళ్లొకప్రోవు 105
శిరములు నొకప్రోవు చెవు లొక్కప్రోవు
కండలు నొకప్రోవు కను లొక్కప్రోవు
గుండెలు నొకప్రోవు క్రొవ్వొకప్రోవు
మొండుగా నిండార మెద డొకప్రోవు
తుండంబు లొకప్రోవు తొడ లొకప్రోవు 110
ఒకప్రోవు శల్యము లొకప్రోవు ప్రేవు
లొకప్రోవు చర్మంబు లొకప్రోవు నరము
లొకప్రోవు కేశంబు లొకప్రోవు నాస
లకలంకగతి పర్వతాకారములుగఁ

గటికవాఁడును వ్రాలి గాండీవధన్వి 115
కటికపోగులు వైచె ఘనభీకరముగ
నలిగి యంతటఁ బోక నాసవ్యసాచి
చెలఁగి యతుబలంబుఁ జెదరించి వరికి
యొండొండ ఖండించి రోజలు గోసి
నిండారు నెరపిన నీటువాటిల్ల 120
తలకొని చిర్లాడి తప్పిపోనీక
నలినలిగాఁగ సైన్యముల ఛేదించి
ఘనరథంబులు మహాగ్రావము ల్గాఁగఁ
దనర కేతనములు తరువులుగాఁగ
ధనురాదులు లతావితానముల్ గాఁగఁ 125
దనువులు భీకరస్థాణువుల్ గాఁగఁ
నేనుఁగుల్ గండశైలేంద్రముల్ గాఁగఁ
నానాయుధంబులు నాగముల్ గాఁగఁ
దురఁగముల్ హరిణసందోహముల్ గాఁగ
వరసూక్ష్మబహుచిత్రవర్ణవస్త్రములు 130
పొలుపొందఁబూచిన పొదరిండ్లుగాఁగ
సలలిత బహురత్నచయభూషణములు

చటుల జాజ్వల్యపాషాణముల్ గాఁగఁ
బటుభేరిరథనేమి బలఘోషణములు
ఖగమృగారావసంకరములుగాఁగఁ 135
దగి యొప్పు ధననాథు దళమహాటవులఁ
దలపడి తనబాణదావాగ్ని చేతఁ
జలమున ముంచి భస్మంబుఁ గావించె
వెస నార్చి ధనదుని వెన్నంట నేసి
మసలక నేనూట మణిమంతు నొంచి 140
యొలమి మణిగ్రీవు నిన్నూట జడిపి
నలకూబరుని నూట నాటంగ నేసి
వరబలోద్దండదుర్వారప్రచండ
నిరుపమపాండిత్యనిజభుజాదండ
సారుఁడై తగు సవ్యసాచి నీక్షించి 145
ధీరతో ధనాధీశుఁ డిట్లనియె.

కుబేరార్జునుల సంవాదము

నరుఁడ వటంచు నెంతయు నిన్ను నేను
పరువ సేయక యున్న పైకొని వచ్చె

శరలాఘవస్ఫూర్తి సాహసప్రతిభ
సరిసన్నవాడ పర్యుష్టారె మాయన్న 150
మెచ్చితి నిను మేలు మేలు కిరీటి
పొచ్చెంబుగా దొకబుద్ధి చెప్పెదను
కచ్చుకపడి యీడుగాని కయ్యంబు
విచ్చలవిడి సేయ వెర్రితనంబు
మచ్చరంబున నన్ను మార్కొనవలదు 155
తచ్చనల్ సాగ విత్తరిని వేవేగ
వచ్చినయట్టి మీవారును నీవు
విచ్చేయుఁ డనిన నవ్విజయుఁ డిట్లనియె
ఓరాజరాజ! నాదొకవిన్నపంబు
వేరె చిత్తములేక వినుఁడు తెల్పెదను 160
వీరకర్మమునకు వెరచువారలకు
మీరు చెప్పినబుద్ధి మిక్కిలి నిజము
సమధికభీకరసమరరంగముల
మిమువంటి ఘనులతో మెలఁగెడివాఁడ
నలవేళనాకు నింతింతయు నొకటి 165
యిలదొడ్డకొంచెమే నెన్నుఁడుఁ జూడ

వచ్చిన యట్టి మావారిలో నొకరు
మెచ్చరు నీ వెట్లు మెచ్చెదు నన్ను?
కూరిమి ధర్మజుకొలువులో నున్న
వారిలో నెలగోలువాడను నేను 170
ఘనయోధవర్యులు గదియకమున్న
కనుగల్గి యొకబుద్ధి గని వేవేగ
పరిణామమున నీవు పట్టంబు జేరు
తరువాత మేము మాస్థలము జేరుదుము
నరులను గెల్చె కిన్నరనాథుఁ డనిన 175
సురదానవుల కిది చోద్యంబుగాదు
నరులు గుబేరు నెంతయుఁ గెల్చి రనిన
సరకుసేయరు నిన్ను సకలలోకముల
మాకుఁ జెప్పినయట్టి మహనీయబుద్ధి
నీ కింతయును లేదు నేను నేమందు 180
నని వారిమొనలుగా నాడినయట్టి
ఘనుని కుబేరుండు గనుగొని పలికె
అర్జున నీపల్కు లవి యథార్థంబుల్
వర్జింపఁదగినవి వర్జింపవలయు

నల్పసాంగత్యంబు నల్పయుద్ధంబు 185
నల్పమానవసేవ నల్పాయుధంబుఁ
గ్రొవ్వునఁ జేసినఁ గాదువలె నిజము
కవ్వడి విను కౌంచెగాఁడవా నీవు
ధరణిపై దివ్యకోదండపాండిత్య
శరకౌశలరణోగ్రసాహసుం డనుచు 190
కాలకేయనివాతకవచాదిదైత్య
జాలభిద్వ్యాలమహాశక్యాహి వనుచు
వాతాత్మజునితోటి వాదుకై యంప
సేతువు కట్టి గెల్చిన ధీరుఁ డనుచు
వరఖాండవవనంబు వహ్నికి నిచ్చి 195
సురరాజుదరిమిన శూరుఁ డంచు
హెచ్చుగా శంకరు నెదిరి పోరాడి
మెచ్చులు గైకొన్న మేటి యటంచు
నారదుచే మున్ను నానావిధముల
నారూఢిగా విని యధిప నీతోడ 200
నని సేయఁ దలఁచి నే నరిగితి నిటకు;
వినుట నిశ్చయము గావింపగా నిపుడు

కనుగొంటి నీపరాక్రమకౌశలంబు
ఘనయోధవరులలో ఘనుడవు నీవు
నే నినుగెల్చిన నెగడు నాకీర్తి 205
నే నీకు నోడిన నేకొద్ది గాదు
వనధిలంఘించి రావణుపురిగాల్చి
చనుదెంచు కపికులచంద్రునికంటె
నగముల గూల్చి దానవుల ఖండించి
జగముల నుతిగాంచు జంభారికంటె 210
అంగజు హరియించి యజాతల ద్రుంచు
గంగాధరునికంటె ఘనుఁడనే నేను!
కేపున వారల గెలుచు నీలావు
చూపుము నాబల్మి చూతువుగాని
అని పల్కి క్రోధించి యాగ్నేయశరము 215

కుబేరార్జునుల యుద్ధము

ఘనమంత్రయుతముగా గాండీవిమీఁదఁ
బనిపిన పటుపటుఁ బగిలె నంబరము
ధరణి వణంకె దిగ్దంతులు మ్రొగ్గె

బెదరె శేషుఁడు గిరుల్ పృథ్విలోఁ గ్రుంగె
నది మహాప్రళయమార్తాండప్రకాశ 220
మండితం బగుచు శుంభత్ప్రౌఢి నిగుడె
గాండీవధన్విదాఁగని విజృంభించి
ధారుణీతలము దిక్తటము లల్లాడ
వారుణాస్త్రము బూని వైచె వైచుటయు
నది మహావిలయకాలాంతకాభీల 22
విదితగదాదండవిలసితం బగుచుఁ
జను దెంచి రవికోటిసన్నిభమైన
యనలఘోరాశుగం బవలీల దునిమె
అమరేంద్రసుతుఁడు యక్షాధిశుమీఁద
సముదగ్రతరవాయుసాయకం బేసె, 23

## ఉభయపక్షముల పోరాడుట

నలకాధిపతిమీఁద నలిని గాంగేయుఁ
డలఘుమహోగ్రనాగాశుగం బేసె
నిరవొందగాఁ గిన్నరేంద్రునిమీఁదఁ
బరువడి ద్రోణుండు బ్రహ్మాస్త్ర మేసె

నరవాహనునిమీఁద నాగకేతనుఁడు 235
కరమర్థి జలధరకాండంబుఁ జొనిపెఁ
గూర్చి కుబేరుపైఁ గురునందనుండు
నార్చుచుఁ గినిసి రౌద్రాంశుగం బేసె
కర్ణుండు శ్రీదుపైఁ గవిసి దేవతలు
వర్ణింపఁ బావకోజ్వలబాణమేసె 240
మరియు దక్కిన యోధమండలావళులు
గురియించి రాశుగఘోరవర్షములు
సరగున నాదివ్యశరపరంపరలు
గరికరి నొరిసి లోకములు బెగ్గిల్లఁ
బ్రళయభైరవమహాపటహనిర్ఘోష 245
కలితభూతేశ ఢక్కా ఢమత్కార
శతకోటి శతకోటి సంకులాఘోష
తతహవ్యవహాభీమధామంబు నగుచుఁ
దనరుచు భూనభోంతరములు నిండి
చనుదెంచు నాదివ్యశరములు గాంచి 250
నాగాశుగముచేత నలకూబరుండు
బాగుమీరిన వాయుబాణంబు దునిమె

కడు మణిగ్రీవుండు గరుడాంబకమున
పొడిపొడిగా నేసె భోగిశరంబు
మణిమంతుఁ డాగి బ్రహ్మమార్గణంబునను 255
గణుతింపఁ గమలజకాండంబు నేసె
అనిలాంబకము బూని యల జయంధరుఁడు
కనలి మేఘశరంబు ఖండించివైచె
వరుణసాయకమున వహ్నిబాణంబు
పరియలు గావించె భానుకేతనుఁడు 260
ధనదుఁడు పొంగి మార్తాండబాణమునఁ
దనరారఁ గూల్చె రౌద్రశిలీముఖంబు
రహిమీర తక్కినరసికశేఖరులు
మహిఁగూల్చి రత్యంతమహితశస్త్రముల
అరిమురి గెరలి జయంధరుం డపుడు 265
సురనదీతనయుని జూచి క్రోధించి
ఘనదివ్యశరవృష్టి గప్పి నొప్పించి
జనసుతతాళధ్వజంబు ఖండించి
యతఁ డేయుశరముల నన్నింటి దునిమి
యతులితం బైనట్టి యరదంబు గూల్చి 270

విలుగుణధ్వనిచేసి వెస నార్చుటయును;
గలఁగకఁ దొలఁగకఁ గాంగేయుఁ డపుడు
మరియొకరథ మెక్కి మార్గణవృష్టి
గురియించి మణిమంతుఁ గూర్మినందనుని
తనువెల్ల నించినఁ దర్పంబు మెరసి 275
కనలి జయంధరగంధర్వవిభుఁడు
కడువడి భీష్ముని కవచ మింతింతఁ
బొడిపొడిచేసినఁ బొంగి గాంగేయుఁ
డెనసిన కినుక నర్ధేందుబాణమునఁ
గనకకిరీటంబు ఖండించుటయును 280
చిత్రాంగదుండు విచిత్రకేతనుఁడు
ధాత్రిఁ బ్రీలఁగ నార్చి దర్పముల్ మెరసి
యవలీల గాంగేయు నరదంబుఁ గూల్చి
వివిధసాయకముల విలు ద్రుంచి వైచి
సారథి హరులను సమయించి ఘోర 285
నారాచముల మేను నాట నేయుటయుఁ
దమకించి యొండు రథంబుపై నెక్కి

యమునరనదీసూనుఁ దగ్ధచంద్రాశు
గములచే నిరుపురి కంఠములఁ ద్రుంచి
రపుణ జయంధరు రథముపై కురికి 290
కరవాల మంకించఁ గని మణిగ్రీవుఁ
డువవడి నెడసొచ్చి యొక్కభల్లమున
వాలు చూర్ణము చేసి వరదివ్యబాణ
జాలంబులను మేను జల్లెడగంద్లు
చేసిన వీక్షించి చెలఁగి కర్ణుండు 295
భాసిలుఘనదివ్యబాణత్రయమున
గౌరలి యేసిన మణిగ్రీవుండు మూర్ఛ
నొరగిన సారథి యొక్కింత దవ్వు
దొలఁగింప సూతపుత్రుండు పోనీక
బలువడి వెన్నంటి పర తెంచుటయును 300
కంచురథంబుల గంధర్వపతులు
కొంచింప కరువడి కోట్ల మార్కొనియు
తమకించి యుక్కురథంబుల యక్షు
రమణు. వెంబడి కోట్లు రాధేయు గ్రమ్మె
పాటించి కిన్నరప్రభులు మున్నూరు 305

కోటులు కర్ణుఁ దార్కొని పోరి రపుడు
అందరిమీఁద యయ్యధిపుఁ డంభోధి
మందరనగము దా మథియించు లీల
పరువడి బహుదివ్యబాణజాలముల
నరదంబులను గూల్చి యధికుల దునిమి 310
తురగంబుల వధించి దొరల మర్దించి
కరకరి సూతుల గళముల జిదిమి
ప్రళయకాలమునాటి భానుని సరణి
కలయించి యలయించి గగ్గోలుపఱచి
పరువులు బారించి భయము పుట్టించి 315
గరిమెతో విజయశంఖంబుఁ బూరించె
నటమున్న చయ్యన నరదంబు నెక్కి
పటురోషమున భీష్మపార్థివేంద్రుండు
నలుదిక్కులు గలంగ నారి మ్రోయించి
పొలుపొంద మణిమంతుపుత్త్రునిమీఁదఁ 320
జలమునఁ నొకయర్ధచంద్రబాణంబు
కలితమంత్రయుతమ్ముగా నేయుటయును
యతఁడాధినాయకుఁడావిధమంత

వీక్షించి పావకవిశిఖంబుఁ బూని
యదలించి యేసిన నమరేంద్రసుతుఁడు 325
ముదమున వరుణాస్త్రమున ద్రుంచుటయును
నలకూబరుం డైంద్రనారాచమునను
నులుకుచు నభిమంత్రయుతముగా నేయ
సొలవక నప్పాండుసూతపుత్త్రుండు
చెలువుమీరఁగ శక్తిచే నది గూల్ప 330
నంతలో నర్ధచంద్రాశుగం బరిగి
నెంతయు నా కిన్నరేంద్రుండు బెగడ
ధరణిపై వేస జయంధరుని మస్తకము
గురుఘోషణములతోఁ గూల్చెఁ గూల్చుటయు
భండనంబున తనపట్టికూలుటయు 335
మొండుగాఁ గన్నుల మిణుగుర్లు దుముక
సురనదీసూనునిఁ జూచి రోషించి
యరుదుగా మణిమంతు డరదంబు ద్రొప్పి
రణభయోదగ్రనారాయణాస్త్రంబుఁ
గణుతింప మంత్రయుక్తంబుగా నేసె 340
అది వేస బ్రహ్మాండ మాక్రమింపుచును

నుదుటున జనుదేరఁ నొయ్యనఁ గాంచి
వలనొప్ప భీష్ముండు వైష్ణవాస్త్రమున
నిలిపె నాబాణంబు నిమిషమాత్రమున
అప్పుడు మణిమంతు డమ్మహాశరము 345
తప్పిపోవుటఁ గాంచి ధైర్యంబు మించి
కులిశనారాచంబు క్రోధించి యేయ
పొలవక సురనదీసుతుఁ డేపుమీరి
యవలీల నైంద్రసాయకమునఁ దునిమె
కవిసిపోనీయక గంధర్వవిభుఁడు 350
సర్వాంగముల నించెఁ జటులబాణముల,
నుర్వీతలాధీశుఁ డోడక నిలిచె;
నతులితఘోరశస్త్రాస్త్రజాలముల
ధృతి నించె మణిమంతు దేహ మంతయును
కలఁగక తొలఁగక గవిసి యిర్వురును 355
నిలు! నిలు! గాంగేయ! నిలు నిలు మనుచు
మలయుచు నన్యోన్యమాత్సర్యములను
తలపడి పోర రక్తంబులు దుముక
సలలితమాణిక్యశైలంబు లనఁగఁ 360

బొలుపొందఁ బూచిన మోదుగు లనఁగ
బలువైన కాలవిపర్యాసములను
తరకొని యుభయసంధ్యారాగములను
సరిపడి సమరంబు సలిపి రాఘనులు
అక్కడ రాధేయుఁ డాహవస్థలము 365
గ్రక్కున శోధించి కదిసి వెన్నంటి

కర్ణుని బలపరాక్రమములు

కేక వేయుచు మణిగ్రీవునిరథము
పైకిని లంఘించి పౌలస్త్యుఁ గాంచి,
యక్కటా! యిటువంటి యతిరథోత్తముని
చిక్కించి చూడంగఁ జెల్లునే మీకు! 370
చిడిముడి పులినోటఁ జిక్కిన వేగ
విడిపించుకొనునట్టి వీరులు లేరె!
తొట్టిన పగగొర్ల వొడ్డి నొచ్చినను
బట్టి నియ్యరుబంటు పంతంబు మెరసి
యెన్నెన్నిపలికిన నేవ లేదింత 375
నెన్నాళ్ల పగ యుండె సీతనిమీఁదఁ

జత్తురు నొత్తురు సరియాదు రింత
నిత్తెరంగున నుండ నే నెందుఁ జూడ
నట మున్నె కమలంబు లర్పింతు రేని
యిటువంటి యాపద లేటికి వచ్చుఁ 380
గరుణతో నీకనైనఁ గాంచెద వేగ
సరసిజాతములఁ బాంచాలి కొసంగి
కౌరవేంద్రున కలకాపురం బిచ్చి
వీరధర్మము మాని విపినభూములకుఁ
జనుఁ డని పలుక రోషంబు రెట్టించి 385
ధననాథసుతుఁడు రాధాపుత్త్రుఁ దాఁకి
యిరవంద గద బూని యినతనూభవుని
కరమందు వెలుగొందుఖడ్గంబు దునిమి
విరథుఁడవై యుండి వీరవాక్యములు
తరముగా దిది నీకు తరలుము కర్ణ! 390
యరదంబుపై నెక్కి యస్త్రముల్ పూని
బిరుదువాక్యము లాడి బెదరింతు మమ్ము
చెడుగ! నిన్నివేళఁ జేఁగాచినాఁడఁ
జెడిపోవ వలదు నీసేనది క్రూరుగు

అధికుఁడ వైనఁ జయ్యన నేగి యొక్క 395
రథ మెక్కి రమ్ము దురమ్ము సల్పుటకు
ప్రాణంబుపై నీకు భ్రమ కల్గెనేని
మాను మీమాటలు మరలిపొమ్మనిన;
నరిగి రథం బెక్కి నలఘుకోదండ
ధరుఁడై కుబేరనందను వడి దాఁకె 400

### కర్ణమణిగ్రీవుల యుద్ధము

అపుడు మణిగ్రీవుఁ డతిమూర్ఛ దెలిసి
తపనీయదివ్యకోదండంబుఁ బూని
చపలాలతికెబోలు శరము సంధించి
కుపితుఁడై కర్ణునిఁ గ్రోధించి చూచి
నలకూబరుని యాననము విలోకించి 405
వలదయ్య యిట కేల వచ్చితి వీవు
మానవుం డనుచు నేమరియుంటిగాని
యీనృపాలకు ద్రుంప నెక్కడె నాకు
వాహిని కెక్కునావరశక్తి యితని
బాహాబలము నీవె పరికింపవలయు! 4

నన విని యినసూనుఁ డామణిగ్రీవుఁ
గనుఁగొని యిట్లనుఁ గలకల నగుచు
మీరాజు మారాజు మీయోధవరులు
మారథికోత్తముల్ మాసాహసములు
ప్రతిభలు మునుమున్న పరికింపలేదె! 415
ఇతఁడు చూడకయున్న నేమిటఁ గొదువ!
నిన్నుఁ జూచిన నిల్వ నీరు బండెడిని.
ఎన్నఁడుఁ బరికింప నిటువంటివాని!
సామజేంద్రముతోడ సయ్యాట లింత
దోమకు సాగునే! తొలగుము వేగ 420
నెరవుగా బల్కెదె! నీయీడువారు
కలరు మాసేనలోఁ గదనంబు సేయ;
నస దీరకున్న యానలకూబరునకుఁ
గొసరుగా నిచ్చెదఁ గోరి నిన్నిపుడె
యని నారి సంధించి యరదంబు గదిమి 425
కనకపుంఖోజ్జ్వలఘనసాయకముల
నిరువుర నొప్పించె నిషుపరంపరల;
నరదముల్ దివ్యశరాసనంబులును

దురగసారథులతోఁ దునియలఁ జేసి
కరుకెక్కి విజయశంఖంబుఁ బూరించె 430
మహనీయ మాణిక్యమయరథ మెక్కి
బహుళశరంబులు కర్ణుపైన సంధించి
నెరి నొవ్వ జేసి మణిగ్రీవుఁ డపుడు
హరుల సారథిఁ గూల్చి యరదంబు ద్రుంచి
మలయక నవరత్నమకుటంబుఁ దునిమి 435
విలునారి తెగటార్చి విల్లు ఖండించి
కలహించి క్రోధించి కాయ మంతయును
పొలవక నెత్తురు జొత్తిల్లఁ జేసి
యమ్ముల ముంచిన నళు కింత లేక
నమ్మేటి వేరొక్క యరద మెక్కుటయు 440
అది పొట్టుచేసిన నదరక కినిసి
గదఁబూన నది గూల్ప ఖడ్గంబు పలుక
కరముల సంధించి కదియ నేయుటయుఁ
దిర మొంద నవి రెండు తెగటార్చుటయును
ఖరకరాత్మజుఁడు చక్రంబు సంధింప 445
వరశిలీముఖముల వారించి కర్ణు

సురము ప్రేలంగ మహోగ్ర బాణముల
నెరి దూరనేసిన నిట్టూర్పు విడుచు
సొరిది నల్దిక్కులుఁ జూచి భీతిల్లి
పరువడి వెన్నిచ్చి పరతెంచుటయును 450

కర్ణునిపలాయనము

గని మణిగ్రీవుండు గదియ నేతెంచి
యినసుత! నిలు! నిలు! మేల పోయెదవు
మలయుచు మీవారు మావారు జూడఁ
దలచెడిపారుట ధర్మమే నీకు!
బిరుదువాక్యము లాడి పెక్కులు ప్రేలి 455
పరులందఱును జూచి పకపకనవ్వ
పోయిన ని న్నేల పోనిత్తు నేను
మాయన్న! తొలఁగని మగవాఁడ వీవు!
చలియించి నీ విట్లు జరుగుట కేను
తలపోయ నిన్నుఁ జూచి తక్కినయట్టి 460
నెరయోధు లీబుద్ధి నేర్పెద రింక
నెరి సాహసంబెల్ల నీటఁ గల్పితివి

ఎద గాయముల ధాత్రి నీల్గువారలకు
నెదురుగా వచ్చుగుబేరపుష్పకము[1]
కుపితచిత్తుండవై కురువంశమునకు 465
నపకీర్తి దెత్తువే! యన్న! రాధేయ!
పారక తిరుగుము బవరంబు సేయఁ
దేరువిండ్లమ్ములు దెప్పించి యిత్తు
ననుపల్కు విని విననట్లు ఖేదిల్లి[2]
చనుకర్ణుఁ జూచి యాచార్యనందనుఁడు 470

## అశ్వత్థామ కర్ణునికి సాయపడుట

అధికవేగంబున నరిగి వేరొక్క
రథముపైఁ జే పట్టి రాధేయు నునిచి
చెలమి మణిగ్రీవు నేడంబకములఁ
గళవళఁబడ నేసి కవచంబు చించి
నలకూబరుని పదునాల్గు బాణములఁ 475

---

1. a. నెదురుగావచ్చు దేవేంద్రపుష్పకము (త).
b. నెదురుగా వచ్చు సురేంద్రపుష్పకము (ట)
2 ననుపల్కు విని విననట్లును జెవరి (త)

గలగించి సారథి ఖండించి వైచి
భానుకేతనునిఁ దొంబది నారసములఁ !
బూని ఘోరాహవంబునఁ జక్కుచేసి
సకలబలంబుల సైన్యాధిపతుల
ప్రకటించి చీకాకుఁబడఁ జెండివైచి 480
కుండలీకృతముగాఁ గోదండమమరఁ
గాండముల్ పూనుట కడిమి నేయుటయుఁ
దెలియఁగూడకయుండఁ దేజంబు మెరసి
బలియుర యోధుల భంజించి గదిమి
వెలయదుష్గ్రీవు వికలంబుఁ జేసి 485
నలకూబరుని ముంచె నవభల్లములను
నలకూబరుఁడు గురునందనుమీఁద
నలువది దివ్యబాణంబు లేయుటయుఁ
బొడియయ్యె నరదంబు బొలిసె గుఱ్ఱములు
మడిసె సారథి బిల్లుమారె కేతనము 490
తెరలక వేరొక్క తేరిపై నెక్కి
గురునందనుఁడు నలకూబరుఁ గదిసె
నలకూబరుఁడు గప్పె నానాశుగముల

నిజ మణిగ్రీవుఁ డనేకబాణముల
ముంచినఁ గని ద్రోణముఖ్యులౌ యోధు 495
లంచితశరవృష్టి నపుడు గప్పటయు
నని యెల్లఁ దునిమిన నాచార్యసుతుఁడు
వివిధాస్త్రములు యక్షవిభునిపైఁ బరపెఁ
బెట్టు నార్చుచు భీమసేనుండు
ఘట్టించి గద కరద్వయమునఁ బూని 500
నడతెంచుటయుఁ జూచి నలకూబరుండు
బెడిదంపుటమ్ముల భీముని ముంచె
నని నడ్డసేయక ననిలనందనుఁడు
కవిసె పక్షులమీఁదఁ గన్నె సాళ్వంబు
గోరించుగతి యక్షకోటుల మోది 505
ఘోరదానవుల మారొక్కని చక్కఁజేసి
గరుడుల కుడియించి గంధర్వవిభుల
ధరఁ గూల్చి కిన్నరదళములఁ జంపి
నలకూబరుని తేరు నలినలిఁ జేసి
యల మణిగ్రీవునియరదంబు దునిమె 510
రణభయంకరపరాక్రమశాలియైన

మణిమంతుతోఁ గొంత మసలక పోరి
సురనదీతనయుండు సూర్యబాణమున
సరగున నతని మూర్ఛ మునుంగ నేసి
మరలి పౌలస్త్యకుమారునిఁ దాఁకి 515
శరవృష్టి గురియించి చలియింపఁజేసె
అక్కడి కలకలం బాలించి చూచి

## కుబేరార్జునులయుద్ధము అర్జునిమూర్ఛ

జక్కుల యొకిమీఁదు సాహసప్రతిభ
నరదంబు మరలింప నమరేంద్రసుతుఁడు
పరికించి యక్షాధిపతికి నిట్లనియె 520
ఇక్కడ నే నుండు టెఱిఁగియు మీరు
అక్కడఁ జనఁ జెల్లు నా కిన్నరేంద్ర !
చలమున ననుడాసి సమరంబుచేసి
గెలిచి పోదువుగాని కేడించి నిలువు
మిన్నక నామాట మీఱిపోయినను 525
వెన్నుగాయంబుల వేధింతు నిన్ను[1]

1. వెన్నుగాయంబుల వెలయింతు నిన్ను (త)

అని గుణధ్వనిఁ జేసి యరదంబు గదిమి
తనరారు దేవదత్తంబుఁ బూరింప
విని ధనాధీశుండు వేగంబె మరలి
వనజభవాస్త్రంబు వాసవిమీఁదఁ 530
బరగింప నమ్మేటి బ్రహ్మసాయకము
కరమర్థి మంత్రయుక్తంబుగా నేసి
నది నిల్పి కిన్నరాధ్యక్షునిమీఁదఁ
నదలించి యేసె నారాయణాస్త్రంబు
కని కుబేరుఁడు మహాగ్రహమున నపుడు 535
ఘనవైష్ణవాస్త్రంబుఁ గైకొని దాని
వారించి కవ్యాడి వక్షంబు దాఁక
నీరజాప్తశరంబు నిగుడించుటయును
బలువిడి నదిగాక ఫల్గునుం డపుడె
తెలియని మూర్ఛల తేరుపై వ్రాలె 540

### ఘటోత్కచునియుద్ధము అతఁడు మూర్ఛిలుట

కనుఁగొని యాఘటోత్కచుఁ డుగ్రుఁ డగుచు
మునుకొని వాడి యమ్ముల విలు ద్రుంచి

హారికిరీటంబు పోట్టు గావించి
క్రూరత రథముపై కుప్పించి దుమికి
కరవాలు బెరికి వెక్కసముగా నార్చి 545

నరవాహుని బెట్టు నరకిన నతఁడు
నరదంబుపై వ్రాలి యంతలోఁ దెలిసి
కోదండమునఁ బెట్టు గొట్టిన నతఁడు
పోదట్టి వక్షంబుఁ బొడువ క్రీడుండు
కళవళ మంది రాక్షసకులేశ్వరుని 550

ప్రళయాంతకుని లీల బలుగదఁ బూని
మోదిన నది దాఁకి మూర్ఛిలి యపుడు
ఆదైత్యకులమౌళి యవనిపై వ్రాలె
వేమరు పరికించి వికలంబు నొంది
సామజేంద్రము నెక్కి శమననందనుఁడు 555

ప్రకటించి నడచె తురంగంబు నెక్కి;
నకులుండు నడచె తురంగంబు మ్రోల[1]
దుర్యోధనుండును దుశ్శాసనుండు

1. నకులుండు నడచె మానవనాథుతోడ (ట)

శౌర్యంబు లుప్పొంగ జనిరి వెంబడిన;[1]
మహికెక్కు నెర యోధవర్యులతోఁడ 560
సహదేవు డరుదెంచె జనపతి వెంట;
చతురంగబలములు సటుకట్టి మొనను
చతురుఁడై వెస కృపాచార్యుఁడు నడచె;
అటమున్న పడియున్న యర్జునుఁ జూచి
పిటపిట కోరలు బెట్టుగా దీటి 565

హనుమంతుఁడు కుబేరునితోఁ యుద్ధము సేయుట
ఉభయపక్షములవారికిని జరిగిన చిత్రయుద్ధము

కేతనంబున నున్న కేసరిసుతుఁడు
భూతలం బదుర నద్భుతశక్తి దుమికి
నక్షత్రమండలోన్నతమైనయొక్క
వృక్షంబు కూకటి వ్రేళ్లతోఁ బెరికి
కరముల సంధించి గద్దించి నడువ 570
పరికించి చతురంగబలములు పగిలె
చిడిముడి పడి సర్వసేనాధిపతులు

1. శౌర్యంబు లుప్పొంగి జనిరి వెంబడిగ (ట)

జడిసి కూతలు మాని జరిగిరి వేగ
వేఱైనదారలు కుబేరుని విడిచి
జారిరి యోధులు చనిరి బెగ్గిలుచు 575
అలకాధినాయకుఁ డాభూరుహంబు
తొలగక శరముల దురుము సేయుటయుఁ
బోలించి కాంచి యద్భుతమైన యొక్క
శైలంబుఁ బెఱికి యక్షకులేశుమీఁద
వైచిన నమ్మేటి వ్రక్కలు సేయ 580
జూచి కో యని యార్చి సురలు భేదిల్ల
కనకాచలములీల కాయంబుఁ బెంచి
ధనపతిమీఁద నుద్దండత నడిచె
తెలి వొంది గనుఁగొని దేవేంద్రసుతుఁడు
యలివేణి లాలించి యరదంబు దుమికి 585
వలగొని యాకపివరునకు మ్రొక్కి
చెలువొంద గీర్తించి చేతులు మొగిచి
కపికులాధీశ! జగన్నుతచరిత!
విపులబలాటోప! వీరాగ్రగణ్య!
ఫలనొప్ప నెరయోధవర్యులలోన 590

చులకసేయుదురె! నాశూరత్వ మిపుడు
కలయక్షకిన్నరగంధర్వపతుల
నలకాధిపతితోడ ననిగెల్తుఁ జూడు
కినుకమానుమటంచుఁ గీర్తించి యతని
తనధ్వజంబున నుంచి ధర్మజాదులను 595
వారించి యరదంబు వైళంబ యెక్కి
దారుణశంఖనాదంబు బర్వించి
యక్షవల్లభునిపై నరదంబు నూకి
యక్షయదివ్యశరావళుల్ నించె
ఆలోన కెలి వొంది యనిలాత్మజుండు 600
కాలునిగతి నార్చి గర్వంబు పేర్చి
యలకాధిపతిమీఁదఁ నరుదెంచుటయును
తిలకించి కాంచి యాదేవధ్వజుండు
పటుతరాంచితదివ్యబాణజాలముల
చటులత ముంచె రాక్షసకులేశ్వరుని 605
మకుటంబు దునిమిన మండి సురారి
వికలంబు నొందక వికవిక నగుచు
దేవధ్వజుని ముంచె దివ్యబాణముల

వేవేగ విలు ద్రుంచి వీరులఁ జంపి
సూతునిఁ దెగటార్చి సూర్యబాణమున 610
నాతని నొప్పించి యదలించుటయును
తనరార దేవకేతనుఁడు జృంభించి
జనసుతం బైనట్టి స్యందనం బెక్కి
మెరసి ఘటోత్కచుమీఁద దండురికి
పరగించె బహుఘోర బాణజాలముల; 615
నవియెల్లఁ బొడిసేసి యసురనాయకుఁడు
త్రివిరి యమ్ముల ముంచె దేవకేతనుని
ఈరీతి నొండొరు లేపు దీపించి
పోరుచునుండి రద్భుతశక్తి మెరసి;
అంతట మణిమంతుఁ డతిమూర్ఛ దెలిసి 620
యంతకు లీల సాహస మగ్గలించి
కరుకెక్కి యరదంబు గాంగేయుమీఁదఁ
దరిమినఁ గర్ణుఁ డుద్ధతి నెదురేఁగి
శరముల నరదంబుఁ జక్కు సేయుటయు
నురవడి నతఁడు వేరొక్కరథంబుఁ 625
బరువడి నెక్కి యాభానునందనుని

నిరుపమాంబకముల నించు నవ్వేళ
మార్తాండసుతునకు మణికుంతునకును
కీర్తింపఁదగు రణకేళి సంధిల్లె
తివిరి ఘటోత్కచదేవధ్వజులకు 630
బవరంబు చాల దెప్పరమయ్యె నపుడు
అమరేంద్రసుతునకు యదునాథునకు
సమరంబు గల్గె నాశ్చర్యంబు గాఁగ
నలకూబరునకు ద్రోణతనూజునకును
గలితభయంకరకదనంబు చెల్లె 635
నెరయ గాంగేయమణిగ్రీవులకును
గర మొప్ప ఘోరసంగరము వాటిల్లె
మారుతాత్మజునకు మణికేతునకుఁ
దారుణంబైన యుద్ధము సంభవించె
హరికేతనునకు ద్రోణాచార్యునకును 640
నరుదంద నాహవం బగ్గల మయ్యె
చెలువొందఁ గృపునకుఁ జిత్రకాయునకుఁ
బలువైన జగడంబు ప్రకటించి మించె
విలసిల్లు కురురాజవీరసేనలకు

నలరి చూడఁగ నాల నుధికమై మెరసె 645
నకులునకును సదానందున కపుడు
ప్రకటంబుగాఁ బోరు బలసె నెంతయును
తక్కిన యట్టి యోధులకు యోధులకు
నక్కజంబైన కయ్యము సంఘటిల్లె
అరయ భటుల్ భటుల్ హారులును హారులు 650
కరులును గరులును గడిసి పెంపెక్క
రథికులు రథికు లుగ్రత చలపోరి
యధికజయాకాంక్ష నని సేయుచుండ
అప్పుడు నారదుం డధికమోదమున

నారదుఁడు ద్వారకాపురమునకు వచ్చుట

గప్పునఁ జని ద్వారకాపురి సేరి 655
నిరుపమమౌక్తికనీలవైడూర్య
మరకత ఘనహీరమాణిక్యఖచిత
సప్తసాలముల ముచ్చటలు చూచుచును
తప్తకల్యాణసౌధములు చూచుచును
గంగాతరంగిణీ కనకాబ్జముకుళ 660
సాంగత్యకలితకాంచనకుంభనికర

భూరిగోపురచయంబుల విలాసములు
పారె వీక్షింపుచు సకలసౌభాగ్య
మందిరంబుల మేలు మచ్చులు గనుచుఁ
జందన క్రముకరసాలజంబీర 668
మాలూర శారద మాధవీ పనస
తాలతమాలతాకుంజమంజు
పల్లవకోరక ప్రసవఫలాది
సల్లలితామోదసంయుతం బగుచుఁ
గలకంఠ శుకశారికావాంసచక్ర 670
విలసిత మధురవాగ్వైభవంబుఁ గనుచు
వలనొప్ప శృంగారవనమధ్యమునను
వెలఁదులు పదియారువేలు గొల్వఁగను
జెలఁగుచు దివిజరాజీవలోచనలు
సలలితనాట్యప్రసంగము ల్సొరవ 675
క్ష్మాపాలకన్యక ల్చామర ల్వీవ
గోపికాజనములు గొడుగులు బూనఁ
జనువుల రుక్మిణీసతి మొదలైన
యొనమండ్రసతులతో నింపు సొం పెసఁగ

కేళికామహిమలఁ గ్రీడించుచున్న 680

### కృష్ణదర్శనము

తాలాంకసోదరు తతకీర్తిహారు
నలఘునీరదదేహు నాజానుబాహు
కలితత్రిదశగేయు కనకకౌశేయు
లీలావిలాసు లాలితతరహాసు
బాలికామదనగోపాలుని చెంత 685
నిలిచిన గనుఁగొని నెలతలుఁ దాను
బొలుపొందఁ బ్రణమిల్లి పూజలు సేసి
యురురత్నపీఠిపై నుంచినఁ జెలఁగి
సురమౌని వసుదేవసుతుని కిట్లనియె

### నారదకృష్ణ సంవాదము

ఓపావనచరిత్ర! యోపాండుమిత్ర! 690
యోపుండరీకాక్ష! యోజగద్రక్ష!
కడకతో నొకవార్త గలదు దెల్పెదను;
కడుసావధానంబుగా వినవలయు
పరగ ధనాధీశ పాండవేయులకుఁ

దరుచైన ఘోరయుద్ధము సంఘటిల్లె 695
ఇపుడు సేనలతో ఫణీంద్రకేతనుఁడు
కపటసహాయుఁడై కలిసి యున్నాఁడు
సొలవక నిలుకులో సొలుకుమంత్రంబు[1]
దలపెట్టఁగలఁ డల ధార్తరాష్ట్రుండు
మదమత్తుఁ డతని మర్మము మీకె తెలుసు 700

మది నింక నొకయనుమాన మయ్యెడిని
అలకాధిపతికిని హరునకు దొడ్డ
చెలిమియగా నీవార్త చెవిఁబడెనేని
యల శ్రీదునకు సహాయంబు గాఁగలఁడు
పొలుపుమీరంగ నాభూతనాయకుఁడు 705

తలపోయ మీదయ తప్ప వేరొండు
గలదె పాండవులకుఁ గమలాధినాథ!
అనువంద మీరు సహాయంబు గాఁగఁ
జనుఁ డని దేవతాసంయమి వెడలె

---

1. a. సొలవక నిరుకులో సోకు మంత్రంబు (త)
b. సొలవక నిలుకులో సోకు మంత్రంబు (ట)

కమలాక్షు డవ్వేళఁ గడు విజృంభించి 710

## కృష్ణుఁడు పాండవులకు సహాయము సేయఁబూనుట

రమణుల నంతఃపురంబున కనిచి
యాస్థానమున కేఁగి యవనికంపింపఁ
బ్రస్థానభేరికా ప్రతతిమ్రోయించి
యక్కడ నున్నయోధావళి నెల్లఁ
గ్రక్కునఁ బయినముల్ గ్రమ్మని యనిచి 715
తరలక శార్ఙ్గగదాచక్రఖడ్గ
వరసాధనంబులు వరుస ధరించి
గరుడకేతనధనుర్గుణదివ్యబాణ
నిరుపమనవరత్ననికరసంఖచిత
సురథరోన్నతవిభాసురరథం బెక్కి 720
యరుదార పాంచజన్యంబుఁ బూరించి
యదువృష్ణిభోజాంధకాదులతోడ
మది నెన్నరాని కుమారులతోడ
నలఘుతేజోనిధి యభిమన్యుతోడ
బలువిడి చతురంగ బలములతోడ 725

వలనొప్ప బహువైభవంబులతోడ
ఘనత రాత్యంతవేగంబున గదిలి
చనియె నుద్భటవృత్తి జలజలోచనుఁడు
కదనరంగమునకుఁ గమలలోచనుని
గదలించి పొదలుచు గ్రక్కున నపుడు 73
కలహాభోజనమౌని కైలాటకాఁడు

## నారదుఁడు కైలాసమున కరుగుట

తులకించు బొజ్జ చిందులు ద్రొక్క నేఁగి
యన్ని దిక్కులయందు ననవరతంబు
వెన్నెల నిండార వెదచల్లుదాని
ఘోరకామక్రోధకుటిలమాత్సర్య 73
భూరిపాపౌఘముల్ పోఁద్రోలుదాని
చారుసౌభాగ్యముల్ సమకూర్చుదాని
తారాచలము గాంచి తగ వినుతించి
యమ్మహాగిరి నెక్కి యందంద నిందు
కమ్మని వాసనల్ గ్రమ్ము మందార 74
వనముల దాటి భవ్యవిమానరత్న

కనకసాలంబులు గడచి యుత్తుంగ
సారచంద్రోపలసౌధజాలంబు
లారూఢి మీరి మహాభోగభాగ్య
బంధురకల్యాణభవనరాజములు 745
సింధురాలయములు చెలఁగి చూచుచును
జని చని మహనీయసాంబ్రాణికాది
ఘనధూపవాసనఘంటానినాద
పంచాక్షరీధ్యానబహుశంఖనినద
కంచుకీజనఘోషగంభీర మగుచు 750
సలలితం బైన యాస్థానమంటపము
చెలువంబు మీఱ నీక్షించుచు నేఁగి
వీరభద్రకుమార విఘ్నాధినాథ
భైరవాదు లుభయభాగంబులందు
రమణ గూర్చుండ విక్రమధురంధరుఁడు 755
ప్రమథాగ్రగణ్యు లుద్భటవృత్తిఁ గొలువ
గంధర్వకిన్నరకామినీమణులు
బంధురగీతప్రబంధము ల్పాడ

కరమర్థి యక్షరాక్షసకులాధిపులు
పరువడితో బరాబరు లొనరింపఁ
గలితమోదంబున గంగావధూటి
తులకించి జడలలో తుంపెసలాడఁ
గలువలచెలికాఁడు కళలు రంజిల్లఁ
బలు శేవమౌళిపై భాసిల్లుచుండ
గరగరికలమించు గట్టురాపట్టి
గరిమెతో వామభాగంబున మెలఁగ;
బహువినోదవిలాసభద్రసంపదల

### శివుని సందర్శనము.

రహిమీరఁ గొలువున్న రాజశేఖరుని
గని దేవముని కులాగ్రణి వినుతింప
మొనసి ప్రత్యుత్థానములు చేసి యతని
నలువొప్ప నుచితాసనంబున నునిచి
చెలఁగుచు నమ్మౌని క్షేమంబు లడిగి
ఘనులు మీ రిట వచ్చుకార్య మే మనిన
మనసిజారికి సురమౌని యి ట్లనియె

## నారద శివుల సంభాషణలు

సర్వలోకశరణ్యా! శైలజారమణా! 775
శర్వా! గంగాధర! సద్భక్తవరద!
వినుపింతు నొకవార్త విను చిత్తగించి
తనర విజృంభించి ధర్మనందనుఁడు
అనుజులు దుర్యోధనాదులు గొలువఁ
జనుదెంచి ధనదుని సరకుగాఁ గొనక 780
చెలరేఁగి యుద్ధంబు సేయుచున్నాఁడు
తలపోయ ధర్మనందను సేనలోన
గురుఁడు భీష్ముండు నాగురుతనూభవుఁడు
కురురాజు భీముఁడు గోత్రారిసుతుఁడు
పరగు నానాదివ్యబాణకౌశలులు 785
నెరయోధవర్యుల నీ వెఱుంగుదువు
కదనరంగమున సాధుసులతోఁ శ్రీదుఁ
డెదిరించి పోరాడు శే దుస్తరంబు
పాటించి యిఁక నొక్కభయమును గలదు;
తేటగా నావార్త తెలిపెద వినుఁడు 790

తలపోయ పాండునందనులకు శౌరి
బలిమైన చెలికాఁడు ప్రాణబంధువుఁడు
కలలోఁ దలంచిన గ్రక్కున నేఁగి
తొలఁగక రక్షించుఁ దోయజాక్షుండు
వెలయ నీకార్యంబు విన్నంతలోన 795
నలఘు వైఖరిసహాయముపచ్చు నిజము
కంతుని గన్నయ్యఁ గదిసిన వెనక
చింతింప గతజలసేతుబంధనము
నిన్నె నమ్మినవాఁడు నీచెలికాఁడు
కన్నడసేయంగఁ గడు ధర్మ మగునె; 800
యీక్షణంబున మీర లేగకయున్న
యక్షాధినాథున కాసింపఁదగదు
తెలిసినంతయుఁ దేటతెల్లమిగాఁగఁ
దెలిపితి నని యేఁగె దేవతాముని.

### శివుఁడు కుబేరునకు సాయపడ సిద్ధమగుట

ఇందుకళాధరుఁ డెలమి యుప్పొంగి 805
యందరిఁ బరికించి యాహ్వానంబునకుఁ

గట్టాయితమ్ములు గమ్మని యనిచి
గట్టిగా పులితోలుకాశ బిగించి
కమనీయఘనవజ్రకవచంబుఁ దొడిగి
డమరుగశూలచండపినాకముఖ్య 810
వివిధాయుధంబులు వెస ధరియించి
సవరించి తెచ్చినస్యందనం బెక్కి
ధీరత్వమునఁ జనుదెంచు నవ్వేళ
నారూఢదివ్యరథారూఢుఁ డగుచు
భైరవగుహావీరభద్రాదు లరుగ 815
హీరంపుటరదంబు లెక్కి పెంపెక్కి
ప్రమథులు శతకోటి బలసి కొల్వంగ
ప్రమదంబునను వీరభటపరంపరలు
తమకము ల్నిగుడ ముందరఁ జనుదేర
గమకమై కరితురంగశతాంగతతులు 820
కరకరిపార్శ్వభాగముల నేతేర
వరుస చతుర్విధవాద్యఘోషములు
ఘోరమై సకలదిక్కులుఁ బిక్కటిల్ల
భోరున నేతెంచె భూతేశ్వరుండు

గురుతరతురగోగ్రఖురఘట్టనములు 825
కరిపాదఘాతఘీంకారరావములు
రమణీయమణిమయరథచక్రగతులు
పుడమిఁ గంపింప త్రిభువనము ల్గలఁగఁ
దడఁబడి శేషునితల లన్ని చెదర
బెగడి కూర్మము వెన్ను బిట్టులు వార[1] 830

పరమేశ్వరుఁడు కుబేరునిదగ్గఱకు వచ్చుట

తగుసత్తుకులపర్వతము లొడ్డగిల్ల
నతిరభసంబున నరుదెంచి యక్ష
పతి చెంత నిల్చె నప్పరమేశ్వరుండు
నిలిచిన గనుఁగొని నెయ్యంబుతోడఁ
దులకించు తమకముల్ తోడి బొమ్మలాడఁ 835
గయ్యంబు నిల్పి యక్షకులాధినాథుఁ
డయ్యెడ హిమగిరిజాధీశుఁ జేరి
ఘనభక్తి ప్రణమిల్లి కరములు మొగిచి
వినయసంభ్రమముల వినుతించుటయును

1. బెగడి కూర్మము వెన్ను బీటలు వార (త)

హరుఁడు సంతోషించి యతని లాలించి 840
వరయోధవర్యుల వరుస దీవించి
సకలసైన్యంబుల సమరంబునకును
బ్రకటించి సమకట్టి బారులు దీర్చి
సముదగ్రతర భేరిశంఖారవంబు
లమరంగ నిగుడించు నాసమయమునను 845
శమనతనూజుఁ డాశ్చర్యము నొంది
అమరనదీనందనాచార్యవరులఁ

## ధర్మరాజు చింతించుట

గనుఁగొని యిట్లను గటకటపడుచు
అనఘాత్ములార! యదూధినాథునకుఁ
గడిమి సహాయంబుగా వచ్చె హరుఁడు 850
తొడరి భూతేశ్వరుతో నిల్చి పోర
వలనొప్పు మనయోధవర్యులలోనఁ
గలరె! యెంతటి దొడ్డకార్యంబుగలిగె!
భైరవగుహవీరభద్రులతోడఁ
బోరాడ నెవ్వ రోపుదు రయ్యలార 855

ప్రమథులతో మనబలము లింత్రైన
సమరాంగణంబున సరి నిల్వఁగలరె!
యనుచు జింతించునా యమతనూభవునిఁ
గనుఁగొని పలికె గంగానందనుండు
మనుజేంద్ర యొక వేద మానవులీల 860

భీష్ముఁడు ధైర్యముసెప్పుట

ఘనభయంబును నింత కలఁగ నేమిటికి?
చలపడి వారితో సరిపోరువారు
గలరా యటంటివి కలరు తెల్పెదను
పరగ ద్రోణునకును భైరవునకును;
గురుతనూభవునకు గుహునకు జోడు; 865
వివరింపఁ గృపునకు విఘ్నేశ్వరునకు;
పవనుజునకు వీరభద్రున కుద్ది
కురురాజునకు నలకూబరునకును
నరునకు ధననాథునకు నీడు జోడు;
ఘన నకులునకును మణిమంతునకును; 870
కొనయు మణిగ్రీవునకు సైంధవునకు;

రకనామునకు నలసూతపుత్త్రునకు;
కునికి నుతికెక్క సైంహికేయునకుఁ
జండీశ్వరునకును సహదేవునకును;
కొండొండ సరి యుద్ధు లుర్వీతలేంద్ర 875
తలపోసి చూడ యోధులకు యోధులకు
లలిమీర సైన్యంబులకు బలంబులకుఁ
గొలఁగక త్రాసునఁ దూఁచిననైన
నలర సమానంబు లదిగాక వినుము
వారిలోపలను మనవారిలోపలను 880
వారక రహికెక్క వరయోధులందుఁ
జటుల సాహసశక్తి సరిపోల్పరాని
పటుబలాఢ్యుఁడు హిడింబానందనుండు[1]
బొంకించి నన్ను నేఁ బొగడుకోరాదు
శంకరుతోఁ జేరి సరిపోరఁగలను 885
అన విని గాంగేయు నదరంటఁ జూచి

---

1. సాటి యీడును జోడు సరిలేనియట్టి
మేటివీరుఁడు హిడింబీనందనుండు (త)

### గాంగేయకర్ణ సంవాదము

కనలి రారాజుతోఁ గర్ణుఁ డి ట్లనియె
భూతలాధీశ! యద్భుతమైనయట్టి
మీతాత పల్కులు మీకు సమ్మతమె!
యెంతైన డెబ్బదియేండ్లు వెళ్లినను
మందవిచారముల్ మదితప్పిపోవు
తనబల్మి యెఱుగఁడు తారతమ్యములు
గనలేఁడు నీతిమార్గంబుఁ బోవిడుచు
పలుము నన్యులఁ దిట్టు బలియుర గిట్టు
నెలకొన్న ధైర్యుల నేరము ల్బట్టు
తనలోనె తాను నెంతయు రంతుసేయు
ఘనయోధవరులతోఁ గారులు బలుకు
కదిసి దండనచేసి గద్దించిరేని
బెదరి కూతలుపెట్టు ప్రియములు పలుకు
మత్తిల్లు నీతనిమహిమలు గావు
చిత్తవికారంపు చేష్టలుగాని;
బహునాళ్ల ముదిడొక్కుపైనిఁ గోపింప

హితంబుగా దిది వినుము తెల్పెదను
నెరయ శ్రీదునకును నీకు పెన్నుద్ది;
కౌరయ మణిగ్రీవ దుశ్శాసనులకు 905
గలువంద మణిమంతునకు శకునికిని;
నలకూబరునకు సైంధవునకు జోడు
గన్న నే నెన్నఁగో న్యాయంబుఁ గాదు
పన్నగభూషణ ప్రముఖులౌ యోధ
వరులెల్ల నాజోడు వర్ణించి చూడ 910
కురుకృపార్జునభీష్మగురుసుతభీమ
కులాదు లైన మానవకోటులెల్ల
ప్రకటించ యతఁడు శాల్బలములజోడు
నరనాథ యొకటికి నవ్వు పుట్టెడిని!
తిరమొంద నావార్త తెలిపెద వినుము 915
వారిలోపల మనవారిలోపలను
పేరు గీర్తులు లేని బీదలలోనఁ
నలపోసి యెంచఁగాఁ దగదు కయ్యంబు

బలుకోచ యాహిడింబానందనుండు[1]
అన విని మీసంబు లల్లన దువ్వి
దినకరాత్మజుఁ జూచి దేవతారాతి
కాలాంతకుని లీఁ గద ధరియించి
పోలించి పవమానపుత్త్రుఁగన్గొనినఁ
గనలి భీముఁడు ఘటోత్కచుని వీక్షించి
కొనుమని కనుగిల్చి గూఢత నున్న

ఘటోత్కచకర్ణసంవాదము

చలమునఁ గెరలి రాక్షసచక్రవర్తి
తలకొని మార్తాండతనయునిఁ జూచి
ఏమనంటివికర్ణ ! యీసారి పలుకు
నీమదం బడగింతు నృపతులయెదుట
యెంత సిగ్గరుఁగవో యిందరు జూడ
నింతకు మున్నె ని న్నేమిసేసితిని
మరపువచ్చెనో వోడ్డమగటిమి గల్గు

1 పరికింప నెందుకుఁ బనికిరానట్టి
పిరికివాఁడల హిడింబీనందనుండు (త)

గిరుదుబంటవు నాదు పిరికితనంబు
గనుఁగొను మని మహాగదఁ బూని నడువ
వెనకరతనయుండు దిగ్గున లేచి 935

## సురనదీతనయుండు వారిని వారించుట

ప్రతిభతో గదఁ బూని పరతెంచుటయును ;
అతివేగమున వారి కడ్డంబు వచ్చి
చనువున లాలించి శమననందనుఁడు
ఘనుల నిర్వురఁ గాంచి కరమొప్పఁ బలికె
అనుపమబలసాహసాటోపులార ! 940
మనలోన మన కింత మాత్సర్య మేల ?
యిప్పుడే కలనికి యేఁగుచున్నార
మప్పుడు గన్పించు నందరిబల్మి
కడువఁబోరెడు వేళ కూరలరుచులు
నడుగఁగా నేమి మి మ్మపుడె చూచెదము 945
వసుధ వంటలసాని వంటలసాని
మిసికిన కూరలు మేలూ్నపవలయుఁ
గాని వేగమె లెడ్డు గరిటెలు బూని

యానుకు వేట్లాడు టది నీతి యగునె![1]
అని వారి వారించి యక్కునం జేర్చి
చనువున నొక కొన్ని సఖ్యముల్ నెరపి
వెస భీష్మసుకుం జాల వినయముల్ చేసి
పోసంగ యుద్ధమున కుప్పొంగుచున్నంత;
నెందుం జూచిన నేల యీనిన లీల
పొందుగా జలధు లుప్పొంగి పెల్లుబ్బి
పొలుప వెల్లిగ వచ్చు పోలిక దనర
బలువిడి గెరలి నిబ్బరమున నడుచు
సకలసైన్యోద్ధూతసాంద్రపరాగ
నికరంబుచేం బయోనిధులు గలంగ
గిరిసుతవహియించె ఖేదమోదములు
హరుండు మున్నగం దాల్చె నాత్మలో చింత
రవిచంద్రతారకారాజికి మిగుల
నవిరళంబైన మార్గాయాస మొదవె
మొనసి యహోరాత్రములు గానంబడక

1 యానుక వేట్లాడు టది నీతి యగునె (త)

నతరగాఢాంధకారంబు గప్పె 965
రికాహాళశంఖప్రభృతుల డమామి
రావములకు బ్రహ్మాండము ల్పగుల
ఘుటఘుంటికాకలితఘింకార
రుఘోషణములకు కులగిరు లురలె
వడి వరవీరభటసింహానాద 970
రిహేషలకును దిగంతము ల్వణఁకె
తురంగవాహినీ సంయుతుఁ డగుచు
తివేగమున వచ్చె నబ్జలోచనుఁడు
ని ధర్మజుఁడు మహాకౌతుకం బడరఁ
న సహోదరులును దా నెదురేఁగి 975

హరి పాండవులకు సహాయము వచ్చుట

మ్రొక్కి నుద్యోగించు మురవిభేదనుని
గ్రక్కున నక్కునఁ గౌఁగిటఁ జేర్చి
పొలుపొంద వినుతించి పూజలుం జేసి
లరాముఁ గని చాల బ్రణుతించి పొగడి
పలుమరు తనవారు బంధవర్గములఁ 980

గలయఁ గన్గొని క్రమక్రమమున మెలఁగె
భీమార్జునాదులు ప్రేమ నేతెంచి
రామకృష్ణులకు మర్యాదమార్గమున
వేర్మితో వందనప్రియభాషణముల
నర్మిలి విహరించు నాసమయమునను ; 985
శమనతనూజుండు సంతోష మంది
కమలనాభునిమోముఁ గనుఁగొని పలికె
తలిదండ్రి వీవె మాదైవంబ వీవె
చెలికాఁడ వీవె మాజీవంబు నీవె
మరదివి నీవె మాధర్మము ల్నీవె 990
వరదుఁడ వీవె మావాఁడవు నీవె
అరయంగ పాండుజనాధినాయకుఁడు
నీరజలోచన నినుఁ జూపి చనియె
ఆపద ల్దొలగింప నఘములు వాప
చేపట్టి రక్షించి చెక్కిలి సరచి 995
వెలమబుద్ధులు చెప్ప వేడ్కలు నెరప
సలలితంబగు బహుసంపద లొసఁగ
శుభములు చేకూర్ప శూరులు సేయ

ప్రభువులు గావింప భయములు మాన్ప
పావనపుణ్యసంపన్నులఁ జేయ 1000
నీవె కర్తవుగదా! నిఖిలలోకేశ!
జలజాసనునకైన శక్యంబు గాదు
తిలకించి మిమ్ము ప్రార్థింప నాతరమె!
రవిరాజనేత్ర! శ్రీరమణీకళత్ర!
వివరింతు నొకవార్త విను చిత్తగించి 1005
పరగ సౌగంధికప్రసవంబువలనఁ
గరకరిమధుబిందుకలహంబు పుట్టె
ధననాథుఁ డతిశౌర్యధైర్యప్రతాప
ఘనబలాధికశరక్రమకౌశలుండు;
నతనికి ప్రాపుగా నళికలోచనుఁడు 1010
చతురంగబలశక్తి చనుదెంచినాఁడు!
కమ్మపూవిల్తుని గన్న మాయయ్య!
నెమ్మితో మముఁ బ్రోవ నీవు వచ్చితివి
గాంగేయుఁడును విద్వారు కవగూడి ఘోర
సంగరంబునకును సకలసైన్యముల 1015
నడిపించి జయమ్ము గనందగు ననినఁ

దడయక హరి ధర్మతనయున కనియె
జననాథవర! మీకు సాధింపరాని
పను లున్నవే ధరాభాగంబునందు?
నను జన్ములు సహాయు లతిబలోన్నతులు 1020
తనయులు చండప్రతాపవిక్రములు
గురుఁడు మహాయోధ గురుతనూభవుఁడు
గురుశౌర్యుఁ డతిధైర్య గుణనిధి కృపుఁడు
బల్లిదుఁ డగుభీష్మ ప్రతిభ యెంచినను
నెల్లలోకంబుల నెవ్వారు గలరు? 1025
పరశురామునియంత బలశాలి నెదిరి
దురమున గెల్చి కీర్తులు గొన్నవాఁడు
పొంకింపఁగా భీష్మపుత్త్రుఁ డానాటి
లంకాధిపతియంత లావరి నిజము
అతనిదీ టనవచ్చు నర్జు నాత్మజాని 1030
శతమఖాత్మజు నెంచ శక్యమే గాదు
ప్రతిభ కెక్కిన బలభద్రుఁడున్నాఁడు
అతిధైర్యధనుఁడు సాత్యకి యున్నవాఁడు
భవ్యవైభవమున ధనపతియంతవాఁడు

అహిరాజకేతనుఁ డరుదెంచినాడు 1035
కురుపాండవుల జతకూడి యుండఁగను
దుర నొనరింప యింద్రునకైనఁ దరమె
పెక్కాలోచనలేల పృథ్వీతలేంద్ర
యెక్కువ పనులకు నే నున్నవాఁడ

### కర్ణకృష్ణ సంవాదము

ననిన భానుతనూజుఁ డంభోజనాభుఁ 1040
గనుఁగొని రౌద్రుఁడై గద్దించి పలికె
భళిభళి! మేల్మేలు! పంకజనయన
కులశీల బలశౌర్యగుణశాలి వగుట
తెలిసె నీ కిన్నియుఁ దెలియు రెవ్వారు!
గొలవక నెంతశ్రేష్ఠుఁడ వైతి వీవు! 1045
నిన్న నే దాసరి నేడె రాగంబు
నిన్నెరుంగుదు నేఁగు నీరదవర్ణ!
బండాటములుచేసి ప్రజలు దిట్టంగ
కుండలతోఁ దిని గొల్లలయిండ్ల
దొంగిలి కొంటెబుద్ధులు కొన్ని నేర్చి 1050

యంగనాదు లల బాయని కట్టుఁజేసి
మసలుచు నాప్రులకుండల సున్న
పసులగాపరి నెరబంటు నే మెఱుగు
నెందెందుఁ జూచిన నిటువంటిచెదుగు
మందబుద్ధులుగావె మందగొల్లలకు 1055
నెంచితి వీర! నీ వీయోధవరుల
మంచిదె తారతమ్యము లెఱుంగుదువు
ముందర కయ్యంబు మొనసి యున్నయది
యందరి నేఁజూతు నపుడు నన్జూడు
వీరశేఖరుఁ డెంచు వీరశేఖరుని 1060
పారుబోతు నుతించు పారుబోతులను
నీవీరమర్మంబు నీబలప్రతిభ
నీవిక్రమస్ఫూర్తి నే నెన్న నేల?
వడినంటి తరిమి పర్వతము లెక్కించి
జడియఁదోలినజరాసంధుఁ డెఱుంగు 1065
కదిసిపోనీక ఘనగహ్వరముల
కదరఁ దోలినకాలయవనుఁ డెఱుంగు
నింతలో మరచితివే కృష్ణ నీవు!

పంతంబు గల నెరబంటవు గనుక
తలపోయ నీకుఁను దగినట్టివారి 1070
పలుదెఱంగుల మెచ్చి ప్రస్తుతించితివి
అన విని రోషించి యమరేంద్రసుతుఁడు

అర్జునుఁడు కర్ణుని దూషించుట

వనజాప్తనందనువదనంబుఁ జూచి
ప్రేలనిచ్చిన మరి ప్రేలెదు క్రొవ్వి
చీలల్ల నీ కేల సిగ్గు లేదాయె! 1075
నీచాత్మ యెవరు దండించిన వినవు
కోచకూతలు రేఁగి కూసెద వేల?
అతఁడు జగత్కర్త యతఁ డాదివిష్ణుఁ
డతఁడు సన్మునివంద్యుఁ డతఁ డప్రమేయుఁ
డతఁ డఘదూరుఁ డనంతుఁ డచ్యుతుఁడు 1080
అతని దూషింప నీకర్హమే మూర్ఖ!
మగటిమిగల దొడ్డమగవానివలెనె
పొగరెక్కి నీ వేల పొంగెద విపుడు?
చలమున నాఖడ్గశక్తికి నిన్ను
బలిపెట్టకున్న నీ ప్రజ్ఞలు మాన 1085

వని కేల కరవాల మంకించు విజయుఁ
గనుఁగొని కనుగిల్చి గద్దించి నిల్పి
ఖరకరనందను గౌఁగిటఁ జేర్చి
కరము సంధించి పంకజనాభుఁ డనియె
అనఘాత్మ రాధేయ యసహాయశూర 1090

కృష్ణుఁడు కర్ణునిఁ బొగడుట

యనుపమాటోప నీకాగ్రహం బేల?
వరుస నే దెల్పినవారల నెల్ల
వర యోధులై యుండ వచియింపఁగల్గె
హరునకు నీకు దీ టనుచు నే నిన్ను
ధర నుతించక యుంటి తప్పేమి నాదు? 1095
శంకరునకు నీకు సమమైన యుద్ధి
పంకజాప్తతనూజ ప్రధనరంగమున
పాయక హరు నెదుర్పడ నీవు దక్క
నీ యోధవరులలో నెవ్వరు గలరు?
ఈ వాహినులును యిఁక మాటవ లేల 1100
నీవాఁడ మే మెల్ల నిరుపమాటోప

రయమున హరు రాజరాజును గెల్చి
జయలక్ష్మి చేకొని సత్కీర్తివడయు
మన విని కర్ణుఁ డత్యంతమోదమున
కనకాంబరుని మోము గనుఁగొని పలికె 1105
నలినలోచన జగన్నాథ శ్రీకృష్ణ
చెలువంద నీవు మెచ్చినవాఁడె ఘనుఁడు
క్రొవ్వున గొన్నిపల్కులు పల్కె నన్ను
కవ్వడి నినుఁ జూచి కాచితి నతని
రాజీవనాభ విక్రమశక్తి నిపుడు[1] 1110
నేఁజెప్పఁగలబుద్ధి నీవె చెప్పితివి

కర్ణుఁడు భీష్మద్రోణాదుల దూషించుట

కలక దొలంగె సత్కరుణ వాటిల్లె
బలుపైన దొకవిన్నపంబుఁ దెల్పెదను
గురుడుఁ దుర్మార్గుండు గురుసుతుఁ డల్పుఁ
డరయ భీష్ముఁడు వారికంటెను పెంకె 1115
కడు కృపాచార్యుఁడు కపటమానసుఁడు

1. రాజీవనాభ యాశ్రితభక్తి నిపుడు (ట)

తోడరి యీదుష్టచతుష్టయం బెపుడు
బలువిడి నాబాహుబలశౌర్యగరిమ
వలనొప్పఁ జూచి యోర్వఁగజాల రనఘ
యెందుకు పనికిరా రీనీచమతులు 11
నిందింతు రెంతటి నెరయోధనైన
కుటిలోక్తులకు నేను కొరగాను నాదు
పటుశక్తి గని మెచ్చి పనిగొనవలయు
పన్నగభూషణు బలిమి నాబలిమి
కన్నులపండువుగాఁ జూతుగాని 112
నెదురుమీరఁగ నన్ను నీవెంట దోడ్క
చనుమన్న హర్షించి జలజలోచనుఁడు
గురుకృపాదులను మక్కువ సన్నుతించి
సురనదీనందను జూచి యి ట్లనియె
గాంగేయసందడి కయ్యంబు గలదు 11
గంగాధరునిమీఁదఁ గర్ణుని వెంట
నాసైన్యములు నేను నడిచెద మిపుడె
నీసేనలును నీవు నృపులు యోధులును
ధననాథుమీఁద యుద్ధమునకు జనుఁడు

కనలుచు సకలలోకము లేకమైన 1135
హరుని మీమీఁదికి నరుదేర నీఁడు
పోరిది కర్ణుని లావు చూడుము నీవు
సురుచిరంబుగ మిమ్ముఁ జూచు కర్ణుండు
నరసురల్ సేయక నని సల్పవలయు
నందు నిందును గల యఖిలరాజన్యు 1140
లందరు మీవెంట నరిగెడువారె
యన విని వినుతించి యంజలిచేసి
యనుమోద మొదవ గంగాత్మజుం డనియె
కమలామనోహర! కమలాయతాక్ష!
కమలదనిభవర్ణ! కమలాంకవినుత 1145

భీష్ముని వచనము

ఖగవాహనారూఢ! గజరాజవరద!
నగధర! వైకుంఠనాయక! కృష్ణ!
కర్ణుఁ డెవ్వాఁడు గంగాపుత్త్రుఁ డెవఁడు
వర్ణించి చూచిన వారెవ్వ రెవరు
చదరంగబలములు సమకట్టినటుల 1150

కదనంబునకు మీరు గదియించినారు<br>
హరుఁడు నేర్పరిమీర లధికు లంతకును<br>
తిర మొంద బారులు దీర్చితి రిపుడు<br>
గెలిచిన నోడిన కీర్తులు మీవె<br>
తిలకింప మీమాయఁ దెలియువా రెవరు? 1155<br>
లోకేశ! మీయాజ్ఞలో నుందు మింతె<br>
గాక స్వతంత్రముల్ గలవార లెవరు?<br>
వలనొప్పఁగా భక్తవత్సలబిరుదు<br>
తలకొని శరణాగతత్రాణబిరుదు<br>
గలదేవుఁడవు నీవు గావె శ్రీకృష్ణ! 1160<br>
కలనైన మీదాసగణముల కెల్ల<br>
జయముగా కిల నపజయ మేల గల్గు?<br>
భయ మేల గలుగు నోపరమాత్మ యనిన<br>
భావించి హరిభీష్ముఁ బరికించి పలికె<br>
నీవు నావాఁడవు నేను నీవాఁడఁ 1165<br>
గాని యన్యులమే జగన్నుతచరిత!<br>
భానుసూనుఁడు నొవ్వఁబలికినపలుకు<br>
లోకయింత మదిలోన నుంచఁగా వలదు

సకలసేనలఁ గూడి సమరంబుచేసి
భువనముల్ వినుతింప భుజశక్తి మెరసి 1170
యనిలీల గెల్చి రమ్మని సెల విచ్చి
రాధాతనూజుకరంబు చేపట్టి
యోధావళుల కెల్ల నొగి చెయిచూపి

కృష్ణుఁడు యుద్ధమునకు సన్నద్ధుఁ డగుట

ప్రమథులపై యదుబలముల నెల్ల
తమకంబుమీఱ నుద్ధతి గదియించి 1175
కాంచనాంబరుఁడు దిక్తటము లల్లాడ
పాంచజన్యంబు దాఁ బరఁగ మ్రోయించె
అమరనదీసూనుఁ డందరఁ జూచి
తమకంబు గినుక సందడిగొనఁ బలికె
పురుహూతసుత వాయుపుత్ర యాచార్య 1180
గురుతనూభవ కృపకురుకులాధీశ
శకుని దుశ్శాసన సైంధవ నకుల
సకలభూపతులార! జలజలోచనుని
ఘనతరసంగ్రామక్రమవాక్యసరణి

వినినారుగద మీరు వీనుల కొలఁది ? 1185
కదనరంగంబునఁ గదిసినవేళ
పదపడి మీబాహుబలశరప్రౌఢి
ఘనపరాక్రమశక్తి గాన నయ్యెడిని
యనుచుఁ జేతులు జాపి యఖిలసైన్యముల
పరువడి యక్షాదిబలములమీఁదఁ 1190
బురికొల్పి శంఖంబుఁ బూరించుటయును ;
అక్కడ ధననాథుఁ డావిధం బంతఁ
గ్రక్కునఁ గాంచి శంకరున కిట్లనియె
గౌరీమనోహర ! కంటివే యిపుడు
నీరజనాభుఁడు నీమీఁదఁ గదలె 1195

## శంకరదుశ్చేర సంభాషణము

వలనొప్ప పాండవవాహినీవితతి
నలిరేగి యుప్పొంగి నామీఁద నడిచె ;
గొదకొని హరిణంపుగుంపులఁ గాంచి
పొదలెడు గబ్బిబెబ్బులి విధంబునను
దానవేంద్రుండు మదోద్దండుఁడై కెరలి 1200

పూని కోపున మించి పొంచుకున్నాఁడు
ఎవరిపై దూకునో! యేకార్య మగునొ!
యెవరిఁ జెండాడునో! యెఱుఁగరా దింక;
పరమాత్మ ! దీని కుపాయ మే మనిన
నరవాహనునిఁ గాంచి నాగకంకణుఁడు 1205
బెదరేల నీకు కుబేర నే నిపుడె
యదుకులాగ్రణి మీఁద నరుగుచున్నాను.
నలినలోచనునకు నాకు పెన్నుద్ది
తిలకింప నతని మీఁదికిఁ రానీను
బలువిడి పాండవబలములమీఁద 1210
తలపడి నీవు యుద్ధముచేసి గెలువు
నరునితో నీవును నలకూబరుండు
సురనదీసూనుతోఁ జోడు గావలయుఁ
గాకున్న నోరులతోఁ గాదు పోరంగ
చేకొని గంధర్వసేనలతోడ 1215
గణుతికి నెక్కు రాక్షససేనతోడ
ప్రణుతింప కిన్నరబలములతోడ
వీరయోధులతోడ వెక్కసంబుగను

భైరవుఁ డిదె దైత్యపతిమీఁద నడుచు,
నని పల్కి సెల విచ్చి యఖిలసైన్యముల 1220
గనుఁగొని చేపీచి గదియించుటయును;
ఉభయబలంబు లిట్లొగిమారుకొనిన
రభసంబు లయ్యె తురంగహేషలును
భేరికానిస్సాణభీకరకాహ
ళారావముల్ పద్మజాండంబు నిండె? 1225
కరిరథఘంటికాఘణఘణంఘాణ
గురుతరధ్వానులు దిక్కులు పిక్కటిల్లె
తలపడి పోరు నత్తరి నెన్నరాని
బలుకయ్య మయ్యె నాబలముల కెల్ల
నీటెల బల్లెల నిలగుదుల్ గ్రుచ్చి 1230
తాటుచు దూటుచుఁ దలపడువారు
కత్తుల కత్తుల కకవికల్గాఁగ
హత్తి మత్తిల్లి చెండాడెడివారు
గదలచే గదలచేఁ గదలక నిలిచి
మొదలించి కదిసి యేట్లాడెడివారు 1235
బెడిదంపు పిడెములఁ బిడెములఁ దొడరి

యదరి కేడించి పోట్లాడెడివారు
పంకించి బాకుల బాకుల చికిలి
వంకిళ్ల వంకిళ్ల వరుస గ్రొవ్వాడి
చూరీల చూరీల జొచ్చి భేదించి 1240
చీరి డొక్కలు చించి చెండాడువారు
బలమును జలము నిబ్బరము నగ్గలము
బొలుపంద నందంద బోరాడువారు
నెలకొని చికిలి పన్నిదమాడునటుల
నెలమి కోలాటంబు లేయు కైవడిని 1245
యలరార బిళ్లద్రిప్పాడినకరణి
నలముక చిడుగుడు లాడెడిసరణి
జలధులు జలధులు సరిబోరునటుల
చలమున సమరంబు సల్పు నవ్వేళ
కనకాంబరధరుండు కర్ణునిమోముఁ 1250
గనుఁగొని చాల వక్కాణించి పొగడి
అల్లదె గనుఁగొను మయ్య రాధేయ !
మొల్లముగా మినుముట్టి యున్నదియు
విహితప్రదీప్తుల వృషభధ్వజంబు

అతఁడె లలాటాక్షుఁ డతఁడె శంభుండు 1255
పదరుచు శంకరుపార్శ్వభాగముల
గదలక నిలిచి యుగ్రప్రతాపముల
సొలవక నీదిక్కె చూచుచున్నారు
కలితతేజోనిధి క్రౌంచభేదనుఁడు
వీరభద్రుండును విఘ్నేశ్వరుండు 1260
వీరలతోఁ బోర విస్మయం బనిన
గమలాప్తతనయుండు కలకల నగుచు
గమలనాభునిమోము గనుఁగొని పలికె
పన్నగశయన! నాబాహాబలంబు
కన్నులపండువుగాఁ గనుంగొనుము. 1265
మదగజేంద్రంబుల మలసి పోనీక
రౌదమసింగంబు డాఁగోరించులీల
ప్రమథసేనల యక్షబలముల నెల్లఁ
దెమలింతు నిపుడె నా తెగువ వీక్షింపు
మరచితి ననక యేమరియుంటి ననక 1270

సరిది పరాకుసేయక నన్నుఁ జూడు[1]
నిఖిలమునిస్తుత్య నిగమాంతవేద్య!
అఖిలాండకోటిబ్రహ్మాండకుటుంబ
వైకుంఠనిలయ! గోవర్ధనోద్ధార!
శ్రీకరగుణమూర్తి! చిన్మయమూర్తి! 1275
దానవకులశిక్ష! ధవళాంబుజాక్ష!
మానితగుణజాల! మదనగోపాల!
అప్పుడు మిమ్ము నే నాడినయట్టి
తప్పులు మన్నించి దయఁబ్రోవు నన్ను
పన్నుగా సుతుఁ డెన్ని పలిమినఁగాని 1280
కన్నతండ్రికి ముద్దు గాదె శ్రీకృష్ణ
నావిని నవ్వి దానవకులాంతకుఁడు
వేవేగ గర్ణుని వీక్షించి పలికె
మాయురె! మేల్మేలు! మార్తాండతనయ
నీయెడ నాయెడ నేరము ల్గలవె 1285
నీవేమి నేనేమి నెనరైన మేన

---

1 పరవసేయక నన్ను పాటించి చూడు (ట)

బావవు తగువైన బంధుండ వీవె
పెద్దవు వరుసను బిన్నను నేను
తద్దయుఁ దండింప ధర్మము గాదె;
పాయక నేకమై బహుళనాళ్లనుంచి
మీయయ్య నేనును మెలఁగినవాఁడ ;[1]
తగవు లెంచక నిన్ను తప్పు లెన్నుదునె
యింక నే నొక్కటి యెంచెద వినుము
శంకరుతో నీవు సమరంబు సేయ
సన్నుతికెక్కిన సాహసు లచట
నున్నారు తగదయ్య యొంటిగా నేక
బలభద్ర సాత్యకి ప్రముఖులతోడ
బలువిడి నేతెంచి బవరంబు సేయు

---

1 మీయయ్యలోననె మెలఁగినవాఁడ
పాయని యన్యోన్యబాంధవద్వేష
లై యున్న కుముదకంజాప్తుల నెపుడు
గడురెండు రెండును గన్నులుగాఁగ
నెడపక వీక్షించి నేకంబు సేతు
తగ నిన్ను నేఁటి బాంధవ్యంబె మనకు (త)

మన విని నవ్వి కంజాతుని మోము 1300
గనుఁగొని పలికె నాకమలాప్తసుతుఁడు
మురదానవాంతక ! మున్నె యీయోధ
వరులెల్ల వినఁగ దుర్వారప్రతిజ్ఞఁ
బలికితి శంకరప్రముఖులౌ యోధు
లెలమి నాజోడంటి నిఁక మాట లేల ? 1305
శంకరుతో యోధచయములతోడ
పంకించి గెలిచిన ప్రబలు నాకీర్తి
తెగి నన్ను వారు సాధించిరే నీవు
పగ దీర్పుదువుగాని పంకజనయన
నను సంతరించిన నరవరోత్తముఁడు 1310
గనుఁగొని మెచ్చ విక్రమముఁ జూపెదను
ననుఁజూడు, ప్రమథాదినాథులఁ జూడు
మని పల్కు, సకలసైన్యములు భేదిల్ల
విలుగుణధ్వనిచేసి, విఘ్నేశుఁ దాఁకి
యలఘుబాణంబుల నతని నొప్పించి 1315
వీరభద్రుని రెంట వికలంబుసేసి
తారకారిని శరత్రయమున నొంచి

నలువందఁ జండీశు నాల్గింట నేసి
యలరుచు భృంగీశు నైదింట గ్రుచ్చి
తక్కినరథికులదర్పంబు లణఁచి 1320
ఱుక్కిన బలములనెల్ల ఖేదించి
బారులు చీకాకుపడఁ జెండి నైచి
తేరులు కూల్చి గద్దించి ఢీ యనుచు
కరుల నేలణఁగించి ఘనుల బోఁ దరిమి
హరుల నీరుగఁ జేసి యార్భటుల్జేసి 1325
అంగజహరుని డాయంగ నేతెంచి
పొంగి వైశ్వానరభూరిసాయకము
నరుదార గంధపుష్పాక్షత ధూప
వరమంత్రయుతముగా వైచెఁ; వైచుటయు
వెరగంది వీక్షించి వీరభద్రుండు 1330
వరుణాంబకంబుచే వహ్నిబాణంబు
తుమురులు గావించి దోశ్శక్తి మించి
యమరులు ఖేదిల్ల నార్చి కోపించి
యిన నందనుని దాఁకి యిషుపరంపరల
పనుపడ గరిదూరి పారనేయుటయు; 1335

రౌద్రుఁడై కర్ణుండు రహి నార్చి వీర
భద్రునియరదంబు పడగయు విల్లు
తురగసారథులతోఁ దునియలుసేసి
గరకరి మేనెల్లఁ గాడ నేయుటయు ;[1]
పరువడి యవ్వీరభద్రుండు గెరలి 1340
సురలు ఛేదిల్ల శేషుఁడు తల్లడిల్ల
పటపట బ్రహ్మాండభాండము ల్పగుల
ఘుటఘుటధ్వనిచేసి కో యని యార్చి
కరవాలమును బల్కుఁ గైకొని రోష
భరితుఁడై భానుసంభవు నిరీక్షించి 1345
తలవాంచి ఖడ్గంబు తళతళ మనఁగ
ఝళిపించి రథముపై చంగున దుమికి
కుప్పరం బెగసి దిక్కులు నిరీక్షించి
యుప్పొంగి యదువీరయోధుల దరిమి
సముదగ్రరథరథ్యచయములతోడ 1350
కమలాప్తనందను ఖండించుటయును ;

1 కరకరి మేనెల్ల గదియ నేయుంటయుం ; (ట)

భావించి కర్ణునిపాలెల్లఁ జూచి
భావజజనకుండు పాంచజన్యంబు
పూరించి రథికులఁ బురికొల్పుటయును ;
ధారుణి వణఁక నుద్దండవేగమున 1355
జని బలప్రద్యుమ్నసాత్యకి ముఖ్య
ఘనయోధవర్యు లొక్కటఁ జుట్టుకొనినఁ
గాంచి భృంగీశ్వరగణనాయకులను
క్రౌంచభేదనముఖ్యరథికశేఖరులు
ప్రధనజయాకాంక్షఁ బ్రౌఢి నేతెంచి 1360
పృథ్వి భేదిల నార్చి బెట్టు దాఁకుటయు ;
నదరి కోపించి తాలాంకుఁ డవ్వేళ
తోడఁబడి గణనాథుఁ దొడరి పోరాడె
భద్రవిక్రమకళాప్రౌఢచే వీర
భద్రునిఁ దాఁకి సౌభద్రుండు పోరె 1365
సాత్యకి చెలరేఁగి షణ్ముఖుతోడ
నత్యంతబలశక్తి నని సల్ప నపుడు ;
నందికేశ్వరుమీఁద నడిచెఁ బుష్కరుఁడు
కందర్పరిపుఁ దాఁకె కమలలోచనుఁడు

తక్కిన యట్టియోధులు యోధకోటి 1370
యక్కజంబుగఁ బోర నాసమయమునను;
అక్కడ కౌరవయక్షసేనలకు
మిక్కుటంబై హెచ్చి మించె కార్యంబు
జక్కులతేనికి సవ్యసాచికిని
నుక్కుమిఱిన మహాయుద్ధంబు గలిగె 1375
నలువందగా భీష్మనలకూబరులకు
బలిమైన కయ్యంబు ప్రకటించి మించె;
నెలకొని ద్రోణ మణి గ్రీవులకును
గలితమహోగ్ర సంగ్రామంబు చెల్లె;
మలయు నశ్వత్థామ మణిమంతులకును 1380
నలరు నుదగ్ర జన్యము సంభవించె;
రథికశేఖరులకు రథికో త్తములకు
ప్రధనముగ్గలముగా బలసె నవ్వేళ;
కనలి కిన్నరదైత్యగరుడగంధర్వ
ఘనచమూవితతి రాక్షసనేన దాఁకి 1385
లలిమీఱ తిలతండులన్యాయమునను
గలసి భయంకరగతిఁ బోరువునపుడు

అలఘు తేజోమూర్తి గునభైరవుఁడు
జలజభవాండముల్ జడియ ఘోషించి
నిప్పులు దుమికెడు నిఖిలాంబకములఁ 1390
గుప్పించి బలము జక్కులు సేసి డాసి
బలువిడి సేనాధిపతుల ఖండించి
చెలరేఁగి రాక్షసశ్రేష్ఠులఁ ద్రుంచి
మారుతాత్మజునికుమారునిఁ దాఁకి
క్రూరతగండభేరుండధ్వజంబుఁ 1395
దునుమాడి విలు రెండుతునియలు చేసి
యనుపమాటోపుఁడై యరదంబుఁ గూల్చి
తను వెల్ల జర్ఝరితంబు సేయుటయుఁ;
దనుజనాథుఁడు మదోద్దండుఁడై కెరలి
గగనంబు మెరయంగ గాయంబు పెంచి 1400
తెగువచే దిశ లెల్ల భేదిల్ల నార్చి
భైరవుపాదము ల్బంధించిపట్టి
ఘోరున మిన్నంత పొడవుగా నెత్తి
గుప్పించి ధరణిపైఁ గూలఁగా మోది
యుప్పరం బెగసి మహోగ్రుఁడై యుండి 1405

వినువీథి దానవవీరులతోడ
ఘనఘనాకారముల్ గైకొని నిలిచి
పట్టుగాదశదిశాభాగంబునందు
దట్టంపుచీకటుల్ దార్కొన మించి
మిన్నుకైన యడిదంపు మించుట మించి 1410
యొనరనార్భటులును నురుములు నురిమి
పురుహూతుపాపంబుఁ బోలినయట్టి
వరశరాసనము చెల్వమునఁ జేపట్టి
కరకరినావర్త కాలమేఘములు
వరుస కుంభద్రోణవర్షము ల్గాఁగ 1415
గురియుచందంబున ఘోరతరోగ్ర
శరవర్షములు ముంచి చలము రెట్టించి
పిడుగులవానలు బెడిదంపు నారి
యడిదంపువానలు నద్రులవాన
లురుతరభీతి నాయుధములవాన 1420
లరిముఱి గురియించి యధికుఁడై మించి
యొకచోట హాసియించు నొకచోటఁ గేరు
నొకచెంత గర్జించు నొకట గద్దించు

నొకఁడ్రేవఁ బలు రొప్ప నొకఁడిక్కఁ నార్చు
నొకఁడొంకి నదలించు నొకఁడజ్జ గదుము 1425
పేరుపేరులఁబిల్చు పేరెముల్బారు
భోరుభోరునదూరు భుజములు సరచు
మసలి వర్తిలు పెక్కుమాయలు పన్ను;
కసినొక మరియు రాక్షసకులేశ్వరుఁడు
బలిమి కిన్నరయక్షప్రమథసైన్యములఁ 1430
బొలియించి వెస నొక్కప్రోవు గావించి
మేటియోధలనెల్ల మేదినిఁ గూల్చి
దీటైననరథికులఁ దెంపునఁ జంపి
తక్కిన దొరల యోధలరథోత్తముల
పెక్కుమార్గణముల భేదించుటయును; 1435
కరులేఁగె హయములు గదలె కాల్బలము
పరువెత్తె రథికులు పారిరిదిశల
తరుచుగా నున్న వేదండగాత్రముల
మరుగుల నడఁగిరి మావంతకులము
హయకళేబరముల నటునిటుఁ ద్రోచి 1440
రయమున దూరిరి రాహుత్తతతులు

సలలితరథచక్రచయములక్రింద
నళుకుచుం జొరబారి రథికయోధులును
బెదరుచుం బీనుంగుపెంటలలోన
నొదుగుచు డాగిరి యొగి వీరభటులు 1445

## ఘటోత్కచుడు శివునితో యుద్ధంబు సేయుట

అంతట బోక నయ్యసురవల్లభుఁడు
కంతువిద్వేషిపై గమకించుటయును;
కనలి శంభుఁడు పినాకం బెక్కుపెట్టి
వనధు లింకఁగ గుణాధ్వనిచేయుటయును;
ఘనరోషచిత్తుఁడై గణనాయకుండు 1450
వినుతప్రతాపుఁడై వీరభద్రుండు
ప్రళయాంతకునిలీల బాహులేయుండు
ఇలమహోద్దండుఁడై భృంగీశ్వరుండు
జగదేకవీరుఁడై చండీశ్వరుండు
నగణితాటోపుఁడై యుద్ధనాయకుఁడు 1455
నగభిత్ప్రతాపుఁడై నందికేశ్వరుఁడు
నతులరణాద్యుక్తుఁడై మణిగ్రీవుఁ

డతిబలవిక్రముండై మఖమంతుఁ
డాదిగాఁ గలుగుమహాయోధవరులు
మేదురంబుగఁ బన్ని మిన్నగ్రక్కుదల[1] 1460
బెట్టార్చుచును నొక్కపెట్టున నేఁగి
కట్టల్కఁ గగనభాగం బెల్లఁ గప్ప
ననలానిలాదిదివ్యాస్త్రజాలముల
ఘనతపింజాపింజఁ గదియనేయుటయు ;
ఆవిధమంతయు నరుఁ డార నపుడు 1465

అభిమన్యుఁడు యుద్ధమునందు మూర్ఛిలుట

భావించి గాంచి సౌభద్రుండు గెరలి
జగములు పదునాల్గు జలదరింపఁగను
గగనంబు వగుల శంఖంబుఁ బూరించి
దారుణసింహనాదంబుఁ బర్వించి
ధీరత వారేయుదివ్యబాణముల 1470
నన్నింటిఁ బొడిచేసి యరదంబు నూకి
యొన్నఁగా భృంగీశు నేడంబకముల

---

1 మేదురంబుగ ధాత్రి మిన్నుగ్రక్కుదల (ట)

సారథి సేనాని సైదుబాణముల
వీరభద్రుని జండవిశిఖత్రయమున
గణనాథు శితసాయకముల నారింట 1475
మణిమంతు నెనిమిదిమార్గణంబులను
గినుకతో నలమణిగ్రీవు నాల్గింట
ధననాథసుతుని బద్మాల్గుశస్త్రముల
నరవాహనుని ఘోరనారాచతతుల
వెరి నొవ్వ నేసి సైనికుల ఖండించి 1480
యతిరథోత్తముల మహాయోధవరుల
జతురంగబలముల సమయించి మించి
శంభునిపై మహాశక్తి సంధించి
గంభీరముగ నార్చి కనలి యేయుటయు;
అమహాసాయక మురుదారఁ గాంచి 1485
వామదేవుండు పావకశరంబునను
ఖండించి కులిశమార్గణము సంధించి
చండకోపాటోపసంరంభుఁ డగుచు
నభిమన్యుపై నేయ నరి శతకోటి
రభసంబుతోడఁ బార్థతనూజు నురము 1490

డాఁకిన ఘనధరాధరముపై నడిని
భీకరంబుగ నార్చి పృథివిపై బ్రాలె
అభిమన్యుపాటు దా నంతయుఁ జూచి
రభసంబుతో నేఁగి రాక్షసేశ్వరుఁడు
ఉభయసైన్యములెల్ల నొగి బెగ్గడిల్ల 1495
త్రిభువనంబులు స్రుక్కి దిశలు గంపింప
దారుణంబైన కోదండరాజంబు
జ్యారవం బడరించి శక్తి సంధించి
యనలసాయకమును నద్రిబాణంబు
ననిలశిలీముఖం బమరేంద్రశరము 1500
వరుణమార్గణమును వనధరాస్త్రంబు
గురునిశాశుగమును కులిశబాణంబు
పన్నగారిశరంబు భాస్కరాశుగము
పన్నగబాణంబు పటురౌద్రశరము
నలిరేగి యొకపరి నారి సంధించి 1505
యలిగి కోపించి యాహారున కిట్లనియె
భూతేశ! నీకేల భూరియుద్ధంబు?
నాతో నెదుర్పడ నాదిటు గావు;

పునుకపాత్ర యు బెద్దపులితోలుకాశ
మినుకులుగలగాలిమేఁతలసొమ్ము 1510
పూని ధరించిన పురియులపిండు
ఏనుఁగుచర్మము హేయ్యంపుపటము
జడలు మెండుగఁ దాల్చి జడియక రేలు
బడుగు కల్లరికాటి పాపనిలీల
భూతిమై పూసి యాఁబోతు నెక్కి 1515
జాతిమాలిన వేషభాషలు నేర్చి
దయ్యాలరాజవై తగ కాడు గాచి
యయ్యెడ నుండక నని కి రాఁ దగునె!
పోడిమి ఘనులతోఁ బోరాడు టెల్ల
వేడుక కుడుముల పేట్లాటగాదు 1520
పొమ్ము శ్రీశైలాసభూధరంబునకు
నిమ్మహీశరముల నీల్గఁగావలదు;
అని యార్చి యేసిన నతిభీకరముగఁ
జనుశిలీముఖముల శంభుఁడు గాంచి
ప్రతిబాణముల నవి భంజించి వైచి 1525
యతులసాయకముల నతని నొప్పించి

కనలి యంతటఁ బోక కందర్పవైరి
దనుజనాథుని మాయ దలగింతు ననుచు
నలువొంద వాయు బాణంబు సంధించి
వలనొప్ప మంత్రపూర్వకముగా వైచె 1530
అది రెండు నాలు గై దారును నగుచుఁ
బదియు నల్వదియు నర్వది నూరు నగుచుఁ
గడు నేఁగి వేలు లక్షలు గోటు లగుచుఁ
దడయకఁ జని యర్బుదంబులు నగుచు
ఘనఖర్వములు మహాఖర్వము లగుచుఁ 1535
జని శంఖములు మహాశంఖము లగుచు
బహుపద్మములు మహాపద్మము లగుచు
మహి ననంతానంత మహిముల నేఁగి
దనుజాధినాథునిఁ దద్బలంబులను
దనరు తేజంబులఁ దాఁకె; తాఁకుటయుఁ 1540
బరువడి సురరాజుపై దండు గదలు
గురుతైన కాటుకకొండలో యనఁగ
తిరమొంద మదనుండు దివిజులమీఁదఁ
బరపు నీలోత్పల బాణంబు లనఁగ

గగనతరంగిణీ కంజవాసనల 1545
కెగయు నిందిందిరబృందంబు లనఁగ
నమరారిసైన్యంబు లాకాశమునకు
నమరులు ఛేదిల్ల నవరూఢి నెగసి
పురహారు ఘనరోషమున కోర్వలేక
పరువు లెత్తెడు దేవభామల మెడల 1550
సరములు త్రెవ్వి విచ్చలవిడి దిశల
నెరసి రాలెడు నింద్రనీలంబు లనఁగ
కడిమి ఝంఝానిలఘాతంబువలన
పడెడు జంబూఫల పంక్తు లనంగఁ
గొందఱు దనుజులు ఘోరదుర్గములఁ 1555
గొందఱు దానవు లు[illegible]కూపంబులందుఁ
గొందఱు రాక్షసుల్ గుహనదీతతులఁ
గొందఱు రక్కసుల్ కొండలయంద
గొందఱు దీవుల కొందఱు దిశలఁ
గొందఱు జలధులఁ గొందఱు చెఱల 1560
వాపోవుచును బెట్టువడఁకుచు జెలఁగి
చాపకట్టుగఁ గూలె సకలసైన్యములు

సహిఁ గెక్కు నెరయోధవర్యులతోడ
రహిమించు బంధువర్గంబులతోడ
మెరుధీరులు నగు మిత్రులతోడ 1565
భూరిబలాఢ్యులౌ పుత్త్రులతోడ
బిరుదులు పోనాడి భీమనందనుఁడు
గురుతైన రణభూమిఁ దోలె నంతయును
గనుఁగొని కనలి పంకజలోచనుండు
కను లెఱ్ఱచేసి శంఖంబుఁ బూరించి 1570

ఘటోత్కచుఁడు మూర్ఛిలుట

బిరుదారిసందోహాభీముని భీము
సరసతేజోధనంజయు ధనంజయుని
ప్రాకట బలజగత్ప్రాణుని ద్రోణు
భీకరారాతి విభీష్ముని భీష్ము
తెరలని యభిమానధను సుయోధనుని 1575
ధరనగణ్యోభ సైంధవు సైంధవుని[1]

1 a. ధరనగణ్యాభవ సైంధవు సైంధవుని (ట)
2 b. ధరనగణ్య భజనధవుని సైంధవుని (ట)

రమణ బాహుబలాభిరాముని రాము
కమనీయనతుల ప్రద్యుమ్నుని పుష్కరుని
పరికించి పురికొల్పి పాంచజన్యంబు
తరుచుగాఁ బూరించి తమకించి మించి 1580
ధనువున నైదుశస్త్రములు సంధించి
ఘనరోషచిత్తుఁడై గదిసె కృష్ణుండు
నరవాహుని ఘోరనారాచములను
విరథుని గావించి విహ్వచ్ఛుఁ డపుడు
గుణరవం బడర నుగ్రునిమీఁదఁ గదిసి 1585

## కృష్ణుఁ డొనర్చినయుద్ధము

మణికేతనునిఁ గూల్చి మణిమంతుఁ జంపి
పవమానతనయుండు పశుపతిమీఁదఁ
గవిసి నిష్ఠురతరకాండము ల్గొనిపి
గురుభీష్మ గురుసుత కురురాజముఖ్యు
లురుశరావలిముంచి రుగ్రునిమీఁద 1590
భీమార్జునులమీఁద భీమప్రతాప
ధాముఁడై సేనాని తలపడి పోర

వెలుచ నుగ్రతగుదుభీష్ములమీఁదఁ
బలుచిత్రగతి వీరభద్రుండుపోర
సాత్యకి ప్రద్యుమ్నసహదేవనకుల 1595
నత్యంతబలశక్తి నాగె కుబేరుఁ
డాచార్యతనయ[illegible]లాంకులతోడ
నేచివిఘ్నేశ్వరుం డెదిరి పోరాడె
చలమున పుష్కరసాంబులతోడ
జలదరింపకఁ బోరెఁ జండీశ్వరుండు 1600
వరుస తక్కిన యోధవరులు యోధులను
బోరిపోరి జయకాంక్ష బోరు నవ్వేళ
అంతట గెరలి రథాంగధరుండు
కంతువిద్వేషిపై గదిసి యుప్పొంగి;
చటుల శిలీముఖసారము ల్పొంచి 1605
పటుతరానిలవహ్నిబాణము దొడిగి
భాసురంబుగ వీరభద్రునిమీఁద
నేసిన నవి దాఁకి యిలఁ గూలె నతఁడు
నారాయణాస్త్రంబు నారి సంధించి
ప్రారూఢమంత్రపూర్వకముగా గుహుని 1610

పై నేయ నది మహాప్రళయప్రచండ
భానువైశ్వానరభాసు ప్రకాశ
మగుచు నేతెంచి క్రౌంచారివక్షంబు
పగటున దూరి వెల్పగముగాఁ బడిన
నరుదార నైంద్రాస్త్ర మరిబోసి డాసి 1615
పరువడి విఘ్నేశుఁ బడ నేయుటఁయును
ధరణిపై నొరగిన తనయులవంక
పరికించి క్రోధించి ఫాలలోచనుఁడు
హరిమీఁద ఘోరశరావళి ముంచి
గరుడధ్వజంబుపైఁ గడు కొన్ని బరపి 1620
యనలాంబకమునఁ దాలాంకుని నొంచి
యనిలసాయకమున ననిరుద్ధుఁ గూల్చి
ద్రోణుని శక్తిచేఁ దునుమాడి పంచ
బాణుని శరపరంపరల మర్దించి
కులిశమార్గణమున గురుసుతు నొంచి 1625
జలధరాశుగమున సాత్యకి ద్రుంచి
సాంబుని ఘనరౌద్రశరమున నణఁచి
యంబకత్రయమున ననిలజు గెడపి

భూధరాశుగమునఁ బుష్కరుఁ డనిమి
యోధావళులనెల్ల నొడిఁ ద్రెళ్ళనేసి 1630
గాండీవి నొక్కట గళవళపరచి
పుండరీకాక్షుపై భోగిశరంబు
బరపిన హరిరోషభరితుఁడై మండి
గరుడాంబకంబున ఖండింప దాని
గౌరీశుఁ డధికవేగమున సంధించి 1635
శ్రీగవాధ్యక్షుపై శిఖిసాయకంబు
పరువడి జొనిపిన పంకజాక్షుండు
వరుణసాయకమున వారించి కినిసి
కనలుచు ఘనఘనాఘనబాణమేయ
ననిలశరంబున నవి ద్రుంచివైచి 1640
భవుఁడు మహారౌద్రబాణంబు పరప
నవలీల నారాయణాస్త్రంబుచేత
నలినేసి సమ్మోహనాస్త్రంబు వేయ
చెలఁగి శంభుఁడు శక్తిచే నది ద్రుంచి
యబ్జాక్షుమీఁద మహాశస్త్రమేయ 1645
నబ్జభవాండము లట్టిట్టు లెదరఁ

జనుదేర శౌరి యాశరము నీక్షించి
వనజాసనాస్త్రంబు వైచి నిల్పుటయు;
గజచర్మధరుఁడు డగ్గర జేర నేఁగి

## హరిహరసంవాదము

గజవరదుని మోముఁ గనుఁగొని పలికె 1650
సరసిజలోచన! జగములఁ బ్రోవ
ధరణీభారము మాన్పఁ దనర నిర్మింప
నీవు నేనును దక్క నిఖిలలోకముల
భావింపఁగలరె! యీ ప్రతిభలు వారు
ధననాథ పాండురాట్తనయులవలన 1655
మనలోన మనకింత మాత్సర్యమొదవె
జగతి నెవ్వారికైనసరి జంపరాని[1]
పగ గెల్వరా దను పటువాక్యసరణి
నెరయ చింతించిన నిక్కువం బాయె;
సరిపోర నిది ధర్మసంకట మాయె; 1660

1. a. జగతి నెవ్వారికైన సాధింపరాని (ట)
b. జగతి నెవ్వారికైన సరిచెప్పరాని (త)

జగముల నింకొక సాటిన గలదు;
తెగి పూఁటబడినచో దిద్దగావలయు[1]
తగఁదోడుపోయినఁ దప్పునట్ల దగదు
జగడంబులోన వంచన సేయరాదు
నిన్ను నమ్మినవాఁడు నెమ్మి ధర్మజుఁడు 1665
నన్ను నమ్మినవాఁడు నరవాహనుండు
నీవె గెల్తువటంచు నే గెల్తునంచు
భావింపుచున్నారు బవరంబు మాని
వారికి వేడుకల్ పాటిల్ల ఘనము
పోరి నాయ మెఱింగి పోట్లాడవలయు 1670
గరిమతో సాధనకయ్యముల్ సేయ
పరికించువారెల్లఁ బకపక నగరె!
పొలవక నీనేర్పుఁ జూచెద నేను
కలగక నానేర్పు గనుఁగొను నీవు;
అని కేల కేలికేరాభీలజాల 1675
జనన తేజఃకాండచండస్ఫులింగ

1. తెగిపూఁటబడినచో దిద్దగావలయు (2421)

మాలికాలంకార మహిత త్రిశృంగ
పాలితఖురాలక పాలమై వెలయు[1]
శూలంబుఁ గైకొని సూటిగాఁ బూని
పోలించి శౌరిపైఁ బూని నిల్చుటయుఁ; 1680
కనకాంబరుఁడు మహోగ్రహమున గెరలి

## హరిహరుల సమరము

కనలి శంకరుని యగ్గలిక వీక్షించి
తగవు లెంచను నింక ధర్మంబుగాదు
తెగి మరికొంచించితే కార్యహాని
యని పేర్చి పాంచజన్యంబుఁ బూరించి 1685
తనర దక్షిణభుజాదండంబునందు
మధుకైటభాసురమస్తకకంఠ
రుధిరానులేప నారుణిమసంక్రాంత
బహుళతరాజ్యహాళుల ప్రకటప్రయోగ
వహనవహ్యాశనజ్వాలికాజాల 1690

---

1. a. పాలిసరాలక పాలమై వెలయు (ట)
   b. ఫాలికా కారాలఫాలమై వెలయు (త)

విలయావసరమధ్యవేలాతివేల
చలిత చరాచర జగదంతరాళ
తంతప్యదుష్ణసంధాన సహస్ర[1]
కాంతిచ్ఛటాంశుప్రకాండప్రచండ
సముదయద్వాదశసంఖ్యావిధాన 1695

తిమిరహారాదిత్య దేదీప్యమాన
దశశతసారారధారానుసార[2]
నిశితరథాంగంబు నీటుతోఁ బూని
నలువందపాంచజన్యంబుఁ బూరించి
సొలవక హరునిపైఁ జూడ్కి నిల్పుటయు; 1700

ఆచక్రవాళపర్యంతవిశ్వంభ
రాచక్రమంతదుర్వారవేగమున
వరుస కుమ్మరసారెవైఖరి నొరసి[3]

---

1. తంతప్తమానసంధాన సహస్ర (త)
2. a. దశశతసారసంధానానుసార (ట)
   b. దశశతసారాంధధారానుసార (త)
3. వరుసకుమ్మరసారెవైఖరి దిరిగ (త)

గిరగిర గిరగిర గిరగిర దిరిగె;
పటుతర బ్రహ్మాండ భాండజాలములు 1705
పటపట పటపట పటపటఁ బగిలె;
తనరారుచున్న పదునాల్గులోకములు
ఘనభయంబుల హల్లకల్లోలమయ్యె;
పొలుపొందునట్టి యంభోనిధానములు
వెలుచ నీరము లింకి బీటలు వారె! 1710
కులతలంబుతో సప్తకులపర్వతములు
గతితప్పి బలుక్రుంగి కానరావయ్యె
ప్రకటించి చీకాకుబడె ఫణిరాజు;
కకలిక లగుచు దిగ్గజములు బెగడె;
సురసమూహంబెల్ల చూడ్కులు మాని 1715
వరువడి వడి పటాపంచగా నేఁగె;
ఆవేళ తల్లడమంది పద్మజుఁడు

బ్రహ్మదేవుఁడు హరిహరులకడ కేతెంచుట వారల స్తుతించుట

వావిరి దగదొట్టిపడి దొట్రుకొనుచుఁ
గ్రక్కున హంసతురంగరాజంబు

నెక్కి యక్కజముగా నిలచి సేవించి 1720
ముచ్ఛ్రంబున నున్న మాధవహరుల
విచ్చలవిడి మది వెరగంది చూచి
యురువురనడుమ దా నెంతయు దుమికి
శరణంబు శరణంబు శరణం బటంచు
నటు మళ్లి యిటు మళ్లి యటు నిటు మరలి 1725
పటుభయభక్తితోఁ బ్రణమిల్లి లేచి
నయమొందఁగా హస్తనలినము ల్మోగిచి
జయజయ కమలాంక శరశిలాటాంక[1]
జయజయ సితగాత్ర సత్యచారిత్ర
జయజయ గోరాజ సన్నుత తేజ 1730
జయ దైత్యశిఖపుష్కరహితాబ్జాక్ష
జయజయ గోత్రాత్మజామనోరమణ
జయ రాజశేఖర సలలితోదార
జయజయ వరఖగజానేయజనక[2]

---

1. a జయజయకమలాంక శశిలాటాంక (త)
   b జయజయకమలాంకశరశిలాటంక.
2. జయజయ భర్గ గజాననజనక (త)

అని యిట్లు మురహరహరుల నెంతయును 1735
వినుతించి భారతీవిభుఁ డిట్లు పలికె
విలసిల్లు వేదాంతవేద్యులు మీరు
పుట్టింపఁ గిట్టింపఁ బోషింప మీరు
పొలుపొంద కర్తలు భోక్తలు మీరు
పట్టుఁ గొమ్మలు మీరె ప్రభువులు మీరె 1740
నూతనలీలావినోదులు మీరె
యీతెఱంగునఁ గలహింపధర్మంబె?
సకలజీవులు మీకు సరిగావె తలఁప
ప్రకటింప హితు లేరి? పగవార లేరి?
తెరలలోఁ బ్రతిమలతెరఁగున జనుల 1745
నొరపుగా నాడించుచున్నారు మీరు
యమసుతుఁ డెవఁడు? యతనాధిపుఁ డెవఁడు?
సమమె మీరిద్దరు జగదీశులార
బాలుఁడ నొకవిన్నపము సేతు వినుఁడు;
మీలోన మీకేల మేటికార్యంబు 1750
భువి నావులావులును బోట్లాడి కెరలి
కవిసిన లేగలకాళ్లెల్ల విరుగు

మీ కేమి పని లేదు మిగిలినయట్టి
లోకముల్ హల్లకల్లోలముల్ గావె;
కోపము ల్వారించి కూర్మి పాటించి 1755
చేపట్టి వస్తు రక్షింపఁగావలయు;
నని దైన్యగసమున నడలుచుఁ బలుకు
వనజాసనుని గాంచి వరదయానిధులు

### యుద్ధము మానుట

తగవిచారించి మాత్సర్యముల్ డించి
యొగి మహాయుద్ధముల నుపసంహరించి 1760
గజరాజవరదుండు గజచర్మధరుఁడు
గజిబిజి చాలించి ఘనత నేతెంచి
యొలమితోడ విరించి యొడదయ లుంచి
యలుకు వారించి చయ్యన గారవించి
యిరువురు నొకపరి యిరవందఁ జేరి 1765
కరము రంజిల్ల గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి
యొకటియై మువ్వురు నుండి యాలోన
మకరాంకవైరితో మాధవుం డనియె

అనఘాత్మ నీవు నే ననుభేద మేమి
మనవినోదవిలాసమహిమలుగాక 1770
నెనయ వేరొండులే దెన్నటికైన
చనిన కార్యంబులు చనఁ గని మ్మింక
ధననాథునకుఁ బాండుతనయుల కిపుడు
కనకాబ్జములనుంచి గలిగె కయ్యంబు
గరిమ రెండును రెండుకన్నులు మాకు 1775
మరి వలపక్ష మేమాత్రము లేదు
వారల వీరల వైరముల్ మాన్చి
గారాపు వియ్యంబు గల్పింపవలయు;
నని పాండవాగ్రణి నర్థనాయకుని

హరిహరులు ధర్మయక్షనాథులకు సఖ్యమును జేయించుట

జనువునఁ బిల్చె నాచక్రాయుధుండు 1780
పిలిచినయంతనె ప్రియసంభ్రమములు
దళుకొత్త శ్రీదుండు ధర్మనందనుఁడు
క్రమమున నేతెంచి ఘనభయభక్తి
రమణ హరిహర హిరణ్యగర్భులకు

వినయమార్గంబుల వేర్వేర నొక్కి 1785
వినుతులు గావించి వెస నిల్చుటయును;
వేడుక మువ్వురు వీరశేఖరుల
పోడిమి దీవించి పొసగ లాలించి
గారవంబున వారికలక వారించి
గారాపు వియ్యంబు గల్పించి చెలఁగి 1790
హరుఁడు ధర్మజువదనాబ్జంబుఁ జూచి
కరుణారసము చిల్కఁగా నిట్టు లనియె
పాండవాగ్రణి నీద భాగ్యంబు ధరణి[1]
మండలాధిపతుల కీమహిమలుగలవె !
తనయులు చండప్రతాపవిక్రములు 1795
ననుజాలజేయు లగణ్యసాహసులు
నలఘు ధీరోదారు లరిభయంకరులు
బలశౌర్యవిభవులు బాంధవాశ్రితులు
వెలయంగ హయ్యంగవీనాపహరుఁడు
చెలికాఁడు చుట్టంబు చేరిక మరఁది 1800

1. పాండవాగ్రణి నీవు భరితపుణ్యుఁడవు (త)

దైవంబు భృత్యంబు దాతన్గాఁ మెలఁగ;[1]
నీవు చేసినపుణ్య మెన్న శక్యంబె!
నీశాంతగరిమంబు నీసత్యమహిమ
నీశౌర్యవిస్ఫూర్తి నీధర్మగుణము
నెరయ నీశీలము నీనేర్పునోర్పు 1805
వరుసనాగ్గురుచక్రవర్తులందైన
నమర చూడము విన్న యదిలేదు రాజ!
మెచ్చె కృష్ణుఁడు నిన్ను మెచ్చితి నేను
యిచ్చుకువచ్చిన యేవరంబైన
నడుగు మిచ్చెద నన హర్షనకు మ్రొక్కి
తడయక నాధర్మతనయుఁ డిట్లనియె; 1810

ధర్మజుఁవరము

పార్వతీవల్లభ భవరోగవైద్య
శర్వ మహాదేవ శంకర భర్గ
భూతనాయక ఫణిభూషణ సర్వ
భూతదయాపర భువనప్రతాప 1815
జలజనాభుఁడు మీరు సన్నిహితులుఁ

1. దైవంబు భృత్యుండు దాతన్నై మెలఁగ (ట; త)

బోలుపొంద సూత్రంపుబొమ్మలలీల
నాడింప మాదెద మంతియకాని
పోడిమి మాకింత బుద్ధులు గలవె
పరమమునీంద్రులు భక్తసంఘములు 1820
వర దేవకోటులు వర్ణింపలేరు;
పరఁగ మీమువ్వురిపాదపద్మములు
వరుస గాంచుటకంటె వరములు గలవె;
యాపద దొలఁగె సౌఖ్యము లబ్బె సకల
పాపముల్బారె సంపదలు చేకూరె 1825
నన్నియు ఫలియించె నైనగిరీశ
చెన్నొంద మీర లిచ్చినవరం బేను
వెరువక వేడెద వినుము మాకోరకు
నరవాహుపైని పంతములతో వచ్చి
కవనిలోఁ జీకాకుగాఁ బడియున్న 1830
బలములనెల్ల నెప్పటివిధంబునను
గలఁగక దొలఁగక కసిగందనీక
నలరంగ బ్రతికింపుఁ డదియె నావరము
అన విని మోదించి యతనివేడుటకు

యుద్ధమున జచ్చినవారు మఱలబ్రదుకుట

మనమున వార్షించి మాధవహారులు 1835

అరుదైనకరుణాకటాక్షమాధుర్య
వరసుధాసారము ల్వర్షించుటయును
వరుసతుత్తుమురులై వ్రాలినయట్టి
నరయక్ష దనుజకిన్నరముఖ్యబలము
లనువందఁగాఁ గోమలాకారు లగుచు 1840

మునుపటికంటెను ముదమునఁ బొదలి
ఘనమైన నిద్ర మేల్కానినచందముల
నెలయు వేడుకలవాహిను లెల్ల లేచి
వెలయు వైభవముల వితతవైఖరుల
నలువందు బంధు రానందులై రపుడు; 1845

సురలు వర్షించిరి సూనవర్షములు
దురుసుగా దేవదుందుభులు ఘూర్ణిల్లె
ఘనముగా గంధర్వగానము ల్పరఁగె
వినవయ్యె తుంబురువీణారవములు
నమితమై తగె నారదాదులనుతులు 1850

నమరె రంభాదినాట్యప్రసంగములు
నలినలోచనుఁడు పన్నగకంకణుండు
జలజాసనుండును సంతుష్టులైరి
అప్పుడు ధననాథు నాననాంబుజము
తప్పక చూచి కందర్పారి పలికె 185

**శివుఁడు కుబేరునితో సౌగంధికములను బాండవుల కిమ్మని చెప్పుట**

ధననాథ వింటివె ద్రౌపదీరమణి
కనకాబ్జములు గోరి కాంక్షించె నిపుడు
వనజాతములనుంచి వారికి మీఁకు
ఘనతరం బైనసంగరము వాటిల్లె
పాండునందనులు మాభక్తశేఖరులు 1860
పుండరీకాక్షునిఁ బొందినవారు
మనము సేయనిబహుమానము ల్పాండు
తనయుల కెవ్వరు దగఁజేయఁగలరు
వనితాలలామకు వలసినయన్ని
గొనివచ్చి దామముల్ గూర్చి యర్పించు 1865

వహికెక్కు భూషణావళులమన్నించు
బహుచిత్ర కాంచనాంబరము లిప్పించు
కినుక చాలించి మిక్కిలి గారవించు
మనవంద సెలవిచ్చి యనుపు మన్నంత
హరునివాక్యములకు నంగీకరించి 1870
నరవాహనుండు నానందంబునొంది

కుబేరుఁడు సౌగంధికములఁ దెచ్చి యిచ్చుట

ఘనతరసౌగంధిక ప్రసూనములు
వినుతభూషణములు విమలాంబరములు
తరుచైన దివ్యగంధంబులు మరియు
తిరమొంద వేవేగఁ దెప్పించి యపుడె 1875
చనవున బిలిచి యజాతశత్రువునకు
ననిలనందనున కర్జునునకు నకుల
సహదేవులకును బాంచాలపుత్త్రికిని
రహిమీరఁ జెలఁగి యలంకరించుటయు
హరిహరు లూర్జితానందులైరి 1880

హరిహరుల సంతోషము

అనుచుండి యుభయసైన్యంబు లుప్పొంగ
ధనపతి యాపురందరతనూభవుని
గనుఁగొని యనురక్తి గౌఁగిటఁ జేర్చి
క్ష్మాతలాధిప! హరిశ్చంద్రాదిపూర్వ
భూతలాధిపులందు బురుహూతముఖ్య 1885
దివిజనాథులయందు దిక్పతులందు
విచారింప నీసాటివీరులు గలరె
మును నిన్నుఁ జెప్ప సొంపున విందు నేఁడు
గనుఁగొనఁగలిగె కన్గవ చల్లనాయె;
పరశురాముఁడు నీకు ప్రతి యనవచ్చు 1890
శరలాఘవప్రౌఢిసంధానగరిమ;
నిటలాగ్నినయనుఁడు నీదీటువచ్చు
చటులబాహాటోపసాహసప్రతిభ;
జలజనాభుఁడు నీకు సరివచ్చు సమర
తలమున చిత్రయుద్ధంబులు నెరప; 1895
విపులమైఁ గలధరావిభు లెవ్వరైన

నృపచంద్ర నినుఁ జూచి నేర్పుకోఁగలరె
నిజబల్మి యున్నది నీరజాక్షుండు
విజయనీకాప్తుఁడై వెలయుచు నుండ
సాలంబులోన బాహాశక్తిఁ జూప 1900
నీలోకములను నీకెదు రెవరయ్య
యనుచు మెచ్చుచు బునరాలింగనంబు
లొనరించి తగువేడ్క నున్నంతలోన;

బ్రహ్మసత్యలోకమునకుఁ బోవుట

ఆవేళ పద్మజుం డధికమోదమున
భావజజనకుని భార్యాతిధవుని 1905
కడకతో సన్నుతు ల్గావించి మ్రొక్కి
తడయక పాండునందనుల దీవించి
యరుదైన హంసవాహనముపై నెక్కి
కరమర్థి సత్యలోకంబున కరిగె.

కుబేరుఁ డలకాపురమునకుఁ బోవుట

శంకరునకు నమస్కారంబుఁ జేసి 1910
పంకజాక్షున కట ప్రణామిల్లి పొగడి

నలువంద పాండునందనుల దీవించి
పొలుపొంద పాంచాలపుత్త్రి దీవించి
చెలువంబుతో సర్వసేనల గూడి
యలకాపురంబున కరిగె శ్రీదుండు
ప్రేమతో ధర్మజభీమార్జునులను 1915
వేమరు కృప గారవించి దీవించి
యదువంశభూషణుం డనుప నత్యంత

శివుఁడు కైలాసమునకుఁబోవుట

ముదమున గైలాసమున కేఁగె హరుఁడు

దుర్యోధనుఁడు కరిపురంబునకుఁబోవుట

తలఁప ధర్మజునకు దండంబువెట్టి
వలనొప్ప శౌరికి వలనొప్ప మ్రొక్కి 1920
యరుదార సకలసైన్యసమేతుఁ డగుచుఁ
గరిపురంబునకును గదలె రారాజు;

కృష్ణుఁడు ద్వారక కేఁగుట

ధర్మసూనునకు వందన మాచరించి
యర్మిలి భీమార్జునాదుల నెల్ల 1925

బరఁగ దీవించి ద్రౌపది నాదరించి
సరసోక్తులను నుపచారములఁ జేసి
యెలమి ఘటోత్కచు నెసగ లాలించి
యలరి వారలనుతు లంగీకరించి
యదువాహినులతోడ నబ్జలోచనుఁడు 1930
పొదలుచు ద్వారకాపురమున కరిగె;

ఘటోత్కచుఁడు వెడలుట

ఎలమితో జనకుల కెల్లను మ్రొక్కి
పొలుపొంద పాంచాలపుత్త్రికి మ్రొక్కి
రాజిల్లు మౌనివిప్రకులంబునకును
దేజంబుతో మ్రొక్కి దీవనలంది 1935
జనకుల యనుమతి సైన్యంబుతోడఁ
దననివాసముఁ జేరె దానవేశ్వరుఁడు

తర్వాతిభారతకథ

ధరమమహోన్నతులైన తమ్ములతోడ
పరమసాధ్వీమణి పాంచాలితోడ
వలనొప్ప బాంధవవర్గంబుతోడ 1940

నలరుచు నున్న ధార్తరాష్ట్రులతోడ
పోడిమి నావసుభూమి గొన్నాళ్ళ
వేడుకల్ మీరంగ విహరింపుచుండి
కడుద్వాదశాబ్దము ల్గడచినపిదప
తడయక ననుజులు ద్రౌపది తాను 1945
వెలయంగ నొకయేడు విరటునియొద్ద
గొలువుండి తర్వాత గురుతులు దెలిపి
యలరుచు నుత్తర కభిమన్యునకును
జెలగి వివాహంబు చేయించి వేగ
విరటుండు ద్రుపదభూవిభుఁ డాదిగానైన 1950
నరవరులరుదేర నలినలోచనుఁడు
ఘనతసహాయుండై గరిమతో నడువ
జని కురురాజుపై చల మగ్గలించి
మునుకొని సుముహూర్తమున సేనతోడ
మొనసి కురుక్షేత్రమున దండు విడిసి 1955
పెలుచసంగరమున భీష్ముఁ జెండాడి
నలవడ కలనిలో నాచార్యుఁ దునిమి

కరకరి బోరిలోఁ గర్ణునిఁ జంపి
సరభసం బగు నని శల్యునిఁ గూల్చి
కలఁగక నొంటరి కయ్యంబునందు 1960
తలపడి యురగకేతనుని ఖండించి
యురవడి తక్కిన యోధులనెల్ల
వరుసతో ఘోరాసహాముస మర్దించి
పరువడి యందుండి పాండుసందనులు
సరసిజాక్షుని కటాక్షంబునఁ జెలఁగి 1965
సకలభాగ్యంబులు సకలసంపదలు
సకలసౌఖ్యంబులు సకలవైఖరులు
ప్రకటించి సకలభూభాగమంతయును
బలువిడి సకలభూపాలకు ల్గొలువ 1970
నెలమి మహోన్నతి నేలుచు నుండె
ఈమహాచరితంబు హితసంభ్రమముల
వేమరు చదివిన వినిన వ్రాసినను
ప్రేమ లిఖించిన పృథ్వీతలమున
నామహామహులకు నాయు రారోగ్య 1975
బహుపుత్త్రపౌత్త్రసౌభాగ్యసంపదలు

మహనీయభూషణాంబరవస్తుతతులు
కరితురంగాందోళికాసికాయములు
కరిరాజవరదుండు కరుణతో నొసఁగు.
అని జనమేజయక్ష్మానాథమణికి 1980
జనసుతుం డైన వైశంపాయనుండు
వినిపించె పాండవవిజయకావ్యంబు
తనరు వేడుకలవిస్తారంబుఁగాఁగ
నెన్నాళ్లు రవిచంద్రు లెన్నాళ్లు తార
లెన్నాళ్లు గగనోర్వు లెన్నాళ్లు జగము 1985
లెన్నాళ్లు కులగిరు లెన్నాళ్లు జలధు
లెన్నాళ్లు వేదంబు లెన్నాళ్లు ధర్మ
మెన్నాళ్లు హరిచర్య లెసఁగుచునుండు
నన్నాళ్లు సకలరాజాస్థానములను
సకలవిద్వజ్జనసమ్మతం బగుచు 1990
నకలంకలీలల నలరుచు నుండు
అని యిట్లు కురుకరూశాంగకాశ్మీర
జననాథకీర్తిత సత్కీర్తి పేర

రణవీరఘుంటానిరాతంకమల్ల[1]
ప్రణుతసింహాతగాట పరబలభీమ
నిత్యాభిరాము నిర్నిద్రప్రతాప
సత్యహరిశ్చంద్ర సంగడిరత్న
పాలకగాయగోవాళహంవీర[2] 2010
కేళాదిరాయ సత్కీర్తికలాప
చలమర్తి వరగండ జగనొబ్బగండ
కలితాదవనిదుర్గగర్వవిభాళ
హత్తుమువ్వరగండ హర్యక్షశౌర్య
మత్తారి మదభంగ మదనావతార 2015
నక వసంతాంక గగ్గోలురాయ[3]
ఘనతరప్రజ మెచ్చు గండాదిఘోర
విరుదాంకు పేర గంభీరాబ్ధి పేర[4]

---

1. రణవీరఘుంటానిరాటంకమల్ల (త)
2. a. పాలక రాజగోపాల హంవీర (ట)
   b. పాయక గాయగోపాల హంవీర (త)
3. కనక వసంతాఖ్య గగ్గోలురాయ (త)
4. బిరుదాంకుపేర గంభీరునిపేర (త)

వరభోగనిర్జితవాసవు పేర[1]
రాచిళ్ల కొండభూరమణుని లింగ 2020
భూవరాగ్రణిపేర బుధులౌ ననంగ
నంకితంబుగ వెంకటాద్రీశుపాద
పంకజద్వంద్వ సేవావిహారుండు
రత్నాకరాన్వయ రాజితక్షీర
రత్నాకరక్షపారమణీధవుండు 2025
గురుభరద్వాజసద్గోత్రపావనుఁడు
ధరకొండ ఘనుకృష్ణధన్యునిసుతుఁడు[2]
సరసుఁడు గోపాలసత్కవీంద్రుండు
గరిమ నొనర్చు సౌగంధికప్రసవ
హారణాకావ్యమునందు యక్షనాయకుఁడు 2030
(గరిమ)సైన్యములతో గదలివచ్చుటయు[3]
వచ్చుట గని పాండువరతనూభవుఁడు

---

1. వరభోగనిర్జరవాసవు పేర (త)
2. ధరకొండ ఘనకృష్ణధన్యునిసుతుఁడు(ట ; త)
3. కవిబుధుల్ మెచ్చఁగా కారణముగాఁచు.

చెచ్చెర నాకసంధి సేయఁబూనుటయు
గాండీవి దాని విఘ్నంబు సేయుటయు
మండలాధిపునితో మక్కువ సేయ
ధనపతి తలఁచుట తత్సూనుజుండు 2035
వినకయుండుట బలు విక్రియ్య మగుట
తగ క్రీడి చిత్రయుద్ధంబు సేయుటయు
నిగుడి శిష్యుండు గాండీవిమార్గ్గనుట
పేరైన యోధులు బెనఁగిపోరుటయు 2040
నారాధి హనుమంతు దగ్ధనాయకుని
కనియుట బరికించి క్రీడి నిల్పుటయు
నని బహుళం బౌట యది విని హరుఁడు
యక్షాధిపతికి సహాయంబు సనుట
వీక్షించి కురుకులవిభుఁడు చింతిలుట 2045
సురనదీతనయుండు జోస్తేర్పరించి
గరిమధర్మతనూజు కలఁకదీర్చుటయు
హరిపాండవులకు సహాయంబు జనుట

హారిహారుల్ ధర్మజయముకునాథులకు 2065
గరిమ మీఱంగ సఖ్యంబు సేయుటయు
హరిహరులును సహాయమునచ్చువారు
సరగున నిజనివాసముల కేగుటయు
తమమేర జెల్లించి తగపాండుసుతులు
విమతులవధియించి వేడ్క నుండుటయు 2070
క్రమమున నది యాదిగాఁగల్గుకథల
నమరుచు నిది తృతీయాశ్వాసమయ్యె
భూరి సౌగంధికపుష్పాపహారణ
చారిత్ర మిది కథాసంపూర్ణమయ్యె
వెలయ నీపాండవవిజయకావ్యంబు 2075
సలలితహృదయులై సద్భక్తిగరిమ
నలరుచు బూజించి యానందమునను
చెలువంబుగలవారిచేఁ జదివించి
చదివినవారల చనవులఁ బ్రోచి
సదమలమతి కథాసావధానముల 2080

విన్నవారల కెల్ల విభవసంపదలు
సన్నుతవస్త్రభూషణములు గలుగు
నెల మూఁడువానలు నెలకొని కురియు
బలుసస్యసంఘము ల్ఫలియించు నెపుడు
సురుచిరకల్యాణశోభనంబులను
ధరణీజనము లెల్లఁ దనరుచుండుదురు. 2085

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1949.

# పద్య కావ్యము.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము | ... | 15 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ,, టీక | ... | 4 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు గలసంపుటము | ... | 4 | 0 |
| అరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 17 | ప్రతాపములును | ప్రతాపములు |
| 3 | 35 | చక్కెఱ | చక్కెర |
| 3 | 44 | దక్కన నేర్చిన | దక్కనంజేర్చిన |
| 4 | 48 | కోటను | కోఱకు |
| 4 | 49 | దురసు | దురుసు |
| 4 | 55 | పామున్న | సామున్న |
| 6 | 83 | గోరడ | గోండ. |
| 6 | 94 | ప్రమాణములు | ప్రణాముల |
| 6 | 95 | యాహారవిధులు | యాహారవిధుల |
| 9 | 135 | పద్మములు | పద్మముల్ |
| 9 | 136 | కవులు | కవుల |
| 9 | 137 | గుణుతించి | గణుతించి |
| 3 | 205 | యసలుగొని | యనిలునిగొని |
| 7 | 255 | వనితనొక్కత | వనితయొక్కత |
| 7 | 272 | అనుటనోఘుటనాఖ్య | ఘుటనోఘుటనవిఖ్య |
| 7 | 275 | నగణికనవరత్న | నగణితరత్న |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 17 | 285 | సైంధవాం[illegible] | సైంధవాందోళి |
| 18 | 294 | నిరినిరో | నిగుదిరో |
| 19 | 306 | మదంకితముగా | మదంకితము |
| 20 | 322 | రాసిచంద్రు | రాశిచంద్రు |
| 20 | 323 | నిపీతార | నిశీతార |
| 21 | 352 | విమతరాడ్బయు | విమతరాడ్భయ! |
| 22 | 356 | బెల్లుగో | జెల్లుగో |
| 23 | 375 | జగపతి | గజపతి |
| 24 | 385 | బరగు | బరగిన |
| 24 | 391 | పావనుండు | పావనుడు |
| 25 | 408 | పాటలంగ | పాటలు, గనిఖుం |
| 25 | 415 | పొంచ్చి | తొంచ్చి |
| 27 | 442 | సిద్ధాంబి | సిద్ధాంబ |
| 28 | 460 | శంకరసర్వేశ | శంకరాద్రీశ |
| 32 | 509 | వీరసేనలుజల్లు | వీరసేనలుచల్లు |
| 33 | 529 | ధరడొల్లి | ధరడొల్లి |
| 35 | 555 | దుగ్ర | దుగ్ర |
| 38 | 608 | పైసొచ్చి | పైకొచ్చి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 40 | 637 | మనుజాధిసాద | మనుజాధినాథుఁ |
| 41 | 655 | వితరణాంజ్ఞా | వితరణ జ్ఞా |
| 43 | 673 | విపగు | పరగు |
| 43 | 688 | చూఁడఁగ | చూడఁగ |
| 44 | 701 | జంఘీలా | జంఘికాల్ |
| 45 | 704 | నియూకములు | నికాయములు |
| 45 | 714 | యల | యిల |
| 46 | 723 | గాలంబు | కాలంబు |
| 52 | 57 | బోదలు | పోదలు |
| 55 | 106 | వరిపక్వంబులు | బరిపక్వంబులు |
| 57 | 131 | నుపరతి | ఉపరతి |
| 58 | 158 | బుట్టెడిని | పుట్టెడిని |
| 58 | 159 | యీచెంత | ఈచెంత |
| 59 | 162 | వెక్కువ | నెక్కువ |
| 60 | 180 | నిది | విది |
| 61 | 204 | యలసి | నలసి |
| 62 | 214 | వగలును | బగలును |
| 62 | 217 | యేకోర్కె | చేకోర్కె |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 64 | 246 | యానీలవేణి | నీనీలవేణి |
| 67 | 288 | నిఖిల | అఖిల |
| 68 | 316 | రథాంగ | రథాంగ |
| 72 | 385 | వినయంబున | వినయంబులో |
| 73 | 402 | నతని | యతని |
| 74 | 427 | యాహాసపు | సాహాసపు |
| 75 | 432 | యన్నడు | నన్నడు |
| 76 | 458 | యామనః | ఆమనః |
| 77 | 464 | యిందిందిరాలక | ఇందిందిరాలక |
| 77 | 468 | దివ్యాంబరములు | దివ్యాంబర్ములు |
| 79 | 506 | వాంఛలు | వాంఛల |
| 79 | 516 | కార్య | కార్య |
| 80 | 528 | రేఖ | రేఖా |
| 83 | 573 | మిమునూచుకొనుచు | మిమ్మునూచుకొని |
| 83 | 578 | శోతించి | శోధించి |
| 87 | 629 | యవనిపై | నవనిపై |
| 89 | 648 | యిరవొంద | ఇరవొంద |
| 90 | 683 | యేఫలంబు | నేఫలంబు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 92 | 717 | ధాపుణి | ధారుణి |
| 94 | 747 | నసుగొంటి | గనుగొంటి |
| 95 | 760 | వేమూరు | వేమారు |
| 96 | 767 | క[illegible]ప్రపై | కదుప్రలై |
| 97 | 799 | తెత్త | తెత్తి |
| 98 | 809 | గిరిగింజ | గురిగింజ |
| 98 | 813 | పొలపొంద | పొలుపొందగా |
| 99 | 822 | వనాంతమున | వనాంతము |
| 100 | 844 | [illegible]నుండి | గొననుండి |
| 105 | 927 | నకలంకలీల | నకలంకలీలల |
| 108 | 984 | హారిణీయత | హారిణీయుత |
| 118 | 1144 | మునుపు | మునుపె |
| 120 | 1182 | గా[illegible] | గాకయా |
| 124 | 1233 | కమలంబులనెంత | కమలంబులెంత |
| 126 | 1263 | మనోవేగ | మనోవేగ |
| 127 | 1279 | నిరుతి | నిరృతి |
| 128 | 1288 | గావింతునో | గాలింతునో |
| 129 | 1300 | రాజ | రాచ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 131 | 1340 | చేజేత | చేసేత |
| 131 | 1341 | [illegible]పంబు | పాపము |
| 134 | 1385 | పల్కా | పల్కా |
| 136 | 1419 | యాకడు | ఆకడు |
| 143 | 1484 | పం[illegible] | పంకేజ |
| 144 | 1509 | నెల్లపల | నెల్లెడలను |
| 147 | 1545 | పంచ[illegible]ారా | పంచ[illegible]ార |
| 152 | 1603 | నురుల | నురల |
| 155 | 1642 | [illegible]యున్న | ఈ[illegible]యున్న |
| 159 | 1703 | నొ[illegible]స్కుచు | మెస్కుచు |
| 160 | 1715 | పిచ్చుగుంట | పిచ్చుగుంటు |
| 160 | 1721 | మానవాధీశ | ఓమానవాధీశ |
| 161 | 1732 | శ్రీ[illegible]ంతున[illegible]న | శ్రీ[illegible]ంతునకు సైన |
| 165 | 1800 | కట్టటు | లట్టటు |
| 167 | 1823 | వార్ధిక్య | వార్ధక్య |
| 168 | 1838 | చంద్రుడు | భద్రుడు |
| 168 | 1848 | ధీమస | దీమస |
| 171 | 1884 | [illegible]ావి | ద్వాకి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 171 | 1885 | బెదరక | చెదరక |
| 176 | 1961 | నరుల్ | నదుల్ |
| 177 | 1979 | నిగుడి | నిగిడి |
| 181 | 2042 | యను వెల్ల | నను వెల్ల |
| 181 | 2043 | యనుప | ననుపమా |
| 183 | 2059 | మేఘుపాందోధి | మేఘపాథోధి |
| 184 | 2069 | నాదవీని | ఆపవనీ |
| 186 | 2094 | నతడు | యతడు |
| 188 | 19 | నగ్రజు | యగ్రజు |
| 191 | 66 | బరగు | పరగు |
| 191 | 67 | గామాడు | శామూడు |
| 195 | 141 | నుచ్చైశ్రవము | నుచ్చైఃశ్రవము |
| 196 | 145 | కామినీ | కామిని |
| 240 | 386 | నెమరేగి | యెమరేగి |
| 212 | 423 | జూండు | జూండు |
| 214 | 448 | సదలుచు | నదలుచు |
| 217 | 496 | గంపింప | కంపింప |
| 228 | 677 | సురల | సుదతుల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 230 | 714 | అమ...ందు | అమరేంద్ర |
| 232 | 746 | కొ...త్రాళ్లి | కోశత్రాళ్ల |
| 237 | 927 | శత్రుదవై | శాత్రవుడవై |
| 255 | 1073 | భూరిశ్రవ | భూరిశ్రవః |
| 253 | 1085 | ...సుతుడు | ...గసుతుడు |
| 254 | 1087 | ...ధరాధీశ | ధరాధీశ |
| 258 | 1168 | జర్ఝరిత | జర్జరిత |
| 264 | 1268 | బడ | పడ |
| 265 | 1281 | పదునాల్గు | పదున్న |
| 267 | 1329 | పదింటి | పదిటి |
| 271 | 1399 | నాదరో | యాదరో |
| 274 | 1435 | దామము | దామమ్ము |
| 274 | 1438 | జెంత | చెంత |
| 276 | 1464 | జనుదెంచి : | జనుదెంచియన్నడు .. |
| 277 | 1496 | భూరిశ్రవుల | భూరిశ్రవసుల |
| 278 | 1514 | నొక్కరుండు | నొక్కరుడు |
| 285 | 1619 | దత్తెలు | దత్తులు |
| 288 | 1680 | వీరులతో | వీసులతోడ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 289 | 1689 | యోధులు | యోదలు |
| 295 | 1793 | భ్రాజితంబు | భ్రాజితంబు |
| 313 | 2105 | విధము లు | విధమ్ములు |
| 315 | 2138 | యురు | యంరః |
| 321 | 2249 | నక్షత్రములు | నక్షత్రముల్ |
| 321 | 2252 | సమహిత | సుమహిత |
| 324 | 2311 | వరుణాంబకము | వరుణాంబకమ్ము |
| 25 | 2320 | గరుడుర్వది | గరుడులిర్వరి |
| 28 | 2383 | కేలాకై | కేలకై |
| 29 | 2397 | వేగ | వేవేగ |
| 29 | 2402 | ధనవంది | ధనువంది |
| 30 | 2412 | నర్మితో | నర్మిలితో |
| 32 | 2455 | శ్రీమహి | శ్రీమహీ |
| 34 | 2475 | రచియించినట్టి | రచించినయట్టి |
| 36 | 2509 | యివ్వలి | యవ్వలి |
| 36 | 2511 | నిల్చుటాది | నిల్చుటలా |
| 40 | 54 | యీబల | యీాబల |
| 41 | 76 | మోరాత | మూషీరాత |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 342 | 89 | సమయంబునని | సమయంబున |
| 345 | 146 | ధీరతో | ధీరతతో |
| 346 | 165 | నింతింత | నింతంత |
| 347 | 172 | గని | గాంచి |
| 348 | 192 | మహోత్సాహి | మహోత్సాహివీవను [చు |
| 348 | 196 | శూరు[illegible]చు | శూరుడవంచు |
| 350 | 231 | నగిని | నగరి |
| 355 | 307 | యయ్యగను | నయ్యగను |
| 355 | 308 | ముందర | మందర |
| 360 | 403 | లతిగ | లతిక |
| 366 | 499 | బెట్టు | బెట్టుగ |
| 377 | 684 | తరహాసు | దరహాసు |
| 387 | 845 | నాసమయమునను | నాసమయమున |
| 388 | 857 | గలరి | గలవ |
| 392 | 930 | రొంత | నొంత |
| 393 | 942 | డేగు | జేగు |
| 394 | 961 | మున్నగ | మున్నుగ |
| 395 | 968 | ఘుంకార | ఘీంకార |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 395 | 980 | బంధ | బంధు |
| 396 | 985 | సమయమునను | సమయమున |
| 400 | 1066 | పోసీః | పోసీకయుఁ |
| 401 | 1085 | బలిపెట | బలిపెట్ట |
| 402 | 1100 | ఈవాహినులను | వాహినులెకాప |
| 405 | 1139 | నని | యని |
| 413 | 1271 | నరిని | యరిది |
| 413 | 1275 | చిన్నయ | చిన్మయ |
| 418 | 1361 | పృథ్వి | పృథివి |
| 420 | 1401 | తెగువ | బిగువ |
| 422 | 1434 | దొరుల | దొరల |
| 427 | 1515 | యాబోతు | యాబోతును |
| 430 | 1568 | గురుతైన | దురుసైన |
| 436 | 1669 | పాటుల్లి | పాటిల్లి |
| 437 | 1679 | పాలిత | పాలి |
| 437 | 1687 | కైటా | కైట |
| 439 | 1713 | బడె | పడె |
| 442 | 1766 | రంజెల్ల | రంజెల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 441 | 1794 | పగుల | పూల |
| 446 | 1818 | మూదెద | వాదెద |
| 460 | 2036 | కస్తూను | కర్తనూ |